# చతుర

జనవరి 1982
సంపుటి : 4
సంచిక : 12



## ఈ నెల సమగ్ర నవల

పట్నంలో ఓ అర్ధరాత్రివేళ బలమైన బ్యాంకు లాకర్ను పకడ్బందీగా పగులగొట్టేరు. మరో నిశిరాత్రి పల్లెటూరి దేవాలయాన్ని నిలువుదోపిడీ పాల్జేశారు. అడ్డురాని అమాయకురాల్ని మానభంగం చేసి చంపేశారు.

పోలీసులు కుక్కలు చూపిన చెంచుల్నీ, సుగాలీల్నీ అరెస్టుచేసి లాకప్‌లో వేసి చావ బాదారు. అయినా వారు నోరు మెదపలేదు. సొత్తు దొరక లేదు. ఆ కసితో మొత్తం ఆ జాతి మీదనే....

## దాడి

ప్రారంభించేరు. ప్రతిగా వారు ఎదురు దాడి చేస్తే చివరికి ఏం జరిగింది? అమాయకులు–మాయకుల మధ్య రగిలిన ఘర్షణ పర్యవసానం ఏమిటి?

### ఆది రెడ్డి

ఉత్తేజకర చిత్రణ 'దాడి' ఈ నెల చతుర సమగ్ర నవల.



ముఖచిత్రం : బ్రహ్మదేవ్
రెండవ కవరు : జైపూర్‌లోని-'గల్టా'
మూడవ కవరు : జంతర్ మంతర్-జైపూర్
ఫోటోలు : సూరజ్ యస్. శర్మ.

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని ప్రతిబింబించే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపడం మంచిది.
* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 – 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతున్న నవలికలు చతురలో అచ్చులో 60–70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.
* *పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.*
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.
* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతో సహా నవల పంపాలి.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.
* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచననుబట్టి రు.1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

చతుర

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ - 500 004.

# చతుర

## తాకట్టు

అనగా అనగా ఫ్రాన్స్ దేశంలోని గ్యాప్ నగరంలో పాసన్నె అనే ఓ సద్గృహస్థుడు ఓ అద్దెకొంపలో నివసిస్తున్నాడు. అతనికి ఉన్నట్టుండి ఓ రోజు "ఇల్లుకట్టి చూడు, పెళ్ళిచేసిచూడు" అన్న సామెత గుర్తువచ్చింది. పెళ్ళిసంగతి తరవాత చూడచ్చు, ముందు ఇల్లుకట్టి చూద్దాం అనుకున్నాడు. పాపం ఇతను లక్షాధికారి కాదు గనక వడ్డీవ్యాపారుల అడ్రసులు తిరగేయక తప్పలేదు. అడ్రసులన్నీ పరిశీలించి చివరికి తనకు మంచి మిత్రుడయిన ఓ వడ్డీ వ్యాపారి దగ్గరకెళ్ళాడు. అతను విలువైన వస్తువులు కుదువపెట్టుకొని అప్పులిస్తుంటాడు. ఎంత స్నేహితుడైనా ఏ వస్తువూ లేకుండా డబ్బు ఇవ్వమనడం ధర్మం కాదుగదా. పైగా పాసన్నె దగ్గిర విలువైన వస్తువులేమీ లేవు. చివరికి పాసన్నె తలలోనుండి ఒక వెంట్రుకను పీకి వడ్డీ వ్యాపారికి ఇచ్చి దాన్ని కుదువపెట్టుకొని అప్పు ఇవ్వమన్నాడు. ఆ వడ్డీ వ్యాపారి పాసన్నె నిజాయితీ మీద నమ్మకం గలవాడవటం వలన నవ్వుతూనే ఆ వెంట్రుకను తీసుకొని అప్పు ఇచ్చాడు. అయితే ఈ విషయాన్ని వడ్డీ వ్యాపారి ఎంత తేలికగా తీసుకున్నాడో పాసన్నె అంత సీరియస్‌గా తీసుకున్నాడు. సరే ఇల్లు కట్టడం, అందులోకి మారడం అన్నీ జరిగిపోయాయి. పాసన్నె కష్టపడి డబ్బు సంపాదించి కొన్నేళ్ళలోనే వడ్డీతో సహా డబ్బుతెచ్చి వడ్డీవ్యాపారికి ఇచ్చి తాను తాకట్టు పెట్టిన తల వెంట్రుకను తిరిగి ఇవ్వమని అడిగాడు. వడ్డీవ్యాపారి తెల్లముఖం వేశాడు. అతను దాన్నెప్పుడో పారవేశాడని తెలీగానే పాసన్నె చిందులు తొక్కాడు. తన వస్తువు తనకు ఇచ్చి తీరాల్సిందేనన్నాడు. ఆ సంఘటనను నేను హాస్యంగా తీసుకున్నానని వడ్డీ వ్యాపారి



# ప్రపంచం

చెప్పినా వినకుండా పాసన్నే తన తల వెంట్రుకకోసం కోర్టుకెక్కాడు. ఈ తల వెంట్రుక తాకట్టు వ్యవహారం మీద 23 ఏళ్ళపాటు విచారణ జరిగింది. చివరికి కోర్టువారు పాసన్న తాకట్టుపెట్టిన తల వెంట్రుకను తిరిగి ఇవ్వలేకపోయినందున వడ్డీవ్యాపారి పాసన్నకు పదివేలపౌన్లు దాదాపు ఒకలక్షా 80వేల రూపాయలు నష్టపరిహారంగా ఇవ్వాల్సిందేనని తీర్పు ఇచ్చారు. చిక్కముహం వేసుకొని ఆ వడ్డీవ్యాపారి ఆ మొత్తం సమర్పించుకుంటే పాసన్న ఆ డబ్బు తీసుకొని మీసం మెలి వేసుకుంటూ ఇల్లు చేరాడు.

## చిత్ర విచిత్రాలు

రేజర్ బ్లేడులు నమలడం, మూసిన కంటి మీద ఇనప చువ్వ ఒక చివర అన్చి దాన్ని వంచడం, కనురెప్పలతో సూదులను ఎత్తడం, కత్తులతో తయారుచేసిన నిచ్చెన ఎక్కడం వంటివి 'నమ్మ నమ్మకపో' పుస్తకాల్లో విషయాల్లా అన్పించవచ్చు. కాని ఈ సాహస కార్యాలను ఓ 15 మంది స్త్రీ, పురుష బృందం అతి సులభంగా చేసి చూపిస్తుంది. వీరందరూ వారి వారి కళల్లో నిష్ణాతులు.

నిజానికి వీరివద్ద ఎలాంటి మంత్ర తంత్రాలు, ట్రిక్కులు లేవు. వీటిలో కొన్ని యోగసాధన వల్ల అయితే మరి కొన్ని కేవలం శిక్షణ, సామర్థ్యంతో చేసేవి. ఈ బృందంలోని 16 ఏళ్ళ అమ్మాయి సంతారా నాలుగు అంగుళాల పొడవుగల సూదులను కనురెప్పలతో పట్టుకొని ఎత్తగల నేర్పరి. మరో యువతి కళ్ళతో, మెడతో మందంగా ఉన్న ఇనప చువ్వలను వంచగల దిట్ట.

ఇనపచువ్వ ఒక చివర జత చేయ బడిన అర్ధ చంద్రాకారపు పరికరం ఈమె మెడకు తగిలించబడుతుంది. చువ్వ





# మీ చేతుల్లో ఒదిగిపోయే తారామణి హారం
# మీ కన్నుల్లో వెలుగులు చిమ్మే దివ్వెల తోరణం

- చలనచిత్ర పరిశ్రమలోని ప్రతి రంగం గురించీ సమగ్రమైన సమాచారాన్ని అందిస్తుంది 'సితార'

- ఆబాలగోపాలాన్ని తన అందచందాలతో ఆకర్షిస్తుంది 'సితార'

- రంగుల ముఖచిత్రాలతో, అభిమాన తారల వర్ణచిత్రాలతో, తాజాతాజా ఖబుర్లతో మిమ్మల్ని మురిపించే మరిపించే అంశాలతో, ఎన్నెన్నో విశేషాలతో వారం వారం వెలువడుతుంది 'సితార'

## సితార

సమగ్ర సినీ వారపత్రిక

రూపాయి మాత్రమే

ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడా, హైదరాబాదు-500004

మరో చివరను స్టేజి మీద బలంగా నిలబెడతారు. ఈమె నెమ్మది నెమ్మదిగా ఎగురుతూ ఇనపచువ్వను వంగదీసి చివరికి తల పిన్నులా వంచేస్తుంది. ఆమె మెడమీది పరికరం తొలగిస్తే ఇనపచువ్వ మెడమీద కోసుకున్న గాయం కూడా కన్పిస్తుంది.

ఈ సాహస కార్యాలను చేయడానికి వీరు ఏమాత్రం భయపడరు. పైగా ఇది వారి వృత్తి కూడా. చాలా చిన్నతనం నుంచే వీరు ప్రమాదభరితమైన ఫీట్స్‌ను చేసి చూపిస్తుంటారు. ఈ బృందంలోని డాక్టర్ అశోక్, ఇందిరా బ్లేడులను, ట్యూబ్ లైట్లను తినడమేగాక ద్రావకాన్ని (ఏసిడ్) మంచి నీళ్ళలా తాగడం కూడా ప్రదర్శిస్తారు. అశోక్ పగిలిన గాజు ముక్కల మీద నడవడమేగాక నిప్పు కణికలతో స్నానం చేస్తాడు కూడా. మరొకతను మేకుల పక్కమీద పడుకొని పైన మరోటి అతని మీద పెట్టించుకొంటాడు. దాని మీద ఇటికలు పెట్టి సుత్తితో పగలగొడతారు. కొందరు అబ్బాయిలు పైకి ఎక్కి గంతులేస్తారు. అయినాఅతనికేమీఅవదు.ఇదియోగసాధన ద్వారా సాధ్యపడుతుంది. రవి ఆనంద్ అనే మరొకతను ఎర్రగా కాలుతున్న కత్తిని నాకుతాడు. చాంద్‌పాషా అతని గొంతులోని నరాలతో ఒక రకమైన వాయిద్యాన్ని విన్పిస్తాడు. గౌతమ్ అనే వ్యక్తి రకరకాల రంగుల ద్రవాలను తాగి తిరిగి వాటిని అదే రంగుల్లో బయటికి తెప్పిస్తాడు. వీరందరూ ఒక బృందంగా ప్రదర్శనలిస్తూ ప్రజలను తమ సాహస కార్యాలతో ఆనందపరవశులను చేస్తుంటారు. మనిషి ప్రయత్నించాలేగాని సాధ్యం కానిది లేదని వీళ్ళని చూస్తే అన్పించి తీరుతుంది.

# లాయరు పేచీ

బ్రసెల్స్‌లో నివశించే రాబ్వెన్స్ బాగా పేరున్న క్రిమినల్ లాయర్. ఈయన్ని అండర్ వరల్డ్ లాయరని అంటారు. ఈయన ఫీజు దండిగా వసూలు చేసినా పేరుమోసిన క్రిమినల్ లాయర్ గనక క్లయింట్స్ 'క్యూ'లో నిలబడి వుండేవారు.

కోర్టులో వాదించని రోజున ముఖ్యమైన కేసుల్లో పరోక్షంగానైనా అతని చెయ్యి వుండేది. ఇతని ప్రతిభను అటు నేరస్తులు, ఇటు న్యాయస్థానం వారుకూడా గుర్తించారు. కనుక రెండు వైపుల నుంచీ అతని దగ్గిరకి క్లయింట్స్ వచ్చేవారు. ఉన్నట్లుండి లాయర్ మహాశయుడు అర్హత గల లాయరు కాదని, లా పరీక్షలు ఫెయిలవడం మాట అటుంచి అసలు పరీక్షలురాసే ప్రయత్నంకూడా ఎన్నడూ చేయలేదని ఓ నిప్పులాంటి నిజం బయట పడింది. ఈయన ఫ్యాక్టరీలో అప్రెంటిస్‌గా చేరడానికని పద్నాలుగవ ఏటనే స్కూలు వదిలేశాడని తేలింది. అయితే ఇతనికి న్యాయపరమైన విషయాలలో ఆసక్తి వుండటాన లా పుస్తకాలు తెగ చదివేసి మారుపేరుతో ప్రాక్టీసు పెట్టాడు. ఈ సంగతి బయట పడగానే లాయర్ గారు మూటాముల్లె సర్దుకొని ఫ్రాన్స్ దిలి పారిపోయారు. అయితే చివరికి ఇతన్ని అరెస్ట్ చేసి అక్రమ న్యాయ కార్యకలాపాలకు పాల్పడ్డాడన్న నేరాన్ని మోపారు. క్రిమినల్ లాయర్‌గారు చివరికి తన కేసునే స్వయంగా వాదించుకోవాల్సిన పరిస్థితి ఏర్పడింది.

# పీడకలలు

పీడకల రాగానే కేకలు వేస్తూ లేవడం, ఇంట్లో వాళ్ళని గాబరాపెట్టి, నానా హంగామా చేసి ఆఖరికి ఓ గ్లాసుడు మంచి నీళ్ళు తాగి పడుకోవడం మామూలే. చాలా మంది నిపుణులు పీడకలలు రావడం ఆరోగ్యానికి మంచిది అంటున్నారు. పీడకలలు రాకపోతే నిజజీవితమే ఓ పీడకలలా గడుస్తుందట. 'మెదడు తనలోని భయంకరమైన జ్ఞాపకాలను తొలగించడానికి చేసే ప్రయత్నమే పీడకల' అని ఫ్రెంచ్ జాతీయ విజ్ఞాన శాస్త్ర పరిశోధనశాలలో పనిచేసే వైద్యుడు వివరించాడు. పీడకలలు మనసులో గుప్తంగా వున్న భయాలు, ఆందోళనలను తగ్గించడానికి సహాయపడతాయి.





సాధారణంగా మనకు కలలు వచ్చేటపుడు మెదడు కొత్త జ్ఞాపకాలను సమీక్షించి భవిష్యత్‌లో రిఫరెన్స్ కోసం కొన్ని మంచివాటిని నమోదు చేసుకొని చెడు జ్ఞాపకాలను బయటికి నెట్టేస్తుంది. మనసు చెరిపి వేయడానికి వీల్లేని వాస్తవ సమస్యలను సమీక్షించేటపుడు పీడకలలు వస్తుంటాయి. పీడకల సాధారణంగా రాత్రి రెండో భాగంలో వచ్చి కలలో భయంకరమైన సంఘటన జరిగే ముందు మెలకువ వచ్చేస్తుంది. అంటే ఓ కొండ మీదనుంచి పడిపోతున్నట్లు కలవస్తే కింద రాళ్ళమీద పడబోయే సమయానికి మెలకువ వచ్చేస్తుంది. రాళ్ళమీద పడి ఒళ్ళు హూనం అవడం అంటే ఎలా వుంటుందో మనసు ఊహించలేకపోవడమే దీనిక్కారణం. సాధారణంగా పీడకలలు పై నుంచి పడిపోతున్నట్లు వస్తుంటాయి. తర్వాత ఎవరో దాడి చేస్తున్నట్లు, చనిపోతున్నట్లు, దివాలా తీసినట్లు వస్తాయి. పీడకలలు ఎక్కువగా మగవారికి వస్తాయట.

ఒకే పీడకల రెండు సార్లు రావడం అసాధారణమే అయినా కొందరికి ఒకే పీడకల ప్రతి రోజూ కొన్ని వారాలపాటు వస్తుంటుంది. కొందరు కేవలం నలుపు, తెలుపుల్లో మాత్రమే కలలు కంటారట. కొన్ని కలలు రాబోయే ప్రమాదాలను సూచించడం నిపుణులను ఆశ్చర్యపరిచింది. 1966లో ఓ కొండచరియ విరిగి పడి కిందనున్న స్కూల్లోని 116 మంది బడి పిల్లలు, 28 మంది పెద్దలు చని

పోయిన ప్రమాదం జరగక ముందు ఆ ఊర్లోని చాలా మందికి భయంకరమైన కలలు వచ్చాయి. కొందరు కలలో పర్వతం లాంటి బొగ్గు గుట్ట జారి స్కూల్ మీద పడటం చూశారు.

ఇకపోతే పీడకలలను నివారించే అవకాశమేదీ లేదు. అయితే వీలయినంత తక్కువ పీడకలలు వచ్చే ఉపాయంవుంది. పంచదార కలిసిన ఆహారపదార్థాలు తినడం వలన పీడకలలు ఎక్కువగా వస్తాయని తేలింది. కనక నిద్రపోడానికి ఓ అరగంట ముందు వరకూ తీపి పదార్థాలు ఎక్కువ తినకూడదు. ఇంకా అపరాధ పరిశోధన, మిష్టరీ నవలలు వగైరా బి. పి.ని పెంచే పుస్తకాలు నిద్రపోయే ముందు చదవకూడదు అని నిపుణులు సలహా ఇస్తున్నారు.

## పవిత్ర పాదరక్షలు

'రక్షలు రక్షలు పాదరక్షలు
నాట్యశిక్షలో బాలశిక్షలు'

అన్నాడో సినీకవి. చెప్పుల మాటెలా వున్నా వాటి ధరలు ప్రస్తుతం మనందరి చేత నాట్యం చేయిస్తున్నాయనుకోండి, అది వేరే విషయం.

పూర్వం చెప్పుల్ని, బూట్లని చాలా పవిత్రమైన వాటిగా భవించేవారు. అదృష్టానికి, ఫలవంతమైన జీవితానికి చెప్పుల్ని సంకేతంగా భావించి పెళ్లికూతురు, పెళ్లికొడుకుని వూరేగించే కారుకి పాత బూటు నొకదానిని కట్టేవారు. కొన్నాళ్ళకి వివిధ పదార్థాలతో చేసిన బూట్ల బొమ్మలను ఇళ్ళలో అలంకరించుకోవడం అలవాటుగా, సంప్రదాయంగా మారింది.

మట్టి, పింగాణీతో చేసిన బూట్లలో వెల్వెట్ నింపి పిన్నులు గుచ్చుకునే స్టాండుగాను, డ్రెసింగ్ టేబులు మీద అలంకరణ వస్తువుగాను అమర్చుకుంటారు. సత్తులోహం, కొమ్ము, చెక్కతో చేసిన బూట్ల ఆకారంలో గట్టి మూత ఉండేవాటిని నస్యం డబ్బీలుగా వాడుతారు.

కొందరు సిగరెట్లు తాగే ప్రబుద్ధులు అగ్గిపెట్టెలోంచి పుల్లని మాత్రం తీసుకుని బూటు అడుగుభాగానికి రాసి వెలిగించుకుంటారు. గుర్రంమీది కెక్కేందుకు వుపయోగించే రికాబులను బూట్ల ఆకారంలో గాజుతో తయారు చేయడం, పుష్ప గుచ్ఛాలను అమర్చేందుకు వెండితో బూటు ఆకారంలో హోల్డర్‌ను తయారు చేయడం, లవ్ లెటర్లను దాచుకుందుకు షూ ఆకారంలో చిన్న పెట్టెలను తయారు చేయడం ఎంతో పరిపాటి అయిపోయింది విదేశాల్లో. అందంగా కనబడాలేగాని అలంకరణకు అనర్హమైంది లేదుగదా !



చెవులు చిల్లులు పడేలా ఉరుములు ఉరుముతున్నాయి. మెరుపులు జిగేల్ మని మెరుస్తున్నాయి. వర్షం కుండ పోతగా కురుస్తున్నది. రోడ్డు పట్టకుండా నీరు పారుతున్నది. రోడ్డు మీద జనం లేరు. కనీసం కుక్కలు కూడా లేవు. ఇండ్ల తలుపులు బిగించి చలికి వణకుతూ లోపల పడుకున్నారు జనం. పోలీసు స్టేషన్ వరండాలో కూడా ఎవరూ లేరు. లోపల రైటర్ రూంలో కోటు వేసుకొని చలికి వణకుతూ, బల్లమీద ముడుచుకుని కూర్చున్నాడు కానిస్టేబుల్. వీధి లైట్ల వెలుతురు వర్షంలో సరిగా కన్పించడం లేదు.

ఆ వాతావరణాన్ని చీల్చుకుంటూ ఒక అంబాసిడర్ కారు నెమ్మదిగా వచ్చి బాంకు ఎదురుగా నిలబడింది. ఆ వర్షం, ఉరుముల మోతలలో కారు శబ్దం విన్పించే అవకాశం లేదు. కారులో నుండి ఎనిమిది మంది దిగారు. ప్రహరీ గోడ దూకి, బాంక్ ఆవరణలో ప్రవేశించారు. ముందు ద్వారం రెండు తాళాలతో భద్రంగా బిగించబడి ఉంది. వారిలో ఒక వ్యక్తి పాంటు జేబునుండి సీసా తీసి ముందుకు వచ్చాడు. ఆయిల్ రెండు తాళాలలో పోశాడు. గరగరమంటూవిడిపోయాయవి. తలుపులు బార్లా తెరిచారు.

"నలుగురు బయట నిలబడండి. నలుగురు మాత్రం లోపలకు వెళ్ళండి. ఆలస్యం కాకూడదు. పది నిముషాలలో ఈ ప్రాంతం దాటి వెళ్ళాలి. ఊ" అన్నాడు ఒక వ్యక్తి.

ఫెల్ట్ హాట్లు మరింత ముందుకు లాగి, నలుగురు లోపలకు దూరారు. బయటున్న నలుగురూ పిస్టల్స్ చేతుల్లోకి తీసుకుని వసారాలో, నలువైపులా నిలబడ్డారు. డ్రైవరు కారు వద్దనే స్టీరింగ్ ముందే కూర్చున్నాడు మేడపైకి చూస్తూ.

లోపలికెళ్ళిన నలుగురూ సరాసరి స్ట్రాంగ్ రూం వద్దకు వెళ్ళారు. యాసిడ్ ఉపయోగించి తలుపులు తెరిచి లోనికి వెళ్ళారు. ఎదురుగా ఉక్కు బీరువా దర్శనమిచ్చింది. రెండు గజాల వెడల్పు, గజం మందం, రెండు గజాల ఎత్తున మందపోతతో తయారైన ఉక్కు బీరువా అది. దానికి ఏ వైపు తాళం తీయాలో తెలియదు. కనీసం ఓ చిల్లు కూడా కన్పించడం లేదు. ఒక వ్యక్తి బయటకు పరుగెత్తుకు వచ్చి నాయకుడికి వివరాలు ఇచ్చాడు. ఇద్దరూ కలిసి కారు వద్దకు వచ్చారు. డిక్కీలోంచి చిన్న సైజు జనరేటర్ బయటకు తీశారు. వర్షంలోనే ఇద్దరూ కలిసి లోపలకు మోసుకొని వచ్చారు. బీరువా ముందు జనరేటర్ పెట్టి, ప్లగ్ స్విచ్ బోర్డుకు తగిలించారు. సన్నటి నిడుపాటి కత్తికి ఉన్న వైర్లను జనరేటర్‌కు తగిలించి కరెంట్ ఆన్‌చేశారు. 'సర్'మన్న శబ్దంతో జనరేటర్ తిరుగుతూ కత్తికి వేడి అందిస్తున్నది. కత్తిని బీరువా ముందు భాగం మీద ఫోకస్ చేశారు. ఉక్కు బీరువా వేడెక్కిపోయి ఎర్రగా తయారవుతున్నది.

"మరింత వేడి ఎక్కనివ్వకు. లోప లున్న బంగారు వస్తువులు కూడా కరుగు తాయి" అన్నాడు బాస్.

"వేడి ఎక్కకుంటే వెంటనే తెగి పోవడం సాధ్యంకాదు బాస్! ఉక్కు మెత్తబడితేకాని సులభంగా కోయలేము" అన్నాడు అతను.

"బలవంతంగానయినా కోద్దాం. ఇంత ప్రయాసపడి లోపలున్న బంగారం దెబ్బ తింటే లాభమేమిటి? ఆపు చెయ్యి"




అన్నాడు ఆదేశిస్తూ.

వేడి ఎక్కించడం ఆపుచేసి, కత్తి తగిలించాడు జనరేటర్ వైర్లకు. బీరువా వద్దకు కత్తిని తెచ్చి, నాలుగు వైపులా కోయడం సాగించాడు. మూడు నిమిషాల్లో పలక ఊడి కింద పడింది. జనరేటర్ ఆపుచేశారు. లోపలున్న బంగారాన్ని చూస్తూ నిలబడ్డారు నలుగురూ సిగరెట్లు తాగుతూ.

కింద ఏదో అలికిడి జరుగుతున్నట్లు అనుమానం కలగడంతో పై అంతస్తులోనే కాపురం ఉంటున్న మేనేజరు లేచి తలుపు తెరిచాడు. అది చూసిన డ్రైవరు కారులో నుంచే టార్చి లైటు ఆవరణలోకి వేశాడు పైకీ, కిందికీ ఆడిస్తూ. ఆవరణలోని ముగ్గురూ పరుగెత్తుకుంటూ వసారా దాటి బయటకు వచ్చారు. టార్చి వెలుతురు పైకి వేశాడు డ్రైవరు. వర్షంలోనే తడుస్తూ పైకి చూశారు. పైన మేనేజర్ అనుమానంగా టార్చ్‌నూ, కారునూ, బయట వర్షంలో నిలబడ్డ నలుగురినీ చూస్తుండగానే పిస్తోలు పైకి గురిపెట్టి ఒకడు అరిచాడు "కదిలినా, అరచినా ఛస్తావు!"

అప్పటికే అతనికి అర్థమయింది దోపిడీ జరుగుతున్నదని. నలుగురి చేతుల్లో పిస్తోళ్ళు ఆ వర్షపు జల్లుల్లో మిలమిల మెరుస్తున్నాయి. ప్రాణం తెగించి అరవాలని కానీ, లోపలకు పారిపోవాలని కానీ అతడు అనుకోవడం లేదు. బతికుంటే బలుసాకు తినవచ్చుననే సామెత నెమరు వేసుకుంటూ చేతులు పైకెత్తి నిలబడ్డాడు. ముగ్గురూ వర్షంలో అతని వైపే చూస్తూ పిస్తోళ్ళు గురిపెట్టి నిలబడ్డారు.

లోపల ఉక్కు వేడితగ్గుతూనే బంగారాన్ని సంచుల్లో వేశారు. నోట్ల కట్టల్ని మరో సంచిలో వేశారు. ఇద్దరు జనరేటర్ పెట్టె ఎత్తుకున్నారు. ఒకరు సంచులు చేతపట్టుకున్నాడు. మరొక వ్యక్తి ముగ్గురి వెనుక వస్తున్నాడు. వెనుక బాస్ బయటకు వచ్చాడు.

"బాస్ ! మేనేజర్ మేల్కొన్నాడు. మనం ఫోన్ కట్ చేయలేదు. మనం వెళ్తూనే వీడు ఫోన్ చేయవచ్చు" అన్నారు ఒకరు. బాస్ పైకి చూశాడు. మేనేజరు చేతులు పైకెత్తి నిలబడ్డాడు. అతని ముఖంలో భయచిహ్నాలు కన్పించాయి. అతన్ని కాల్చి చంపితే, ఇంట్లో వాళ్ళు శబ్దానికి లేస్తారు. ఆ తర్వాత ఒకరి కొకరు అందరూ లేస్తారు. అప్పటి కప్పుడు తాము దొరకకపోవచ్చు. కానీ వెంటనే తమ కారును వెంటాడే అవకాశా లుంటాయి. బాస్ సైగతో ఒక వ్యక్తి బాంకు వెనుకకు వెళ్ళి వచ్చి, "మెట్లు వెనుక వైపు ఉన్నాయి సార్" అంటూ అరచాడు. బాస్‌తోపాటు ముగ్గురు వెనుకకు పరుగెత్తి మేడ ఎక్కారు. మేనేజరు మీదపడి నోటిలో గుడ్డ కుక్కారు. కాళ్ళు చేతులు తాళ్ళతో కట్టిపేసి కిందికి దిగి వచ్చారు. అందరూ ఎక్కుతూనే కారు బరువుగా ముందుకు కదిలింది. తొమ్మిది మందిని మోసుకుంటూ అంబాసిడర్ కారు పాణ్యం వైపుగా సాగింది. వర్షం తగ్గే సూచనలు కన్పించడం లేదు. బేతంచర్ల వాగు పొంగి వస్తున్నది. రోడ్డు మీద నీరు అటు ఇటు దొర్లుతూ పరుగిడుతున్నది. మెరుస్తున్న మెరుపుల కాంతిలో ముత్యాలు దొర్లిపోతున్నట్లుంది నల్లటి రోడ్డు మీద. బాస్ సిగరెట్ పీలుస్తూ ఫ్రంట్ సీట్లో కూర్చొని ఆలోచిస్తూ ముందుకు చూస్తున్నాడు.

* * *

ఉదయమే పోలీసులు బ్యాంకుకు

చుట్టుకున్నారు. సన్నగా తుంపరలు పడు తున్నా జనం లెక్కచేయకుండా బ్యాంకు ముందు నిలబడ్డారు. జనాన్ని లోపలకు రానివ్వకుండా చేయడానికి పోలీసులు లాఠీలు పైకెత్తి హూంకరిస్తున్నారు. వారి బెదిరింపులను జనం లెక్కచేయడంలేదు. దేశంలోనే మొదటిసారిగా సరికొత్త పద్ధతిలో జరిగిన బ్యాంకు దోపిడీ ఆరాలు తెలుసుకోడానికి కుతూహలంతో జనం ఎగబడుతున్నారు. తూర్పున తెలతెల వారుతున్నది. మబ్బు పట్టడంవల్ల అరుణ రేఖలు కన్పించడంలేదు. వీధుల్లోనున్న చెత్త వర్షానికి కొట్టుకొనిపోవడంతో రోడ్లు పరిశుభ్రంగా ఉన్నాయి. పోలీసులు లోపల కాలి గుర్తుల కొరకు, చేతి గుర్తుల కొరకు వెతికారు. అవి అన్నీ శుభ్రంగా తుడిచివేయబడ్డాయి. వేలి గుర్తులు దొరక లేదు. బయట కాలి గుర్తులు బురదతో చెల్లాచెదరై ఉన్నాయి. వాటిని ఆనవాలు పట్టడం అసాధ్యం. బయట వర్షంలో నిలబడ్డప్పుడు వేయబడిన అడుగులు, కారువద్ద నిలబడ్డ అడుగులు లేవు. వసారాలో మట్టితో కూడిన బూట్ల అడుగులే ఉన్నాయి. మేడపైన కూడా అటువంటివే.

మేనేజర్‌ను ఆఫీసులోకి పిలిపించి వివరాలు చెప్పమన్నారు. అప్పటికే ఏ పదిసార్లో చెప్పాడు. దాన్నే మళ్ళీ రిపీట్ చేశాడు అతను.

"మళ్ళీ చూస్తే వాళ్లను గుర్తు పట్ట గలరా?"

"అసాధ్యం. అందరి ముఖాలమీద సగం కప్పబడ్డ టోపీలు ఉన్నాయి. అందరూ రెయిన్ కోట్లతోనే వున్నారు. వర్షంలో ముఖాలు సరిగా కన్పించలేదు"

"పోనీ ఒడ్డూ, పొడుగు గుర్తించ గలరా?"

తల ఊపాడు మేనేజర్. "అంత వరకూ గుర్తించగలను".

"లావూ, సన్నం గుర్తించగలరా?"

తల ఊపాడు మేనేజర్.

"మీ ఉద్యోగుల్లో ఎవరయినా ఈ బ్యాంకు వివరాలు అందివ్వనిదే బయట వారికి తెలియడం అసాధ్యమని మేం భావిస్తున్నాం"

"ఏమో! నేను ఆ విషయం నిర్ధారణగా చెప్పలేను. ఇందులో తెలియనంత ఇదిగా ఏమీలేదు. బ్యాంకు అద్దె ఇంటిలో ఉంది. ఈ ఇంటిని గురించి గతంలో అందరికీ తెలిసే వుంటుంది. పోతే బంగారం, డబ్బు ఏ రూంలో వుండేది ఎవరికైనా తెలుస్తుంది. దానికి ప్రత్యేకంగా రూం ఏర్పాటు కన్పి స్తున్నదిగదా! అందువల్ల బ్యాంకు ఉద్యోగు లకు తెలియకుండా జరగడానికీ అవకాశా లున్నాయి"

"మీకు ఎవరిమీదైనా అనుమానా లేవయినా ఉన్నాయా?"

"దొంగతనం జరుగుతుందేమోనని ముందే ఎవరినయినా అనుమానిస్తూ కూర్చోవాలా ?"

యస్.పి. జవాబివ్వలేదు. మేనేజరు మీదనే అతడికి అనుమానంగా వుంది. ఏమో! ఏ పుట్టలో ఏ పాముందో? ఇంత ఆస్తిని కైవసం చేసుకోడానికి ఎందుకు ప్రయత్నించకూడదూ? కాని ఆ విధంగా వాదించేందుకు యస్.పి.కి హక్కు లేదు. బ్యాంకు మేనేజర్‌స్థాయి, తన బంట్రోతు స్థాయికాదు బెదిరించడానికి. వాళ్ళకూ యూనియన్‌లున్నాయి. నాయకత్వాలు వున్నాయి. వరుస మారితే తన జుట్టు పట్టుకుంటారు. అందువల్ల తొందరపడి అనుమానించడం మంచిది కాదను

కున్నాడు.

ఇంతలో బ్యాంకు ఉద్యోగులు వచ్చి అకౌంట్లు తీశారు. పదిహేను కిలోల ఆరు వందలా యాభై గ్రాముల బంగారం, లక్షా ముప్పైనాలుగువేలరూపాయలనగదు తస్కరించబడ్డాయి. స్ట్రాంగ్ రూంలోనే నేలలో గుంటతీసి పూడ్చబడిన బీరువాలో డెబ్భై కిలోల బంగారం వుంది. దాని వివరాలు ఎవరికీ తెలియకపోవడంతో అక్కడ మరో బీరువా వున్నట్లు దొంగలు భావించలేకపోయారు. పోయిన మొత్తం లెక్కవేస్తే పధ్నాలుగు లక్షల యాభైవేలు దాటింది. ఆ మొత్తం దొంగల చేతికి అందిందన్నమాట.

పది గంటలకు రీజనల్ ఆఫీసు నుండి బ్యాంకు ఆఫీసర్లు వచ్చి వివరాలు తెలుసుకున్నారు. అక్కడ వాచ్‌మన్‌ను ఏర్పాటు చేయమని మేనేజరు ఎన్నిసార్లు కోరినా ఆఫీసర్లే తాత్సారం చేశారు. అందుకే వారు నోరు మెదపలేదు.

సాయంత్రం మూడు గంటలకు హైదరాబాదు నుండి రెండు కుక్కలు రప్పించబడ్డాయి. కుక్కలను తెచ్చి కారు నిలబడినచోట, బ్యాంకు ఆవరణ, వసారా, స్ట్రాంగ్ రూం, మేడ పైభాగం అంతా తిప్పారు. రెండు కుక్కలూ వగరుస్తూ పది నిమిషాలు వసారాలో నిలబడ్డాయి. అక్కడినుండి లేచి జీప్ ముందుకు వచ్చాయి. అంబాసిడర్ కారు నిలబెట్టిన చోట పోలీస్ జీప్ సిద్ధంగా వుంది. జీప్‌లో కుక్కలు ఎక్కడంతోనే పోలీసులు, ఆఫీసర్లు కొందరు అందులో ఎక్కారు. మరో రెండు వ్యాన్లు, జీపు వెనుక కదిలాయి. కుక్కలు అటుఇటు చూస్తూంటే పాణ్యం రోడ్డువైపు సాగాయి వాహనాలు.

* * *

పది గంటలకే వర్షం వెలిసిపోయింది. మేఘాలు దట్టంగా కమ్ముకున్నాయి. వర్షం వచ్చే సూచన అగుపించటంలేదు. చలిగాలి రివ్వున కొడుతున్నది.

పాణ్యానికి మూడుమైళ్ళ దూరంలో కొండగుట్టమీద 'సుగాలిమెట్ట' వుంది. ఆ పక్కనే చెంచుగూడెం వుంది. రెండింటి మధ్య ఫర్లాంగు దూరం. మధ్యన వాగు. రాత్రిపడిన విపరీత వర్షం మూలంగా వాగు పైనుండి వస్తున్న నీరుతో పొంగి పారుతున్నది. ఆ గ్రామంమీదుగా వెళ్ళే రాష్ట్రీ రహదారి సల్లగా కన్పిస్తున్నది. వాహనాలు వస్తూ పోతూ ఉన్నాయి.

చెంచుగూడెంలోని తన ఇంటిలోనుండి డొక్కాడు బయటకువచ్చాడు. అతని అసలు పేరు వీరన్న. అక్కడున్న ముప్పై ఇళ్ళ చెంచుగూడేనికి తిరుగులేని నాయకుడు. తలకు గట్టిగా గుడ్డ బిగించుకున్నాడు. గోచి సర్దుకుని, వీధిలోకి వచ్చేసరికి నత్తిజమాల్ తలుపువద్దకుర్చుని బీడీతాగుతూ కనుపించాడు.

"చలిగాఉంది. పందిని వేద్దామా?" అన్నాడు వీరన్న.

తల ఊపాడు పందికి అలవాటు పడిన జమాల్. వీరన్న అక్కను పెళ్ళిచేసుకుని జమాల్ అక్కడే కాపురంపెట్టాడు.

వీరన్న రోడ్డుమీదకు వచ్చాడు.వంతెన దాటిసుగాలి గూడెంలోకివచ్చాడు.ఆవులు, మేకలుతడుస్తూదొడ్లలోఉన్నాయి.ఆవులు నెమరు వేసుకుంటూ దూడల్ని నాకుతున్నాయి. వర్షం వెలసి పోవడంతో ఒక్కొక్కరే బయటకువస్తారు.కొట్టువద్ద నిలబడ్డాడు వీరన్న.

"ఈ వర్షం ఇంతటితో పోతుందా?" అన్నాడు సుగాలి రాముడు.




"ఏం పోతుందో? ఎవడు చూశాడు" అన్నాడు వీరన్న పైకిచూస్తూ

తర్వాత పారుతున్న వాగును చూస్తూ అన్నాడు "వేట కోద్దామా?"

తలూపాడు రాముడు. "చలిగా ఉంది. నోటికి కారం తగిలితేగానీ చలితగ్గేటట్లు లేదు. మంచిది ఉందా?"

తల ఎగరేసి బీడీ బండలమీద పారేసి చెవులలో గాలి దూరుతుంటే గట్టిగా బిగించాడు వీరన్న "భలేపోతు ఉందిరోయ్! జాతర కోసం పందిని ఉంచాం గదా. జాతర ఇంకా నెల ఉందిగా! ఇప్పుడు దీని పని పట్టించి తర్వాత చూద్దాం"

ఇంతలో మరికొందరు తోడయ్యారు అందరూ మాంసం కోసం సిద్ధపడ్డారు. కత్తులు తీసుకుని చెంచు గూడెంవద్దకు వచ్చారు. దొడ్డిలోనుండి పందిని కాళ్ళుగట్టి బయటకు మోసుకువచ్చారు. తోవలో వేసి బడితెలతో బాదుతున్నారు. అది అరుస్తుంటే పిల్లలు చప్పట్లు కొడుతూ ఎగురుతున్నారు. ముక్కు పగలగొట్టి ప్రాణం తీశారు. తర్వాత కాల్చి కోయడానికి ఉపక్రమించారు.

ఉదయంనుండి ఎవరికీ తిండిలేదు. ఆడవాళ్లు జావకాస్తే పిల్లలూ, పెద్దలూ తాగారు. మాంసం కోస్తూనే రాగి సంకటి తయారుచేయడానికి ఆడవాళ్ళు తిరగళ్ళ ముందు కూర్చుని విసురుకుంటున్నారు. పిల్లలు పంది చుట్టూ చేరి కోస్తుంటే చూస్తూ మాంసం దొరుకుతుందన్న సంతోషంతో కేకలేసుకుంటున్నారు. మగ వాళ్లందరూ పందిచుట్టూ కూర్చొని వర్షంతో శుభ్రపడిన బండలమీద పందిని కోసి మాంసం వేస్తున్నారు. పందినివారు పక్కకు తీసి శుభ్రంచేసి ముక్కలు కోస్తున్నారు.

అదే సమయంలో హఠాత్తుగా వచ్చి నిలబడ్డాయి రెండు జీపులు, రెండు పోలీసు వేన్లు.

సుగాలిగూడెం, చెంచుగూడెం జనం దొంగలుగా ప్రసిద్ధులు. అనేక చిల్లర దొంగతనాలు చేశారు. అయితే బ్యాంకి దొంగతనం లాంటివి చేయగల నేర్పు వాళ్ళకు ఉన్నట్లు పోలీసులకు తెలియదు. కాని కుక్కలు దారి చూపిస్తూ అదే రావడంతో వేన్లు అక్కడికే వచ్చాయి. కుక్కలు అరవడంతో అక్కడ ఆపారు. నిలిపిన జీపునుండి చెంగున కిందకు దుమికాయి కుక్కలు. మాంసం కోస్తున్న వీరన్న కొడుకు పెద్ద వీరిగాన్నీ, హనుమంతునూ, ఎల్లయ్యనూ, పెద్ద వీరిగాని పెళ్లాన్నీ, జొన్నలు దంచుతున్న వీరమ్మనూ పట్టుకున్నాయి. ఈ హఠాత్ దాడికి కారణం తెలియక చెంచులు, సుగా

భయంతో పారిపోవడానికి అవకాశం ఏ రకక గజగజ వణకుతూ నిల్చున్నారు. పిల్లలు భయంతో ఏడుస్తూ ఇళ్లముందుకు పారిపోయారు. ఆడవాళ్లు వీధిలోకి వచ్చి నిలబడి పోలీసులవైపు చూస్తున్నారు.

సుగాలి రామునితోసహా ఎనిమిది మందిని పోలీసులు పట్టుకున్నారు. అందులో వీరిగాని భార్య వీరమ్మ, హనుమంతు భార్య జంకమ్మ కూడా నేరస్థులే! ఎనిమిది మందిని వేను ఎక్కించి నంద్యాలవైపు సాగాయి వేన్లు, జీపులు. పిల్లలు, ఆడవాళ్ళు గగ్గోలుగా ఏడుస్తూ రోడ్డుమీదకు వచ్చారు. పెద్దవాళ్ళందరూ కారణం తెలియక, భయంతో నోటమాట రాక, పోలీసుల్ని అడిగే ధైర్యమూ లేక ఇళ్ళలో జొరబడి కూర్చున్నారు. తీసుక పోబడినవారి బంధువులు ఏడుస్తూ, కింద పడి దొర్లుతున్నారు.



పోలీసు వాహనాలు నంద్యాల చేరే సరికి ఆరుగంటలు దాటింది. గాఢంగా మబ్బులు కమ్మి ఉండటం మూలంగా అప్పటికే చీకటి బాగా కమ్మింది. పోలీసు స్టేషన్‌లో ఇన్‌స్పెక్టర్ రూం లోనికితెచ్చి ఎనిమిది మందినీ వరుసగా నిలిపారు. ఇన్‌స్పెక్టర్ వారి ముఖాలు చూశాడు. చేతులు వెనక్కి కట్టుకుని, వారి ముందు అటూ ఇటూ తిరుగుతున్నాడు. పోలీసులు చుట్టూ నిలబడి ఉన్నారు. బయట సెంట్రీ తుపాకి చేతపట్టి అటెన్షన్‌లో నిలబడ్డాడు. లైట్లు వెలుగుతున్నాయి. టేబుల్‌ను ఆనుకొని నిలబడి "మిమ్మల్ని ఎందుకు తెచ్చామో తెలుసా?" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

వాళ్ళకు ఆ వివరాలు తెలియవు. చెప్పమని అడిగే ధైర్యం లేదు. తలలు వంచుకొని, చేతులు కట్టుకొని నిలబడ్డారు.

"నిన్న రాత్రి జరిగిన బాంకు దోపిడీకి బాధ్యులు మీరేనని కుక్కలు పసిగట్టేశాయి."

ఎనిమిదిమంది ముఖాలలో ఆశ్చర్యం కొట్టవచ్చినట్లు కన్పించింది ఇన్‌స్పెక్టరుకు. తలలెత్తి ఇన్‌స్పెక్టర్ వైపే చూస్తున్నారు భయంతో.

"దాదాపు పదిహేను లక్షల రూపాయల దోపిడీ. ఒరేయ్! ఉండి ఉండి మంచిఛాన్సు కొట్టేశార్రా! భలే బుర్రలమీది! ముందుగా చెప్పి ఉంటే మేము కూడా భాగానికి వచ్చేవాళ్ళం కదర్రా!" అతని కంఠంలో అవహేళన.

ఆ అవహేళన వాళ్ళు వినడం లేదు. బ్యాంకు దోపిడీ నేరం తమ మీద మోప బడుతున్నందుకు గుండెలు గుబగుబ లాడుతున్నాయి. చిన్న నేరాలకే కాలివేళ్ళు పగిలేలా బెత్తాలతో, లాఠీలతో బాదే పోలీసులు, ఇంత పెద్ద నేరానికి జరిపే దండన ఏమిటోనని ఆలోచిస్తూ వణికి పోతున్నారు.

"బయట పడకుంటే బాగుపడే వాళ్ళేరా మీరు. బయటపడిపోయారు. కనుక ఆ వస్తువులు, డబ్బు ఎక్కడ పెట్టారో చెప్పండి. శిక్ష తగ్గుతుంది కొంత యినా!" అనునయ వాక్యాలు పలికాడు ఇన్‌స్పెక్టర్.

వాళ్ళు పలకడం లేదు. తలలు వంచు కొని నిలబడ్డారు.

"డబ్బు ఎంత ఖర్చయింది?"

పలకలేదు వాళ్ళు.

"పందినికొన్నది ఆడబ్బుతోనేకదా?"

జవాబు లేదు.

"పోనీలే! ఖర్చయింది పోగా మిగిలింది అప్పగించండి"

జవాబులేదు.

"ఏరా దొంగనాకొడుకుల్లారా! పలక రేం? పందుల్నితిని కొవ్వెక్కిందిరా."

అయినా వాళ్ళు పలకడంలేదు.చెంచుల కట్టుబాట్లు అతడికి తెలుసు. వారినుండి రహస్యాలు రాబట్టడానికి సాధారణ పద్ధ తులు పనికిరావు. చస్తే వివరాలు చెప్పరు. ప్రాణంపోతున్నా రహస్యాలు కాపాడ డానికే నిర్ణయించుకుంటారు. అటువంటి వారి వద్ద అనునయ వాక్యాలు పలికినా లాభంలేదు. కాని వారిని దండించే అధి కారం ప్రస్తుతం తనకు లేదు. ఈ కేసు ఐ.జి. స్థాయివరకూ వెళ్ళింది. బ్యాంకు దోపిడీ! అదీ ఎంతో చాకచక్యంతో ఎప్పుడూ జరగని పద్ధతిలో బీరువాను కోసి దొంగిలించడం.యస్.పి.స్వయంగా కేసు పర్యవేక్షిస్తున్నాడు. వారి అనుమతి లేనిది వీళ్ళను కొట్టకూడదు. అయినా యస్. పి. కంటే ముందే తాను తెలుసు కోవాలన్న తొందరకొద్దీ ప్రయత్నం చేస్తున్నాడు. ఆ విధంగా రహస్యాలు తెలుసుకొని ప్రమోషన్ పొందవచ్చని ఆశ. అయినా అతని మాటను వారు లక్ష్యపెట్టనట్లు నోరు మెదపకుండా నిల బడ్డారు.

వారి వైపు పరీక్షగా చూసి "లోపల వెయ్యండి" అన్నాడు.

ఎనిమిదిమందినీ తీసుకెళ్ళి రెండ లాకప్‌లో పెట్టారు.

"వీళ్ళు అంత పెద్ద దొంగతనం చేశా రంటే నమ్మబుద్ధికాదు సార్! పొలాల్లో జొన్నకంకులుకోసుకొచ్చి తినేవెధవలు!" అన్నాడు రైటర్ బెల్టు పైకి లాక్కుంటూ. పీలగా ఉన్నాడు మనిషి.

"ఎట్లా చెప్పగలం? వీరికి తోడు కొందరిని తెచ్చుకొని చేసి ఉండొచ్చు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

జవాబివ్వలేదు రైటర్. ఇచ్చినా ఇన్ స్పెక్టర్‌కు కోపం వస్తుందేమోనని భయం.

"వారికి అన్నం ఏర్పాటు చేయండి" అంటూ వెళ్ళిపోయాడు ఇన్‌స్పెక్టర్. కానిస్టేబుల్ రంగయ్య లాకప్ వద్దకు వచ్చాడు. అతన్ని కానిస్టేబుల్ అని ఎవరూ అనుకోరు. రైతులా ఉన్నాడు. బట్టతల,పలుచగా ఉన్న వెంట్రుకలు తెల్ల బడ్డాయి. అరచేతుల చొక్కా, పంచె కట్టాడు. భుజం మీద కండువా వేసు కున్నాడు. లాకప్ వద్ద నిలబడి ఎనిమిది మందినీ పరీక్షగా చూస్తూ, కళ్ళు చిట్లించి




ముఖం చిట్లించి, ముక్కుపుటాలు ఎగుర వేసి "ఎట్లా దొరికారురా అమాయకపు ముండాకొడుకుల్లారా?" అన్నాడు బాధ పడుతూ.

వాళ్ళు జవాబివ్వలేదు. అతన్నే చూస్తూకూర్చున్నారు.

"పారిపోకూడదట్రా ! ఈ పోలీసు వెధవలు మీతోపాటు పరుగెత్తగలరా ? పారిపోతే కేసు సంగతి తర్వాత చూసు కోవచ్చు కదా !"

జవాబివ్వలేదు వాళ్ళు.

"మొత్తం ఎంత దొరికిందిరా ?"

"మీకేం భయం లేదు. బంగారం నాకు అమ్మితానంటే మిమ్మల్ని విడి పించే ఏర్పాటు చేస్తాను."

"ఎవరెవరు వెళ్ళారు?"

"కారు ఎక్కడ తెచ్చారు?"

అతడు అడిగే ప్రశ్నలు తమను కాదన్నట్లు కొందరు తలలు తిప్పుకొని కూర్చున్నారు. మరికొందరు అతని వైపు వెర్రివాడిని చూసినట్లు చూస్తున్నారు. ఇక వాళ్ళతో రహస్యాలు లాగడం, సాధారణ ఖైదీలనుండి లాగినంతసులభం కాదని రంగయ్య గ్రహించి అక్కడి నుండి బయటకు వచ్చాడు.

"ఏంది రంగయ్య మామా ! చుట్టా లతో మాట్లాడుతున్నావ్ ?" అన్నాడు హమీద్.

"ఈ దొంగముండా కొడుకులు పెద్ద కేటుగాళ్ళురా నాయనా ! ఒక్కడూ నోరు మెదపడు. మెదిపితే రత్నాలు రాలుతాయేమోగానీ?"

"రత్నాలు కాదు పళ్ళు రాలతాయని వాళ్ళకూ తెలుసు. పిక్‌పాకెట్ గాళ్లూ, బజారు రౌడీలనుకున్నావా నీ తంత్రంలో పడ్డానికి! బ్యాంకు దొంగలు! పెద్ద గజ దొంగలు వాళ్లు" అన్నాడు హమీద్.

రంగయ్య మాట్లాడకుండా బయటకు వెళ్లాడు. ఇద్దరు కానిస్టేబుల్స్ పిల్లలచేత అన్నం పొట్లాలు మోయించుకొచ్చారు. సెంట్రీని పిలిచి తలుపు తీయించి, అన్నం పొట్లాలు అందించారు. ఆ పిల్లలచేతనే బయట వసారాలో ఉన్న కుండతో నీళ్ల తెప్పించి లోపల పెట్టించారు. తలుపు తాళం వేసి సెంట్రీ బయటకు వెళ్లాడు. ఉదయం నుండీ అన్నం లేకపోవడంతో ఆత్రంగా తింటూ కూర్చున్నారు ఎనిమిది మందీ. అన్నం వీరు తినడం చూసి రెండు రోజులుగా అన్నం దొరకని పక్క సెల్‌లోని ఖైదీలు ఆశగా వారివైపు చూస్తున్నారు.




అక్కడ ఒక్క దేవాలయం తప్ప ఇళ్ళు లేవు. దేవాలయం వెనుక ఎప్పుడూ ఎండా కాలం కూడా పారే ఊటకాల్వ ఉంది, ఆ నీరు తాగితే అనేక రోగాలు పోతాయని ప్రజల నమ్మకం. ప్రతి సంవత్సరం శివ రాత్రి, కార్తీకపౌర్ణమి పర్వదినాలలో గొప్ప ఉత్సవాలు చేస్తారు. వేలాది జనం బండ్లతో, నడిచీ, బస్సుల మీదా వస్తూ ఉంటారు. మామూలు రోజుల్లో కూడా జనం వస్తూఉంటారు. రాత్రిపూట కొందరు అక్కడ నిద్ర చేస్తుంటారు కూడా.

పూజారి మకాం అక్కడే. రోజూ

మూడు కిలోమీటర్లు నడిచి రావడం, పోవడం చేయలేక ఆయన అక్కడే ఓ గదిలో కాపురముంటున్నాడు. రాత్రిపూట కూడా జనం అక్కడ నిద్ర చేస్తుంటారు గనుక అడవి ప్రాంతమయినా భయపడ వలసిన అవసరం లేదు. అయినా, ఆయన పదిహేనేళ్ల కూతురూ అక్కడ కాపురం. వచ్చే ఆదాయం కూడా బాగానే ఉంది.

దేవస్థానానికి నాలుగెకరాల మాగాణిఉంది. అందులో పచ్చేపంటలో సగం ట్రస్టీ స్వాధీన పరచుకొని, సగం పూజారి తిండికి ఇస్తారు. నెలకు వంద రూపాయల జీతం.




దక్షిణలు ఆయనకే దక్కుతాయి. హుండీలో వేసినసొమ్ము మాత్రం ట్రస్టీపరమవుతుంది.

అంతకుముందు రోజు విపరీతంగావర్షం కురియడంమూలానా, ఉదయం పదిగంటల దాకా వర్షం పడుతూనే ఉండడంవల్లా ఆ రోజు జనం ఎవరూ రాలేదు. రోజూ కట్టెలకొరకో, అడవిలో పశువుల మేపు కోడానికో వచ్చే జనం కూడా ఈ రోజు వర్షంమూలంగా రాలేదు. అలవాటయిన ప్రాణంగనుక పూజారికి అక్కడ భయం లేదు. మళ్లీ వర్షం వచ్చేలా ఉండటంతో పూజాకార్యక్రమాలు తొందరగా ముగించి భోజనాలుచేసి పడుకున్నారు.

రాత్రి పదిగంటలు దాటిన తర్వాత అంబాసిడర్ కారు ఒకటి వచ్చి రోడ్డుదిగి దేవళం ఎదురుగా వున్న చెట్టునీడన నిలిచింది. ఎనిమిది మంది కిందకు దిగారు. డ్రైవరు సీటులోనే కూర్చున్నాడు పరిసరాల వైపు చూస్తూ. చీకటిలో ఏమీ కన్పించేలా లేదు. ఎనిమిది మందీ కిందకు దిగి మడతల ఐరన్‌బార్ నిచ్చెన కిందికి లాగారు.



వాటితోపాటు మోకులన్నీ కింద పడేసి గోడ దగ్గరకు చేర్చారు. ప్రహరీగోడ కనీసం ఆరు గజాల ఎత్తు ఉంది. తలుపులు తెరవడం సాధ్యం కాదు. లోపలనుండి గడియవేసి ఉంటారు. బలమైన చెక్క తలుపులు. పైగా ఎదురుగా హైవే! రాత్రిపూటకూడా లారీలు విపరీతంగా తిరుగుతుంటాయి. అంతమంది ఆ రాత్రి తలుపు దగ్గర నిలబడితే అనుమానం కలుగుతుంది. అందువల్ల తలుపు జోలికి పోలేదు. ప్రహరీ వెనుక వైపునుండి ఐరన్‌బార్ నిచ్చెన సాగదీసి ఒక్కొక్కరే గోడపైకి ఎక్కారు. తాళ్ల ప్రహరీలోనికి విసిరి స్క్రూ సిస్టం ద్వారా నిచ్చెన పైకి లాక్కుని, లోపల వైపు వేసి, తిరిగి యథాప్రకారంగా అమర్చి ఒక్కొక్కరే లోనికి దిగారు.

విశాలమైన ఆవరణ. అక్కడక్కడ ప్రహరీ వెంట గుబురుగా పూలచెట్లు చిరుగాలికి తలలూపుతున్నాయి. దేవాలయం వసారాలోకి వచ్చారు. పెద్ద పెద్ద రాళ్లతో నిర్మించబడ్డ దేవాలయం అది. రాతి స్థంభాలు, రాతి దూలాలు, రాతి శిల్పాలు ఉన్న అతి పురాతనమైన దేవాలయం.

వసారాలో ఐదు నిముషాలు నిశ్శబ్దంగా నిలబడ్డారు వారు. రోడ్డుమీద 'ఝుయ్'మంటూ వెళ్తున్న లారీ శబ్దం వినిపిస్తున్నది.

బాస్ ముందుకు కదిలాడు. అతనితో పాటు మిగిలిన ఏడుగురూ కదిలారు పూజారి నివసించే గది దగ్గరగా చేరారు. పైకి చూస్తూ రెండు నిముషాలు ఆగి బాస్ తలుపు తట్టాడు. మూడోసారి తలుపు తట్టినపుడు లోపలనుండి "ఎవరు?" అంటూ జవాబు వచ్చింది.

"పూజారి గారూ! మేం అర్జంటుగా పూజ చేయాల్సి వచ్చాము"

పూజారిని నిద్రమత్తు వదలింది. సందేహం లేదు. తనున్న గది తలుపులు తడుతున్నారు. లేచాడు. కప్పుకున్న దుప్పటి తీసి, గడియ తీయడానికి అడుగులు వేశాడు. ఈ చప్పుడుకు కూతురు కూడా లేచింది. తండ్రి ముందుకు పోతుండటంతో పిలిచింది. కూతురు పిలుపు విని నిలబడ్డాడు. మంచం దిగి అతని దగ్గరకు వచ్చింది ఆమె తత్తరపాటుతో.

"నాన్నా ! మన ఇంటి తలుపు తడుతున్నారు కదా!"

అవునన్నట్లు తల ఊపాడు ప్రశ్నార్థకంగా!

"రాత్రి గుడి తలుపులు లోపలనుండి గడియ వేశాంకదా! మరి ఇంటి తలుపులు ఎట్లా తట్టగలరు ? లోపలకు ఎట్లా వచ్చి ఉంటారు?"

ఆ మాటతో నిద్రమత్తు వదిలింది పూజారికి. అతడు ఆ విధంగా ఆలోచించ లేదు. సాధారణంగా ఆవరణలో పడుకునే భక్తులు వెళ్లిపోతూ తలుపులు తట్టి లేపి, లోపల నుండి ప్రహరీ తలుపు తాళం తీస్తే వెళ్లిపోతుంటారు. ఈరోజు వర్షం మూలంగా ఎవరూ వచ్చి లోపల పడుకోలేదు. ప్రహరీ తలుపుకు తాళం వేసిఉంది లోపలనుండి ! బయటనుండి లోనికివచ్చే మార్గం మరొకటి లేదు. క్షణకాలం అతని తల దిమ్మతిరిగింది. కూతురు చెప్పకుంటే తాను తలుపుతీసేవాడే.

"ఎవరో దొంగలు గోడ దూకి లోనికి వచ్చిఉంటారు నాన్నా!" అంది భయంతో కూతురు.

తలుపు దబదబాదుతున్నారు. లోపల మాటలు బయటకు వినిపించడం లేదు.




లోపల ఎంతమున్నదీ వారికి తెలియడం లేదు. వారి అంచనా ప్రకారం ఇద్దరే ఉండాలి. చివరకు తెగించి పూజారి తలుపు వద్దకు వచ్చి తలుపు పక్కనున్న చిన్న కిటికీ తెరిచాడు. తలుపు తెరవకుంటే దొంగలే అయితే తలుపు విరగగొట్టి లోనికి వస్తారు. ఆ తలుపు బలమైంది కాదు.

కిటికీ తలుపు తెరుస్తూనే బాస్ పిస్తోలు గురిపెట్టాడు పూజారికి.

"మర్యాదగా తలుపుతియ్! లేకుంటే ఛస్తావ్ ?"

వణకుతున్న చేతులతో తలుపు తీశాడు పూజారి. పూజారిని బయటకు లాగాడు బాస్. విసురుగా వచ్చి కిందపడ్డాడు పూజారి.

"ఏరా కొడకా ! ఎన్నిసార్లు తలుపు తట్టినా తీయవేం ! నీ తోలు వలిచి నీ దేవునికి నైవేద్యం పెట్టేస్తాను" అంటూ కాలితో తన్నాడు. పూజారి చేతులెత్తి దణ్ణం పెట్టాడు.

"గర్భగుడి తాళాలు తీయిముందు"

మొలనున్న తాళం చెవులగుత్తి తీసి అతని చేతిలో పెట్టాడు పూజారి.

అతన్ని విడిచి వసారాలోకి వచ్చారు. ముందు తలుపు తెరచి లోనికి వెళ్లారు. టార్చ్ లైట్లు వేసి గర్భగుడిలోకి వెళ్లారు. దేవునికి ఎదురుగా గర్భగుడి ముందున్న గదిలో హుండీ ఉంది. హుండీకి తాళం వేసి ఉంది. యాసిడ్‌పోసి తాళం కరిగించి లాగివేశారు. హుండీలోని మొత్తం సంచిలో పోసుకుని గర్భగుడిలోకి జొరబడ్డారు. అమ్మవారికి ఉన్న బంగారునగలునిలువునా వలిచివేశారు. లింగాన్ని పెకలించి లింగం కిందనున్న వస్తువుల్ని తీశారు. అందులో రత్నాలు, మాణిక్యాలు, బంగారులింగాలు ఉన్నాయి. వాటిని కూడా సంచిలో పోసుకున్నారు. తిరిగి అందరూ బయటకు వచ్చారు. పూజారి ఆవరణలో వణకుతూ కూర్చున్నాడు. దేవుడిని నిలువు దోపిడీ చేస్తుంటే అతనికి ప్రాణంపోతున్నట్లుంది.

అందరూ వసారాలోకి వచ్చి పూజారిని చూశారు.

"ఒరేయ్ ! వీడి కూతురు ఉండాలి. ఏదీ!" అన్నాడు బాస్.

ఒకడు లోనికి వెళ్లి భయంతో ఏడుస్తున్న పూజారి కూతుర్ని లాక్కొచ్చాడు.

"గుడిలో బంగారమే అనుకున్నాం. పూజారి ఇంట్లో అసలు బంగారం ఉందనుకోలేదురా!" అన్నాడు బాస్ ఆమె దగ్గరగా వచ్చి. ఆమె చేతులెత్తి నమస్కారం చేసింది ఏడుస్తూ. ఆమె ఏడ్పునూ, నమస్కారాన్నీ అతడు చూడడంలేదు. యవ్వనంలో అడుగు పెడుతున్న ఆమె శరీరాన్ని చూస్తున్నాడు. తండ్రి బతిమాలినా, ఏడ్చినా లెక్కచేయకుండా ఆమె గుడ్డల్ని చింపివేసి తండ్రిముందే ఆ అమ్మాయి మానాన్ని చెరచాడు బాస్. బాస్ పక్కకు వస్తూనే మరొకడు...మరొకడు. ఎనిమిదిమంది ఆమెను ఉపయోగించుకున్నారు.

"పదండి.మూడుగంటలుకావస్తున్నది" అన్నాడు బాస్. ప్రధాన ద్వారం తలుపు తెరచి, నిచ్చెన తాళ్ళు తెచ్చి కారుమీద వేసి, సంచులన్నీ అందులోచేర్చి ఎనిమిది మంది కూర్చుంటూనే కారు ముందుకు సాగింది.

* * *

మబ్బులు విచ్చీవిచ్చకముందే పోలీసుల వేన్లూ, జీపులూ కాళ్వగుడి ముందు నిలబడ్డాయి. నిన్న రాత్రి బాంకుదోపిడి,

ఈ రాత్రి దేవాలయం నిలువుదోపిడి, పూజారి కూతురు ఘోరంగా చెరచబడటంతో జనానికి ఆవేశం వచ్చింది.

దొంగలు వెళ్ళిపోతూనే కూతురు పరిస్థితికూడా చూడకుండా రోడ్డుమీదకు పరుగు లంకించుకున్నాడు పూజారి. రోడ్డు వెంట పరుగిడుతున్న పూజారిని చూసి అటు వస్తున్న కారు ఒకటి నిలిపారు. అంతరాత్రి పూట ఒంటరిగా పరుగిడుతున్న ఆ బ్రాహ్మణుని చూసి, కారులోనున్నవారు కిందికి దిగి వివరాలడిగారు. అతడు ఏడుస్తూ చెప్పాడు. కారులోనున్నవారు పూజారిని గ్రామానికి తీసుకెళ్ళారు. అక్కడి నుండి చుట్టు పక్కల పోలీసు స్టేషన్‌లకు ఫోన్‌చేసి, నాలుగు ట్రాక్టర్లతో పెట్రోమాక్స్ లైట్లతో జనం కదిలివచ్చారు. తెలతెలవారేలోగా పోలీసులతో పాటు, చుట్టుపట్ల గ్రామాలకు చెందిన వేలాది జనం సైకిళ్ళమీద, లారీలమీద, నడిచీ వచ్చారు. ఇంకా వస్తూనే ఉన్నారు.

పోలీసులు లోనికి వెళ్ళారు. ఆవరణదాటి వసారాలోనికి అడుగు పెట్టేటప్పటికి వారికి మొదట దర్శనమిచ్చింది నగ్నస్త్రీ శరీరం. తల తిప్పుకొని టవల్ వేయమని ఆదేశించాడు యస్. పి. టవల్ కప్పిన తరువాత స్త్రీ దగ్గరకు వెళ్ళారు.



ముఖం భయంతో ఉంది. కళ్ళు, నోరు తెరచి ఉన్నాయి. చేతులు పైకి చాపి ఉంది. కాళ్ళు ఎడంగా ఉన్నాయి. శరీరంలో ప్రాణంలేదు. దేవాలయంలోకి వెళ్ళారు. శివలింగం పెరికివేయబడి వుంది. పార్వతి నిలుపుదోపిడీకి గురయింది. వెండి దీపపు చిమ్నీలేదు. పోలీసులు ఆవరణ అంతటా తిరిగారు. వెనుక నుండి నిచ్చెన వేసినట్లుంది. అది తిరిగి లోపలకు వేసినట్టూ ఉంది. బయట చెట్టు కింద కారు నిలిపిన గుర్తులున్నాయి.

పూజారి కూతురు మానభంగం చేసి చంపబడిందనే వార్త తెలియడంతో జనం ఆగ్రహావేశులయ్యారు. లోపలకు తోసుకు పోవడానికి ప్రయత్నం చేస్తున్నారు. జనాన్నిలోపలకురానిస్తే గుర్తులు దొరక వని లాఠీలుఎత్తి వారిని దూరంగా జరప డానికి ప్రయత్నిస్తున్నారు పోలీసులు. అయినా జనం ఆగడంలేదు. పోలీసులను తిడుతూ ముందుకు దూరుతూనే ఉన్నారు. ఒక స్త్రీని ఘోరంగా చంపటం, అదీ దేవా లయంలో. ఆవేశ పరులైన కొందరు యువకులు పోలీసుల మీద తిరుగబడ్డారు. ఈలోగా కొందరు ట్రాక్టర్లమీద పక్క గ్రామాలకు వెళ్ళి పెద్దపెద్ద నిచ్చెనలుతెచ్చి, ఆవరణ గోడ ఎక్కడానికి ప్రయత్నం చేస్తున్నారు. ఒకరూ, ఇద్దరూకాదు వేల జనం రోడ్డువెంట వస్తున్న వాహ నాలు, ట్రాఫిక్ బందయి అందరూ దిగి వస్తున్నారు చూడటానికి. ఈ వాతావరణం చూసి భయపడిపోయిన యస్. పి. తలుపులు తెరిపించాడు. పోలీసుల్ని తోసుకుంటూ జనం లోపలకు వచ్చారు. ఆవరణనిండా జనంతో నిండిపోయింది. కొందరు స్త్రీలు ఆమె దురవస్థనుచూసి ఏడుస్తున్నారు. చాలామంది పురుషులు ఆ స్థితిచూసి కండ్లనీరు పెట్టుకున్నారు. కొందరు ఆవేశపరులు శివలింగాన్ని యథావిధిగా పెట్టి "హర హర మహా దేవ" అంటూ అరిచారు. నిమిషాల్లో అందరి నోటినుండి "హర హర మహా దేవ" నినాదం ఆరంభమయింది. పోలీ సులు, అధికారులు నిలువు గుడ్లతో ఏమీచేయలేక నిలబడ్డారు.

డి. ఐ. జి. వచ్చాడు.లోనికివచ్చి ఆ ప్రాంత పెద్దలను పిలిచి మాట్లా డాడు.తాము పొమ్మంటే ప్రజలుకదలరు. వారి నాయకులద్వారానే బయటకు పంపాలి. ప్రజలతో పోట్లాట పెట్టుకుంటే ఆ తర్వాత పరిస్థితి భయంకరంగా ఉంటుంది. వాళ్ళకు నచ్చజెప్పి పంపించా లనుకున్నాడు. నాయకులు, అందరికీ నచ్చచెప్పారు. యువకులను బతిమాలి ఆవేశం తగ్గించారు. "మనం ఇక్కడ ఉంటే వారి పరిశోధనకు అడ్డం వస్తాము. జరిగింది జరిగిపోయింది.దానికిప్రతీకారం తీర్చుకోవాలన్నా దోషులు దొరకాలి. మనం ఎంతసేపు ఇక్కడఉన్నా దోషులు దొరకరు. వారు గుర్తుల కొరకు ప్రయ త్నిస్తున్నారు. బయటకు రండి" అని నచ్చచెప్పారు.

జనం బయటకు వచ్చారు. పోలీసులు వచ్చి ట్రాఫిక్ అడ్డు తొలగించి, వాహ నాలు పోవడానికి దారి ఏర్పరచారు. వాహనాలు వెళ్ళిపోతున్నాయి. జనంలో ఆవేశం చచ్చినవారు విచారంగా గ్రామా లకు వెళుతున్నారు. ఆవేశంలో ఉన్నవారు అక్కడే బయట చెట్ల కింద ఉన్నారు. గ్రామాలనుండి అన్నం తెప్పించు కున్నారు కొందరు.

పోలీసులు శవం ఫొటో, గుడి, గర్భ గుడి, గుడి ఆవరణ, పూజారి ఇల్లు




ఫొటోలు తీసుకున్నారు. నిచ్చెన ఏ భాగంలో వేశారో, ఎటువైపునుండివచ్చారో ఫొటోలు తీశారు. కారు నిలిపినచోట మొదటే ఫొటోలు తీశారు. కుక్కల కొరకు తిరిగి కబురంపారు. కుక్కలు ఇంకా వెళ్లలేదనీ కర్నూలులోనే ఉన్నా యనీ తెలిసి వెంటనే తెచ్చారు. పన్నెండు గంటలప్పుడు కుక్కలు జీపులో కదిలాయి. కామవరపు చెరువు వద్ద జీపు నిలబెట్టబడింది. కిందికి దూకి చెరువు వద్దకు వచ్చి చెరువులో దిగి, కాళ్ళు జాడించాయి. అంతే ఆ తర్వాత గంట సేపున్నా అవి కదలనే లేదు.

కుక్కల శిక్షకున్ని పిలిచాడు డి.ఐ.జి.

"ఏమిటి ? గంట సేపట్నుంచీ అక్కడే ఉన్నాయి" అన్నాడు ఆతృతగా.

"వాళ్ళు ఏదో ద్రవ్యాలువాడి స్నానం చేసి వెళ్ళినట్లుంది సార్! అందువల్ల ఇక అవి గుర్తుపట్టడం అసాధ్యం" అన్నాడు శిక్షకుడు.

"అంటే కుక్క తమ జాడ గుర్తుపట్ట కుండా ఉండడానికి వాడే పదార్థాలు వున్నాయన్నమాట!" అన్నాడు డి.ఐ.జి.

"చాలా ఉన్నాయి సార్ ! కొన్ని పరిధుల్లోనే కుక్క పనిచేస్తుంది. అనేక ద్రవాలు వాడడంమూలంగా, ఆ వాసనకు తల చెదరి కొన్ని సంఘటనల్లో ఇతరులను పట్టించనూ వచ్చు" అన్నాడు శిక్షకుడు. ఆఫీసర్లు హతాశులయ్యారు.

అంబాసిడర్ కారుకొరకు వేట ఆరం భించారు. అక్కడినుండి తిరిగి చెంచుగూడెం వచ్చారు. ఆపాటికే చెంచుగూడెంలో యువతీ యువకులు గతంలో పేరుపొంది కేసుల్లో ఇరుక్కని జైలు శిక్షలు. చేసిన వారు పారిపోయారు. పోలీసులు వచ్చే టప్పటికి అక్కడ ముదుసలులు, పిల్లలు మాత్రమే ఉన్నారు. పోలీసులకు కూడా తెలుసు- దొరక్కుండా పారిపోతారని. సుగాలి గూడెంలో కూడా చాలామంది పారిపోయారు. పిల్లలు, ముదుసలులు పోలీసులను చూసి గగ్గోలుగా ఏడు స్తున్నారు.

చెంచులను కర్నూలు పోలీసుకంట్రోలు రూంకు తరలించారు సంధ్యాల నుండి. వారిని మాట్లాడించలేమని పోలీసులకు తెలుసు. చేతలతోనే ఆ పని సాధించాలి. చెంచులు బాంకు దోపిడీ స్వయంగా చేశారంటే పోలీసు అధికారులు నమ్మడం లేదు. అలాగే దేవాలయం దోపిడీ కూడా! అయితే చెంచుల హస్తం లేకుండా మాత్రం జరిగిఉండదని వాళ్ళు విశ్వసిస్తున్నారు. ఎవరో నాగరిక వ్యక్తులే చెంచుల్ని పురి కొల్పి, వారిని ఆకట్టుకొని ఈ దోపిడీలు చేయిస్తున్నారనీ, వెనుక కార్లు, పిస్తోలు లాంటి వస్తువులు వారు అందిస్తున్నారనీ, వాటితో చెంచులు దాడి చేస్తున్నారనీ పోలీసులు ఆలోచిస్తున్నారు. అందువల్ల కేవలం చెంచులకు శిక్షలు పడితే లాభం లేదు. వెనకనున్న వ్యక్తులు దొరకాలి. లేకుంటే మరో చెంచుగూడేన్ని ప్రేరేపించి తమ పనులు పూర్తి చేసుకుంటారు. వెనుక నున్నవారి వివరాలు రావాలంటే ముందు వీరిద్వారానే సాధించవలసి ఉంటుంది. మరో ఆధారంలేదు.

అందువల్ల ఇంటరాగేషన్‌కు కంట్రోల్ రూంనుండి మొదటి టౌన్ పోలీస్ స్టేషన్‌కు తెచ్చారు. అక్కడి నుండి పోలీసు బంగళాకు తరలించారు. తమను ఎందుకు ఆ విధంగా ఒకచోటినుండి మరో చోటికి మారుస్తున్నదీ వారికి తెలియదు. అయితే వారికి గతంలో అనుభవం గనుక

తమ కీళ్లు తిప్పడానికి పోలీసులు చివరి ప్రయత్నం చేస్తారని తెలుసు. చేతిలో చిక్కిన తరవాత చేసేదేమీలేదు గనుక నోరుమెదపకుండా ఉన్నారు. తిండి బాగా పెట్టి మేపుతున్నారు. పోలీసు స్టేషన్‌లో ఇంత బాగా తిండి దొరకడమంటే రెండే కారణాలని వారికి తెలుసు. ఒకటి – ఖైదీ ధనవంతుడూ, పలుకుబడి కలిగి ఉండాలి లేదా అనేక రహస్యాలు తెలిసి ఉండాలి. సామ, దాన, భేద, దండోపాయాలతో నిదానంగా కక్కించడానికి ప్రయత్నించడంలో మొదటి రెండు పద్ధతులు అనుసరిస్తారు. తమకు మొదటి స్థాయిలేదు గనుక, రెండో స్థాయినే వాళ్ళు ఏర్పాటు చేస్తున్నారని వాళ్ళు అర్థంచేసుకోగలరు. పైగా రేపు కొట్టే దెబ్బలకు తట్టుకోవాలన్నా ఈ తిండి అవసరం. గొర్రెను కసాయి ఎందుకు మేపుతాడో గొర్రెకు తెలియకపోవచ్చు. ఒకసారి చవిచూసిన మనిషి రెండోసారి అర్థం చేసుకోగలుగుతాడు.

రాత్రి ఒంటిగంట సమయంలో నిద్రపోతున్న పెదవీరిగాన్ని లేపి రూంలోకి



తెచ్చారు పోలీసులు. యస్. పి. ఎదురుగా నిలబెట్టారు. నిద్రమత్తు వదలింది వారిని చూసి. జరుగబోయేది అర్థమవుతున్నది. చేతులెత్తి దండం పెట్టాడు.

యస్. పి. తల పంకించి, తలఊపుతూ "నిజం చెప్పరా! నిన్నేం చేయము. అబద్ధం చెబితే మాత్రం తోలు వలిచేస్తాను" అన్నాడు హెచ్చరిస్తూ.

వీరన్న తల ఊపాడు చెబుతానన్నట్లు.

"బాంకు దోపిడీ కేసులో పాల్గొన్న తొమ్మిది మంది ఎవరు?"

"నాకు తెలియదు బాబూ!"

"ఆ కారు ఏవూరినుండి తెచ్చారు? ఆసామి ఎవరు?"

"నాకు తెలియదు బాబూ!"

"ఆ బంగారం, డబ్బు ఎక్కడ పెట్టారు?"

"తెలియదు బాబూ!"

తొడమీద బూటుకాలు దెబ్బ పడడంతో విరుచుకు పడ్డాడు వీరన్న. వెనుక నిలబడ్డ పోలీసుమీద పడటంతో, ఆ విసురుకు ఇద్దరూ నేలపడ్డారు. పోలీసు లేచి గుడ్డలు దులుపుకొని, వీరన్న జుట్టు పట్టుకొని లేపి నిలబెట్టాడు.

"నిజంచెప్పు. చెప్పకుంటే ఖస్తావ్!"

"నిజం చెబుతున్నాను బాబూ! నాకేం తెలియదు."

గడ్డంకింద తగిలిన దెబ్బకు పళ్ళ మధ్య నాలుక పడి కొరుక్కుంది. నోటి నుండి రక్తం కారి కింద పడింది. ఇన్స్పెక్టర్ ముందుకు వచ్చాడు. జుట్టు పట్టుకొని పక్కనున్న రూంలోకి లాక్కెళ్ళాడు.

పోలీసులు హనుమంతును తెచ్చారు యస్. పి. ముందుకు. హనుమంతు కూడా వీరన్నలాగే ఏమీ తెలియదని చెప్పాడు. మరో ఇన్స్పెక్టర్ వాడిని లాక్కొని వెళ్లాడు.

హనుమంతు చెల్లెలు వీరమ్మను తెచ్చి యస్. పి. ముందు నిలిపారు. తల వంచుకొని నిలబడింది వీరమ్మ.

"నీవైనా నిజం చెప్పవే ముండా! లేకుంటే వాళ్ళకంటే అల్లరి పవతావు నీవు" అన్నాడు యస్. పి. నడుంమీద చేతులేసి అటూ ఇటూ తిరుగుతూ.

పలుకలేదు. కానీ తలూపింది చెబుతా నన్నట్లు.

ప్రశ్నలు అడగడం ప్రారంభించాడు. ఆ ప్రశ్నలకు జవాబు మిగిలిన ఇద్దరినుంచి వచ్చినట్లే వస్తున్నాయి. యస్. పి. కళ్ళల్లో ఎర్రజీర పుట్టింది. చెయ్యి చాపి చెంపమీద కొట్టాడు. ఆ దెబ్బకు తిరిగి కింద పడింది. పోలీసు చెయ్యిపట్టి లేపి నిలబెట్టాడు.

"చెప్పకపోతే నీవు నాశనమవుతావు!"

జవాబు లేదు. వెక్కుతూ నిలబడింది. ఇన్స్పెక్టర్ జుట్టు పట్టుకొని పక్కకు లాక్కెళ్ళాడు. పక్క రూంలో నిలబెట్టాడు.

అటూ ఇటూ తిరుగుతున్న అతని పాదాల్ని చూస్తూ తల వంచుకుని నిలబడింది వీరమ్మ.

"చెప్పవూ ?" అన్నాడు దగ్గరగా వచ్చి గడ్డంపట్టి తల పైకెత్తి.

"తెలియదు బాబుగారూ !"

చెంపలు రెండూ ఫెళఫెళ మోగాయి.

ఏడుస్తూ నిలబడింది వీరమ్మ. సిగరెట్ ముట్టించి దమ్ములాగి ఆమె దగ్గర నిలబడ్డాడు. సిగరెట్ ఆమె బుగ్గ దగ్గరగా తెచ్చాడు. భయం భయంగా వెనుకకు కదలుతున్న 'వీరమ్మను' వెనుకనుండి పట్టుకున్నాడు పోలీసు. సిగరెట్ వీరమ్మ

బుగ్గను తాకింది. ఆమె అరచిన అరుపుకు పోలీసు వెనుక విడిచాడు భయంతో. బుగ్గ ఎర్రగా కాలిపోయింది. నల్లటి ఆ మనిషి ముఖం మీద ఎర్రటి పుండు కొట్ట వచ్చినట్లు కన్పిస్తున్నది.

"ఇదేం శిక్షే పచ్చిముండా! ఇంకా ఉన్నాయి. నిజం చెప్పకుంటే గుడ్డలు విప్పి కండ కోస్తాను."

భయంతో ఏడుస్తూ చేతులెత్తి దణ్ణం పెట్టింది.

"నిజం చెప్పు; లక్షణంగా ఇంటికి పంపిస్తాను. పెళ్ళికూతురులా చీరలు రవికలు కొనిపెట్టి పంపిస్తాం. నిన్నేం చేయం" అన్నాడు ఎదురుగా నిలబడి.

"నాకేం తెలియదు బాబుగారూ!" అంది రెండు చేతులెత్తి దణ్ణం పెడుతూ. లాఠీ రెండు చేతుల వేళ్ళమీద 'ఫెళా' మన్న శబ్దంతో పడింది. వేళ్ళు విదలించి ఏడుస్తున్నది వీరమ్మ. వేళ్లు విరిగాయో బాగున్నాయో ఆమెకే తెలియడం లేదు.

"దీన్ని తీసుకెళ్ళు; తర్వాత చూద్దాం" అన్నాడు ఇన్‌స్పెక్టర్ వగర్చుకుంటూ.

జుట్టు పట్టుకొని లాక్కుంటూ పోలీసు బయటకు తెచ్చాడు. తీసుకెళ్ళి లాకప్‌లో వేశాడు. మిగిలిన ఐదుగురు భయం భయంగా చూస్తున్నారు ఇకవంతు ఎవరిదో తెలియక. ఎవరినీ బయటకు తీయలేదు. తాళం వేసి వెళ్ళిపోయాడు. దెబ్బతిన్న ముగ్గురూ ఏడుస్తుంటే, మిగిలిన ఐదుగురూ వారిని సముదాయించడానికి శక్తిలేక నిలువు గుడ్డలతో వారి దెబ్బల్ని చూస్తున్నారు.




నంద్యాలలో సినిమా చూడటానికి వచ్చారు కవులూరుకి చెందిన సోమేశ్వరశెట్టి, అతని కుటుంబ సభ్యులు. సాధారణంగా వాళ్ళు మ్యాట్నీకిగానీ, మొదటి షోకుగానీ వస్తే బస్సుకువస్తారు. మొదట ఆట విడిచిన తర్వాత వెంటనే బస్సులో వెళ్ళడానికి అవకాశం ఉంటుంది. రెండవ ఆటకు వస్తే అలా కుదరదు. అందువల్ల జట్కాలో వచ్చారు. బంధువులు రావడంవల్ల అందరూ కలిసి సరదాగా సినిమాకు వచ్చారు. ముగ్గురు స్త్రీలు, ఇద్దరు పురుషులు. ముగ్గురు స్త్రీల మీదా బంగారు నగలు ధగధగ మెరుస్తున్నాయి. అట్టహాసం లేకుండా బయటకు రారు. కనుక బాగా అలంకరించుకుని వచ్చారు.

సినిమా చూడడానికి ఆ గ్రామం నుండే వచ్చిన వాసుదేవరెడ్డి శెట్టిని చూసి పలకరించాడు.

"ఇంటికి ఎప్పుడు వెళ్తారు శెట్టిగారూ?" అన్నాడు.

"రెండవ ఆట విడుస్తూనే వెళ్తాము; గుర్రబ్బండిలో వచ్చాము" అన్నాడు శెట్టి.

"ఏమంత తొందర? ఉదయం వెళ్లవచ్చులెండి. చెంచువాళ్ళ అగడాలు మితిమీరి పోతున్నాయి. తొందరపడి చీకట్లోపోవడం ఎందుకు?" అన్నాడతను.

శెట్టి నవ్వాడు. "ఈ చెంచు ముండా కొడుకులు అందరూ మనకు తెలిసినవాళ్ళే




కదా! మన జోలికి రారులే! అయినా ఎంత దూరం ఏడు మైళ్ళేగా?" అన్నాడు.

అతడు మాట్లాడలేదు. కుర్చీ టికెట్టు తీసుకొని లోపలకు వెళ్ళాడు. ఆడవారికి బెంచీ టిక్కెట్లు తీయించి, తాము కుర్చీ టికెట్లు తీసుకొని హాలులోకి వెళ్లారు శెట్టి, ఆయన బంధువూ.

ఒంటిగంటకు బయటకు వచ్చారు. జనం రద్దీగా ఉన్నారు. ఆ రద్దీలో రిక్షాలు పోవాలన్నా సాధ్యంకాదు. ఐదుగురూ ఎదురుగానున్న హోటల్‌లో టీ తాగి బయటకు వచ్చేటప్పటికి, రద్దీ తగ్గుముఖం పట్టింది. హాలు ఆవరణలోనున్న గుర్రబ్బండి వద్దకు వచ్చి బండి మనిషిని లేపి, బండి కట్టమన్నారు.

బండి రైలుగేటు దాటేటప్పటికి జనం నిర్మానుష్యమయ్యారు. వర్షం వచ్చే సూచన లేకున్నా, దట్టంగా మబ్బు కమ్మింది. చీకట్లోనే చూసుకుంటూ బండి ముందుకు సాగింది. పల్లెవద్ద రోడ్డుమీద నలుగురు మనుషులు కూర్చుని మాట్లాడుకుంటున్నారు. బండిలోంచి శెట్టి మాటలు విని లేచి నిలబడ్డారు. శెట్టి ఆ ప్రాంతానికి పెద్ద వ్యాపారిగా అందరికీ తెలుసు. అందువల్ల తనజోలికి ఎవరూ రారు. బండి సెంటర్‌కు వచ్చి టర్నింగు తిరిగి, కవులూరు వైపు సాగింది. దారికి ఇరువైపుల అడివితుమ్మ

చెట్లు విపరీతంగా అల్లుకున్నాయి. బండి పోవడానికి కావలసిన దారి తప్పితే, మిగిలిన ప్రాంతమంతా చిక్కగా అల్లుకున్నాయి.

వాగు దాటితే మూడు ఫర్లాంగులు ఉంది గ్రామం. వాగులోని బ్రిడ్జిమీదకు బండి వస్తూనే, బ్రిడ్జికింద నీళ్లలోనుండి నలుగురు మనుషులు బయటకువచ్చి బ్రిడ్జిపైకి ఎక్కారు. పరుగెత్తుతున్న గుర్రంవెంట పడి కళ్ళెం పట్టుకున్నారు. బండి మనిషి వణకుతూ కూర్చున్నాడు. ఎదురుగా వంతెనకు అటువైపునుండి నలుగురు, ఇటు వైపునుండి నలుగురు చెట్ల మధ్యనుండి పరుగెత్తుతూ వచ్చారు. మొత్తం పన్నెండు మంది గుర్రబ్బండిని చుట్టుకున్నారు. అది ఊరుకాదు. కేక వేస్తే వినిపిస్తుందన్న ఆశ లేదు. శెట్టి గుండెలు నిలువునా కూలినట్లయింది. అరవడానికి నోరుకూడా రావడం లేదు. అతని పక్కనున్న బంధువు పరిస్థితికూడా అంతే ! ఆడవాళ్లు ఏడవడానికి శక్తిలేక, నోటికి గుడ్డలు పెట్టుకున్నారు కుమిలిపోతూ.

"దిగు శెట్టి !" అంటూ ఆజ్ఞాపించాడు ఒకవ్యక్తి. శెట్టి వెనుకనుండి దిగాడు. ఆ తర్వాత రెండోవ్యక్తి దిగాడు. ముగ్గురు ఆడవాళ్ళనూ దింపి, వారి ఒంటిమీది వస్తువుల్ని ఒలిచి తీసుకున్నారు. ఎవరూ మాట్లాడడంలేదు. ఒకరి నొకరు పలుకరించుకోవడంలేదు. ఐదుగురి చుట్టూ పన్నెండు మందీ నిలబడ్డారు. ముగ్గురి ఒంటిమీది నగలు కాలి గొలుసులు, మట్టెలతోసహా తీసుకెళ్ళారు. పోతూపోతూ గుర్రాన్ని బండినుండి తప్పించి నీళ్ళలోకి దింపి, అదలించారు. గుర్రం నీళ్ళలో దూరంగా పారిపోయింది. బండి మనిషి గుర్రం వెంట పారిపోకుండా అడ్డు నిలబడ్డారు. గుర్రం దూరం పోయిన తర్వాత,అందరూ రోడ్డు వైపుపరుగెత్తారు. మెయిన్‌రోడ్డు మూడు ఫర్లాంగులు ఉంది. మెయిన్‌రోడ్డు వెంట ముందుకుసాగి, దగ్గరలో ఉన్న సత్రం చేరారు.

ముఖాలకు కట్టుకున్న గుడ్డల్ని విప్పుతుండగా "ఒరేయ్! ఛాన్సులో మరో ఛాన్స్. ఏదయినా కారో, లారీయో వస్తుంటుంది. దాన్ని కొట్టుకొనివెళ్దాం" అన్నాడు ఒక వ్యక్తి. మిగిలినవారు గుడ్డలు అలాగే ఉంచి లేచారు. సత్రానికి రెండుఫర్లాంగుల దూరంలో వంతెన ఉంది. ఆ వంతెన వద్దకు వచ్చేవరకూ వంతెనమీద ఏమున్నదీ తెలియదు. వంతెనమీదకు పెద్ద బండరాళ్ళు మోసి అడ్డు పెట్టారు.

దూరంగా లైట్లు కన్పిస్తున్నాయి. ఏదొచ్చినాసరే, ఏదో ఒకటి కొట్టుకొని పోవాలని నిర్ణయించుకున్నారు. వంతెన కింద అటుకొందరు, ఇటు కొందరు సర్దుకున్నారు.

వంతెన వద్దకు వచ్చిన కారులోని వారు రోడ్డుమీదున్న రాళ్ళు చూసి ప్రమాదం గ్రహించారు. కాని వెనుతిరిగేలోపలే వచ్చి కారును చుట్టుముట్టారు పన్నెండు మంది. డ్రైవరును బయటకు లాగి తన్నారు. డ్రైవరు కిందపడిపోయాడు. లోపల ఇద్దరు పురుషులు, ఒక స్త్రీ ఉన్నారు.

"మర్యాదగా ఉన్న వస్తువులు, డబ్బు ఇవ్వండి. ఆలస్యం చేస్తే చంపేస్తాము" అన్నాడొకడు కత్తితీసి.

మిగిలినవాళ్ళు కూడా కత్తులు తీశారు. లోపలున్న వ్యక్తులు అందరినీ చూశారు. గుర్తుపట్టడానికి వీల్లేకుండా ముఖాలకు గుడ్డలున్నాయి. గడియారాలు, బంగారం గొలుసులు, రేడియో, నగదు మొత్తం




ఇచ్చారు. వాళ్ళను దించి, ఇంకా సోదా చేయాలనుకున్నారు. ఎదురుగా లైట్లు కన్పించడంతో అక్కడ ఉండడం ప్రమాదకరమని చేలల్లో అడ్డంపడి పారి పోయారు. జొన్న వారి కాళ్ళ కింద పడి బురదలో నలిగిపోతున్నది. వేరుశెనగ కాళ్లతోపాటు బురదలో ఊడి పైకిలేచి వస్తున్నది.

లారీవచ్చి నిలబడింది. ఎదుట కారు, రోడ్డుమీద రాళ్ళు ఉండటం, పక్కన డ్రైవరు పడిఉండటం చూసి లారీ దిగి అక్కడికి వచ్చారు. కారులో ఉన్నవారు పరిస్థితి చెప్పారు. లారీ నుండి దిగినవారు చుట్టూ చూశారు. ఆ చీకటిలో ఏమీ కన్పించడంలేదు. వారు మాట్లాడుకుంటూ ఉండగానే, ఎక్స్‌ప్రెస్ బస్ వచ్చి కారు వెనుక ఆగింది. జనం దిగి పరుగెత్తుకువచ్చి పరిస్థితి తెలుసుకున్నారు. జనం ఇప్పుడు చాలా మంది తోడయ్యారు; గనుక తిరిగి దొంగలు వచ్చినా ఎదిరించగలమనే ధైర్యం ఉంది. పాసింజర్లు అందరూ కలిసి అడ్డున్న రాళ్ళను వాగులోనికి దొర్లించారు. కారు డ్రైవరును కారులో పడవేశారు.కారు ఆసామి స్టీరింగ్ ముందు కూర్చున్నాడు. కారు, కారువెనుక ఎక్స్‌ప్రెస్ కదులుతూనే అక్కడ ఉండడం క్షేమంకాదని లారీ వాళ్లు కూడా కదిలారు.

మరో అర్ధగంటకు పోలీసు వేన్లు వచ్చి అక్కడ నిలబడ్డాయి. కారు ఓనరు వాళ్ళతోపాటు వచ్చాడు. రాళ్లు పేర్చిన చోటు, కారు నిలబడ్డచోటు చూశారు. డ్రైవరు కింద పడ్డచోట రక్తం గడ్డ కట్టి ఉంది. కవులూరు నుండి ఇద్దరు సైకిళ్ళ మీద వస్తున్నారు. పోలీసులను చూసి, శెట్టికి జరిగింది కూడా చెప్పి స్టేషన్‌కు వచ్చి రిపోర్టు ఇవ్వడానికి వెళ్తున్నా మన్నారు. వేన్లు కవులూరు వైపు పరు గెత్తాయి. శెట్టిని పంతెన పద్దకు తీసుకొని వచ్చారు. ఎక్కడ గుర్రంబండి నిల్పినదీ వివరాలు చెప్పాడు.

అంతా విన్న తర్వాత-

"వాళ్లు ఎవరని అనుమానిస్తున్నారు శెట్టిగారూ?" అన్నాడు డి.యస్.పి.

"ఈ ప్రాంతంలో ఇంకెవరుంటారు సార్! ఆ చెంచునాకొడుకులే! తేరగా తినడానికి మంది మీద పడి దోపిడీ చేస్తున్నారు" అన్నాడు శెట్టి.

"వాళ్ళు మాట్లాడుకుంటుంటే విన్నారా మీరు?"

"వాళ్ళెక్కడ మాట్లాడతారు? నోరు తెరచి మాట్లాడితే బయటపడిపోతామని నోరు మెదపకుండా పనిచేసుకుంటారు."

బండి మనిషి ముందుకు వచ్చాడు.

"వాళ్ళలో ఒకడు శెట్టిని దిగమని అన్నారండీ. అతడి మాటలు చూస్తే చెంచువాళ్ళ మాటల్లాగా అన్పించడం లేదు" అన్నాడు.

"నీకేం తెలుసురా వెధవా! వాళ్లు కూడా మాటలు మార్చి నాగరికంగా మాట్లాడు తున్నారు. తుమ్మ గూడెంలో చదువు కున్న వెధవలు చాలామంది ఉన్నారు. వారు మాట్లాడితే చెంచువాళ్ళ మాటలాగా ఉండదు" అన్నాడు శెట్టి.

కారు ఓనరు కూడా అదే మాట చెప్పాడు. "నమ్మల్ని వస్తువులు ఇవ్వ మని ఒకడు ఆజ్ఞాపించాడండీ! చెంచు వాళ్ళ భాషతీరు వేరేకదా! ఆ విధంగా నాకు అన్పించలేదు. చెంచువాళ్లు కాకపో వచ్చేమో!" అన్నాడు నిదానంగా ఆలో చిస్తూ.

శెట్టి "తుమ్మగూడెం చెంచు వెధవలే

అయి ఉంటారు" అన్నాడు నిశ్చితంగా.

తిరిగి శెట్టి ఇంటికి వెళ్ళారు. రాత్రి సినిమాహాలు వద్ద కన్పించిన వాసుదేవరెడ్డి కొరకు కబురు చేశారు. అతడు ఇంకా ఇంటికి రాలేదనీ, ఉదయం వస్తాడనీ చెప్పారు. వచ్చిన వెంటనే పోలీసు స్టేషన్‌కు రమ్మని చెప్పమన్నారు. మర్యాదగా రాకుంటే మళ్ళీ వస్తామని చెప్పారు.

"అతని మీద నీకు అనుమానం ఉందా?" అని అడిగాడు ఇన్‌స్పెక్టరు శెట్టితో.

"అతడు మా గ్రామం వాడే సార్! మంచివాడే! కాని, ఇటువంటి విషయాలలో ఏం మంచి? దొరికితే అందరూ లాగ దానికి ప్రయత్నం చేస్తారు"

"అంటే అతడి మీద మీకు పూర్తి నమ్మకం లేనట్లేనా?"

శెట్టి తల అడ్డంగా ఊపాడు. "నాకు నమ్మకం లేదు. ఆ మాట నేనంటే, రేపు ఉదయం నా జుట్టు పట్టి తంతాడు గ్రామంలో" అన్నాడు.

"అవన్నీ మేము చూసుకుంటాం. పోయిన వస్తువులతో ఫిర్యాదు రాసివ్వు"



పోయిన వస్తువుల గురించి వివరంగా రాశాడు. అతడు ఇచ్చిన స్టేట్‌మెంటు ప్రకారం ఏడుపందల గ్రాముల బంగారం, పదివేల రూపాయల నగదు వారి వద్ద ఉండాలి.

ఇన్‌స్పెక్టరుకు అనుమానం తగిలి "బంగారు వస్తువులంటే ఉండవచ్చు. కేవలం సినిమాకు వెళ్ళే మీరు పదివేల రూపాయల నగదు వెంటపెట్టుకొని వెళ్ళారంటే నమ్మశక్యం కావడంలేదు. నిజమేనా?" అన్నాడు గాంభీర్యంగా.

శెట్టి బెదరలేదు. "పదివేలేం ఖర్మ. పదిలక్షలతో బిజినెస్ చేసేవాడిని నేను. నా దగ్గర ఎంత డబ్బు ఉంటుందో ఈ గ్రామంలో విచారించుకోండి" అన్నాడు.

ఇన్‌స్పెక్టర్ మాట్లాడలేదు. లేచి జీపు వద్దకు వచ్చాడు. అంతకుముందే డి.యస్.పి. వచ్చి కూర్చున్నాడు. జీపు కదలి ఊరుదాటి వచ్చాయి.

వంతెనమీదకు వస్తూనే మళ్ళీ నిలబడ్డారు. తెలతెలవారుతున్నది. పరిసరాలు బాగా కన్పిస్తున్నాయి. చుట్టూ చూశారు. వంతెన కింద అడుగుజాడల కొరకు వెతికారు. లేవు. చిక్కగా అల్లుకుని ఉన్నాయి. అక్కడి నుండి కారు అటకాయించిన చోటికి వచ్చారు. అక్కడకూడా ఉదయం వెలుతుర్లో పరీక్షించారు. అడుగుల గుర్తుల ప్రకారం స్వతంలోకి వెళ్ళారు. స్వతంలో అడుగుల్ని పరీక్షించారు. రెండుచోట్ల దాడి చేసినవాళ్ళు ఒకరేనని నిర్ధారించుకున్నారు. జొన్న చేలలో అడ్డం పరుగెత్తినప్పుడు పడ్డ అడుగుల్ని పరీక్షచేశారు. చిక్కగా అల్లుకుని, బురద కాళ్ళ వెంటలేచి, తిరిగి పడటం వల్ల అడుగు స్పష్టంగాలేదు. ఈలోగా రైతులు పరుగెత్తుకుంటూ వచ్చి తమ జొన్నచేలు తొక్కడంతో పాడవుతున్నాయని గోలపెట్టారు. వారి గోల లక్ష్యపెట్టకుండా బెదిరించి, అడుగులు ఎటువైపు వెళ్ళాయో చూస్తున్నారు. క్రమంగా ముందుకువెళ్ళి రోడ్డుఎక్కారు. అక్కడి నుండి ఊరిలోకి పోకుండా ఊరి వెలుపలనుండి అడుగులు సాగుతున్నాయి. రసూల్‌పేట కూడా దాటి ఒక కొండ గుట్టమీద కొంతదూరం బురదతో అడుగులు కన్పించాయి. కొండగుట్ట దిగువన ఉన్న బావి వద్ద బకెట్, తాడు ఉంది. పక్కనే నిమ్మతోట ఉంది. అక్కడ అందరూ కాళ్లు కడుక్కున్నట్లు కన్పిస్తున్నది. తర్వాత ఎటువైపు వెళ్ళిందీ తెలియడం లేదు. కింద బాటల వెంట వెళ్ళితే అడుగులు కన్పించలేదు. బావి వద్ద నుండి కొండరాయి ఆరంభమవుతుంది. అట్నుంచి అదే వెళితే తుమ్మగూడెం వెళ్తుంది దారి. లేదా సుగాలి గూడెంవైపు రావచ్చు. లేదా వాగువెంట మైలుదూరం నడిచిపోణ్యాం వైపూరావచ్చు. ఎటు వెళ్ళిందీ అర్థం కావడం లేదు. ఇన్‌స్పెక్టరు ఆజ్ఞతో పోలీసు లోనికి వెళ్ళి తోట కాపలాదారుణ్ణి బయటకు తెచ్చాడు. ఈ పోలీసు అట్టహాసం చూసి వణకుతూ, దణ్ణంపెట్టి నిలబడ్డాడు.

"ఏవూర్రా నీదిముసలోడా?" అన్నాడు లాఠీవూపుతూ ఇన్‌స్పెక్టర్.

"తుమ్మగూడెం బాబూ!" అన్నాడు ముసలతను భయపడుతూ.

"ఏమిటోనివిరా?"

"చెంచోడిని బాబూ!"

"ఎంతదూరం ఉంటుందిరా నీ గూడెం ఇక్కడకు?"

"దగ్గిరే బాబూ! ఆ చెట్లు కన్పించేదే!" అన్నాడుదూరంగాకన్పించేచెట్లుచూపిస్తూ. చెట్లు దాదాపు మైలుదూరంలో ఉన్నాయి.

"రాత్రి పదిమందికిపైగా దొంగలు వచ్చి ఇక్కడ కాళ్ళు కడుక్కొని మీ గూడెం వెళ్ళారు. నీవు పలుకరించి మాట్లాడావా?"

"దొంగలా? మా గూడెంవాళ్లా? ఏమో బాబూ! నాకు ఏ చప్పుడూ కాలేదు. నా దగ్గరకు ఎవరూ రాలేదు"

"దొంగనాకొడకా! నిజం చెప్పక పోతే పొట్టలో పొడుస్తాను. మీ గూడెం వాళ్ల రాత్రి రోడ్డుమీద దొంగతనం చేసి ఇట్లా వచ్చారు. ఇక్కడికే వచ్చి కాళ్లెందుకు కడుక్కోవాలి? నీతో వాళ్ళకు లాలూచీ వుండే ఇక్కడికి వచ్చిఉంటారు. నిజం చెప్పు" అన్నాడు ముసలతని దగ్గరగా వచ్చి.

"లేదు బాబూ! నేను ఎవరినీ చూడ లేదు. ఈ తోవంట వచ్చేపోయేవాళ్లు నీళ్ళు తాగడానికి బావివద్ద బకెట్, చేతాడు మా షావుకారు పెట్టించాడు. ఎందరో రాత్రింపగళ్ళువచ్చిపోతుంటారు. మా గూడెం వాళ్లు ఈ పగలు కూడా రాలేదు బాబూ!" అన్నాడు వణుకుతూ.

అతనివల్ల లాభంలేదని నిర్ణయించుకుని మెలుదూరంలోనున్న తుమ్మ గూడెం వైపు సాగారు.

ఉదయం ఎనిమిది గంటలయింది. 'ఇంకా ముఖం కూడా కడుక్కోలేదు. ఈ ఇన్వెష్టిగేషన్‌తో మా ప్రాణాలు తీస్తున్నాడు వీడు' అనుకున్నారు పోలీసులు ముఖం మాడ్చుకుంటూ. టౌనులో ఉంటే ఈపాటికి కాఫీ, టిఫిన్ పూర్తిచేసి బిల్లు ఎవరి నెత్తికో రుద్ది రోడ్ల వెంట తిరిగేవారు. ఈ ఇన్వెష్టిగేషన్‌తో కాఫీ లేకపోయేసరికి, తలతిక్కపట్టినట్లుంది. తుమ్మగూడెం పెద్ద చెంచు నాగన్ని పిలిపించాడు ఇన్‌స్పెక్టరు. నాగడు వచ్చిన తర్వాత వివరాలు చెప్పాడు. "మీ గూడెం వాళ్లు తప్ప ఇంకెవరూ చేసి ఉండరు. పైగా రెండు రోజులనుండి జరిగిన దేవాలయం, బాంకు దోపిడీల్లో మీపేర్లే ఉన్నాయి" అన్నాడు బెదిరిస్తూ.

"మావాళ్ళు అటువంటివాళ్లు కాదు బాబూ! ఏదో చిల్లర దొంగతనాలు, గింజా, గిట్టా చేసేవారే గానీ, ఇటువంటి దారిదోపిళ్లు చేసే శక్తి మావారికి లేదు. పైగా పొలాలకు కాపలాలు ఒప్పుకొని, కొండలచుట్టూ ఉన్న చేలల్లో గుడిసెలు వేసుకొని ఉన్నారు" అన్నాడు నాగడు.

"ఇప్పుడేం కాపలారా! పొలాల్లో ఏం పంట ఉంది?"

"ఎందుకు లేదు బాబూ! వేరుశనగ రేపోమాపో పెరుకుతారు. వర్షాల మూలంగా ఆగారు. అడవిపందులు వచ్చి పడి, పెళ్ళగించి తినిపోతున్నాయి. క్రూర పొలాలలో పడి తొక్కిపోతున్నాయి."

"ఒరే! నీవెన్ని చెప్పినా నేను నమ్మను. మీవాళ్ళే ఈదాడిచేసి ఉంటారు. గూడెంలో ఉన్నవాళ్ళను పిలిపించు."

"ఎవరూ లేరు బాబూ! అందరూ పనులకు వెళ్ళారు. ముసలివాళ్ళు, పిల్లలు మాత్రమే ఉన్నారు" అన్నాడు నాగడు చేతులు జోడించి.

నిజానికి తమను వెతుకుతూ వసున్నారని వార్త ముందుగా అందడంతో యువకులు, యువతులు కొండల మీదకు పారిపోయారు. సుగాలి గూడెం, చెంచుల మీదదాడి జరిగినప్పటినుండి చుట్టూ ఉన్న గూడేలవాళ్లు తమ మీదకు కూడా వస్తారని భయపడి, ముందుగానే తప్పుకుంటున్నారు. పోలీసులు ఇళ్ళన్నీ తిరిగారు. పదిహేనేళ్ళకు మించినవారు. ఎవరూ వారికళ్ళబడలేదు. తిరిగి తిరిగి ఇళ్ల లెక్క





బెట్టుకొని వచ్చారు. మొత్తం నలభై గుడిసె లున్నాయి. ఇంతదూరం వచ్చినందుకు కనీసం గుడిసెలలెక్కైనా తెలిసినందుకు ఇన్‌స్పెక్టర్ సంతోషించి అక్కడినుండి బయలుదేరాడు.

"ఈ మూడుమైళ్లూ నడిచిపోవాల్సిందేనా సార్!" అన్నాడు పీసుకాళ్ల కానిస్టేబుల్ కాళ్ళీడ్చుకుంటూ నడుస్తూ.

"ఎందుకోయ్ నడక! హెలీకాప్టర్ వస్తుందిలే. నిన్ను ఎక్కించి పంపిస్తాను" అన్నాడు ఇన్‌స్పెక్టర్ వెటకారంగా.

పళ్లుకొరికి, కాళ్ళీడ్చుకుంటూ కదిలాడు కానిస్టేబుల్.

స్టేషన్‌కు చేరేసరికి పదిగంటలయింది. స్టేషన్ చేరుతూనే రైటర్ చెప్పాడు. "నాగ రాజుపల్లె రైలుస్టేషన్ మాష్టరును చెంచు వాళ్ళు బాది విడిచారు. చంపేవారే! ఇంట్లో దూరి తలుపు వేసుకున్నాడట. ఫోన్ వచ్చింది. యస్. ఐ. అక్కడికి వెళ్లాడు" అన్నాడు.

పోలీసులను ఇళ్లకువెళ్ళి, తిండి తిని తొందరగా రమ్మని పురమాయించాడు. అప్పటికే వాళ్లు అలసిపోయి ఉన్నారు. రాత్రి రెండుగంటలనుండి నిద్ర లేకుండా తిరిగి తిరిగి విసుగుపుడుతున్నది ఇప్పు డేమో మళ్ళీ ప్రయాణం! 'ఈ పోలీసు ఉద్యోగం చేయడంకంటే అడుక్కొని తిన్నా హాయిగా నాలుగుముద్దలు దొరికేవి కదా' అనుకున్నారు వాళ్లు.

ఒంటిగంటకు వేనులో నాగరాజుపల్లె వెళ్లడానికి సిద్ధపడ్డారు. దారి బాగాలేదనీ, వేను ఊరు దాటకముందే ఇరుక్కుం టుందనీ తెలిసి, వేనులోనే రైలుస్టేషన్‌కు చేరారు. రెండుగంటలబండి ఎక్కి పది హేను నిముషాలలో దిగారు.

అపాటికి యస్. ఐ. తన నలుగురు కానిస్టేబుళ్ళతో స్టేషన్‌మాష్టరు ఇంటివద్ద ఉన్నాడు. ఇన్‌స్పెక్టర్ కన్పిస్తూనే లేచి సెల్యూట్‌చేసి అంతవరకూ జరిగిన వివ రాలు చెప్పాడు.

ఉదయం బండిలో వేసుకపోవడానికి కట్టెలమోపులు ప్లాట్‌ఫారం మీదకు తెచ్చు కున్నారు చెంచువాళ్లు. మాష్టరు వేసుకో డానికి ఒప్పుకోలేదు. కట్టెలు వేయడంవల్ల ప్రయాణికులకు సౌకర్యం సరిగాలేదు గనుక వేసుకోనివ్వనన్నాడు. ఈరైలుబండి పడినప్పటినుండి కట్టెలు వేసుకు వెళ్తుంటే ఈ రోజే ప్రయాణికులకు ఆ సౌకర్య మేమిటని, సుగాలీలు, చెంచులు అడిగారు.

"ఇకఅంతే; నేను వేసుకోనివ్వను" అన్నాడు మాష్టరు. మాటా మాటా పెరి గింది. ప్లాట్‌ఫారంమీద పడేసి తన్నారు. ఇంటికి పారిపోయి, లోపలదూరి గడియ పెట్టాడు. కొందరు శాంతపరులు వెనక్కు లాక్కువచ్చారు మందిని. వెంటనే ఫోను చేశాడు పోలీసుస్టేషన్‌కు. పోలీసులు వచ్చే సరికే చెంచులూ, సుగాలీలు పారిపో యారు.

"సరే! మాష్టారుగారూ! ఇక్కడ ఎంతకాలంనుండి మీరు పని చేస్తున్నారు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"ఒకటిన్నర సంవత్సరమవుతుం దండీ!"

"ఒకటిన్నర సంవత్సరం అంటే దాదాపు ఐదొందల నలభై ఏడు రోజులు. అవునా?"

తల ఊపాడు స్టేషన్ మాస్టరు.

"ఇన్ని రోజులనుండీ వాళ్ళు కట్టెలు వేసుకపోవడం లేదా బండిలో?"

"వేసుకుని పోతూనే ఉన్నారు. ఐతు కనీ లెమ్మని ఊరుకున్నాను"

"ఇన్ని రోజులూ కనికరం చూపిన



మీరు ఈరోజు ఎందుకు వ్యతిరేకించారు?"

"మాకు పైనుండి ఆర్డర్స్ వచ్చాయి. ప్యాసింజర్లకు ఇబ్బంది కలిగించే ఏ వస్తువూ బండిలో పెట్టకూడదు. వ్యాపారాలు చేయకూడదని ఆర్డర్స్ పంపారు"

"ఈ ఆర్డర్స్ కొత్త కాదండీ ప్రతి డిపార్ట్ మెంట్ లోనూ దానికి సంబంధించిన విషయాలలో ఆర్డర్స్ వస్తూనే ఉంటాయి. ఆ విధంగా కూడా చూసీ చూడకుండా ప్రవర్తిస్తారు. ఎవరూ ఖచ్చితంగా ఆర్డర్స్‌ను బట్టి ప్రవర్తించరు. మీకు ఆర్డర్స్ ఏతేదీన వచ్చాయో చూపిస్తారా?"

మాస్టరు లేచి కాగితాలు తెచ్చి చూపించాడు. అప్పటికి పదిహేను రోజుల కిందట జారీ చేయబడి, పదిరోజుల కిందట ఆ స్టేషన్‌కు ముట్టినట్లు పోస్టల్ ముద్ర వల్ల తెలుస్తున్నది.

ఈ పదిరోజుల నుండి ఎందుకు ఆపడం లేదు?"

అతని ప్రశ్నలకు స్టేషన్‌మాస్టర్‌కు మండుతున్నది. జవాబివ్వకుండా ఊరుకున్నాడు.

"ఈ పది రోజులనుండీ వారిని ఆట కాయించకుండా ఉండి ఈరోజు అట కాయించాపంటే ఇక్కడ ఏదో తిరకాసు ఉంది. మీకు మామూలుగా ఇచ్చే లంచాలు ఇవ్వడంలేదా?"

"మిమ్మల్ని నా రక్షణకు పిలిపించాను కానీ క్రాస్ ఎగ్జామినేషన్ చేయడానికికాదు" అన్నాడు స్టేషన్‌మాస్టర్ కోపంగా. "మీరు నాకు రక్షణ ఇవ్వలేకుంటే వెళ్ళిపోవచ్చు. నేను రైల్వేపోలీసు నుండి రక్షణ తెచ్చుకుంటాను" అన్నాడు కోపంగా.

"మాస్టరుగారూ! ఎవరు వచ్చినా ఏమీ చేయలేరు. కానీ నిజమేమిటంటే వాళ్లు మీకు మామూళ్ళు ఇచ్చి ఉండరు. దానికి మండిపడి మీరు కట్టెలు బండిలో వేసుకోనిచ్చి ఉండరు. రోజూ కట్టెలు తీసుకొని వెళ్లి అమ్ముకొని వచ్చిన రాబడితో బతికే వాళ్ళ పొట్టలు మీరు కొట్టడం మంచిది కాదు. ఈ బండి పడ్డప్పటినుండీ వాళ్ళు వాళ్ళ పిల్లలు మోస్తూనే ఉన్నారు. ఈ రోజు వద్దంటే వారి బతుకుతెరువేమిటి? దొంగతనానికి పోయి బతకాలి. అంతేనా? ఆ విధంగా మనం వారికి దొంగతనం చేయమని పరోక్షంగా సలహా ఇస్తున్నాం. ఆ తర్వాత మాకు బోలెడన్ని కేసులు దొరుకుతున్నాయి. చేతనయినవాడు పెళ్ళాన్ని అమ్మి మాకూ లంచం కట్టి బయటకు వెళ్లుతున్నాడు. చేతగానివాడు జైలులో మగ్గుతూ, మాతో రోజూ తన్నించుకుంటున్నాడు. మీకు సలహా ఇవ్వటం మా ధర్మంకాదు. కాని ఒక్కటి మాత్రం నేను ఇన్‌స్పెక్టరుగాకాక, ఒక సాధారణ వ్యక్తిగా చెబుతున్నాను. వాళ్ళ నోళ్లు గొట్టినందుకు ఈ రోజు తన్నారు. వాళ్ళ కడుపులు మండితే రేపు ఏంజేస్తారో? ఈ విషయం జ్ఞాపకం ఉంచుకోండి" అన్నాడు హెచ్చరిస్తూ. లేచి బయటకు వచ్చి ప్లాట్‌ఫాం మీద నిలుచున్నాడు.

అంతవరకు అతని మాటలు వింటూ నిలబడ్డ మాష్టరు అవమానం జరిగినట్లుగా ఫీలవుతున్నాడు. యస్.ఐ. అతని భుజం తట్టి "అతగాడేదో ఉపన్యాసాలు ఇస్తూనే ఉంటాడులెండి. వాడో తిక్కవెధవ" అన్నాడు నవ్వుతూ.

"అయినా ఇంత నీతులు చెప్పేవాడు ఉద్యోగం ఎట్లా వెలగబెట్టుతున్నాడు?" అన్నాడు మాష్టర్ అసహ్యంగా ప్లాట్‌ఫాం మీద నిలబడ్డ అతన్ని చూస్తూ.

 

"నీతులు చెప్పేవాడు ఆచరించడు లెండి. చెప్పడానికేం నోరుంది. అందువల్ల చెప్పగలడు" అంటూ లేచి, తనూ ప్లాట్ ఫాం మీదకు వచ్చాడు.

"మీరిక్కడే ఉండండి. నేను వెళ్ళిపోతాను. అతను రక్షణ కోరాడు గనుక స్టేట్ మెంటు రాయించుకొని, ఎవరెవరిని అరెస్టుచేయాలో చేయండి. రాత్రికి రిజర్వు పోలీసులు కూడా కాపలాకు వస్తారు. రమ్మని మెసేజ్ పంపాను. వాళ్ళకు ఈ డ్యూటీ అప్పగించే వరకూ ఉండండి" అన్నాడు ఇన్ స్పెక్టరు.

తలూపాడు యస్.ఐ.

గూడ్స్ కాబిన్‌లో ఎక్కి ఇన్ స్పెక్టరు, అతని వెంట వచ్చిన పోలీసులూ వెళ్ళారు. తనవెంట ఉన్న నలుగురు కానిస్టేబుళ్ళతోనూ దగ్గరలోని సుగాలిగూడెం మీద చీకటి పడ్డ తర్వాత దాడిచేశాడు యస్.ఐ. ఆపాటికి కొందరు ఇళ్ళకు వచ్చారు. ఇంకా కొందరురాకుండా,కొంద



గుట్టల మీద తచ్చాడుతున్నారు. ఇళ్ల మీద హఠాత్తుగా దాడిజరగడంతో ఒక సుగాలి వ్యక్తి దొరికాడు. పట్టుకోబోయిన మరొక వ్యక్తి కానిస్టేబుల్‌ను గుండెల మీద కొట్టి పారిపోయాడు. దెబ్బతిన్న కానిస్టేబుల్ ఏడ్చుకుంటూ వారి వద్దకు వచ్చాడు. దొరికిన వాడిని చిత్తు చిత్తుగా బాది రైలుస్టేషన్ వద్దకు తీసుకువచ్చారు. ఒక గదిలో పడేసి బయట తాళం వేసి, పోర్టర్‌ను కాపలా పెట్టారు. దగ్గరలోని మరో చెంచు గూడెం మీద దాడి చేసి ఒక స్త్రీని, పురుషడిని తీసుకొని వచ్చారు. ముగ్గురినీ చితకబాదారు. ఈదాడి వార్తలు అన్ని ప్రాంతాలకూ ఒకరికొకరు అందించుకోవడంతో ఇళ్లకు రాకుండా జనం చెదరి పోయారు. కొండగుట్టల మీద స్టేషన్ మాష్టర్‌ను తిట్టుకుంటూ తిండి లేకుండా కాలం గడుపవలసి వచ్చినందుకు బాధ పడుతూ కాలం గడుపుతున్నారు.

తీసుక వచ్చిన ముగ్గురినీ చేతులు వెనుకకు విరిచి కట్టేసి, ఇద్దరు కానిస్టేబుళ్లను తోడు ఇచ్చి, పోలీస్ స్టేషన్‌కు పంపాడు యస్.ఐ. ఆ ముగ్గురినీ విపగగొట్టి రైలు ఎక్కిస్తుంటే జనం చూస్తూ ఉన్నారు రైలులో! స్త్రీ ముఖం మీద రక్తం గడ్డలు కట్టి ఉంది. జుట్టు చెదిరిపోయి ముందుకు పడుతున్నది. కళ్లనీళ్లు కార్చే శక్తికూడా లేనట్లు, అవమాన భారంతో తల వంచుకొని పెట్టెలో కింద కూర్చొని ఉంది. పురుషులిద్దరూ ఆమె పక్కనే కూర్చున్నారు. జనం చూస్తూ వివరాలు అడుగుతున్నారు పోలీసులను. 'మంచి శాస్తి జరిగింది. ఇలాగేజరగాలి' అన్నారు. కొందరు 'వాళ్ల బతుకు తెరువు కొల్ల గొట్టడం మంచిదా? కష్టమో నిష్టూరమో జనం సర్దుకొని పోతున్నారు కదా? ఇప్పుడేం బాధ కలిగింది?' అనుకున్నారు. స్టేషన్‌లోదిగి నడిపించుకుంటూ, పోలీసుస్టేషన్‌కు తెచ్చి లాకప్‌లో పడేశారు.




పోలీసులకు దొరక్కుండా తప్పించుకోడానికి సుగాలీలు, చెంచులు కొండల మీదకు పారిపోతున్నారు. చివరకు పొలాలకు కాపలా ఉన్నవారిని కూడా విడిచి పెట్టకుండా పోలీసులు వెంటపడటం, అరెస్ట్ చేసి తీసుకెళ్ళడంతో, గూడేల్లో ఇక రక్షణ లేదని వారు నిర్ణయించుకున్నారు. ఆ చుట్టుపట్ల పది చెంచూ గూడేలూ, ఎనిమిది సుగాలి గూడేలు ఉన్నాయి. అందులో పొలాలున్నవారూ, మంచి నడవడిక గలవారుగా పేరు తెచ్చుకున్నవారూ, గ్రామాలు విడువ లేదు. వారిలో కొందరు మేమే పారిపోయిన వారిని పట్టిస్తామన్నారు. వారి మాటలు పోలీసులు విశ్వసించకున్నా భుజాలు తట్టి పొగిడి, అప్పగించమని చెప్పారు.

ఆ ప్రాంతంలో జరిగే దోపిడీలన్నీ చెంచులూ, సుగాలీలూ కలిసి చేస్తున్నారు గనుక, ఆ ప్రాంతంలో అణచివేత సాగించాలని పోలీసు అధికారులు నిర్ణయించుకున్నారు. మొదటి నుండీ పోలీసుల




లిస్టులోనున్న కుటుంబాల మీద దాడి కేంద్రీకరించారు. ఆ కుటుంబాలకు చెందిన స్త్రీలను కూడా వాళ్లు విడిచి పెట్టడం లేదు. బాంకు దోపిడి, దేవాలయం దోపిడీలను తీవ్రంగా పరిగణిస్తూ పై నుండి రిమైండర్లు వచ్చి పడుతున్నాయి. నిద్రాహారాలు విడిచి పోలీసులు చెంచు, సుగాలీల మీద దాడిచేసి పట్టడానికి ప్రయత్నిస్తున్నా సాధ్యం కావడం లేదు. కొండలన్నీ చెంచు, సుగాలీలకు కొట్టిన పిండ. ఏ మూల ఏ ముందో, ఏ చెట్టు ఎంత విస్తీర్ణమో, ఎక్కడ నీటి ఊట ఉందో, ఎక్కడ గుహలు, రాళ్ళు ఉన్నాయో వారికి తెలుసు. అందువల్ల వాళ్లు దాక్కోవడానికి వీలుపడుతున్నది. పోలీసులకు అవేమీ తెలియవు. అందువల్ల వాళ్లు లోపల భాగాలకు పోకుండా బయట ప్రాంతంలోనే తిరుగుతున్నారు. వారు తిండికొరకయినా రాకతప్పదని పోలీసులు ఎదురు చూస్తున్నారు.

కొండ జాతుల్లోని ఈ రెండు తెగలు ఏకమై ఒక సమావేశం ఏర్పాటు చేసుకున్నారు. అందులో ముందు ఏం చేయాలనేది చర్చించుకోవడం ఆరంభించారు.

"మనం బయట దొరికితే పోలీసులు జలగల్లా పీల్చి నాశనం చేస్తారు. ఏ పరిస్థితుల్లోనూ కొండ విడిచి పోకూడదు" అన్నాడు డొక్కోడు.

"మరి మనం తిండి ఎట్లా సంపాదించుకోవాలి? తిండి లేకుండా ఎన్నాళ్ళుంటాము?" అన్నాడు రాముడు.

"ధాన్యం లారీలు వెళ్ళేటప్పుడు లోయల్లోనే నిలిపి కొల్లగొట్టి, స్థావరాల్లో స్టాకు ఉంచుకోవాలి. ఆ విధంగా ఆహారం సంపాదించుకోవాలి. ఇక మనం మంచి మాటలతో వాళ్ళను ఎదిరించలేం. దొరికితే సున్నంలోకి ఎముక లేకుండా విరిచేస్తారు" అన్నాడు డొక్కోడు.

"ఎన్నాళ్ళు ఇట్లా పడిఉంటాం? మరో ప్రాంతం పోదాం. ఇలాగే కొండల వెంట వెళ్ళితే నల్లమల అడవులలో పడతాం. అక్కడ ఏదో ఒక బతుకు తెరువు దొరుకుతుంది."

"ఎక్కడికి పోయినా మనగతి ఇంతే! దొంగలుగా ముద్రవేసి మన మీద దాడి చేస్తూనే ఉంటారు. మనం ఇలాగే వారి చేతిలో తన్నులు తింటూ కాలం గడపాల్సిందే. పైగా ఈ కొండలన్నీ పోలీసులు చుట్టుకుంటున్నారట. ఆ విధంగా మనల్ని బయటకు పోనివ్వకుండా, నాశనం చేయాలని ప్రయత్నిస్తున్నారు."

"ఇంతకూ దేవాలయం, బాంకు, కారుదోపిడీ చేసింది ఎవరు?"

"ఏమో? ఎవరికి తెలుసు. ఒకవేళ మనవాళ్లలోనే చేసినా, నిజం చెప్పరు. అందువల్ల దానిని గురించి చర్చించడం కంటే, ఇక మన ఆత్మరక్షణకు ప్రయత్నించడం మంచిది. మనం ఛస్తే ఈ కొండల్లోనే చావాలి కానీ పోలీసులకు దొరకకూడదు. వాళ్ళకు దొరికితే చావకుండా చంపుతూ కాలం గడుపుతారు. ఆడపిల్లల్ని నాశనం చేస్తారు. మనకళ్ల ముందే మనవాళ్ళను చెరుస్తే ఎట్లా ఓర్చుకుంటాం? అందువల్ల చావడానికయినా సిద్ధంగా ఉండాలి కానీ, దొరక కూడదు" అన్నాడు డొక్కోడు ఆవేశంగా.

"ప్రభుత్వం మనకేదో చేస్తున్నదంటున్నారుకదా! ఇదేనా చేయడం?" అన్నాడు ఒక యువకుడు.

"ప్రభుత్వం ఏం చేస్తున్నదో గానీ, ఆ పేరు చెప్పి మనల్ని వీళ్ల నాశనం చేస్తున్నారు" అన్నాడు మరొకడు.

ఎలాగూ దొంగతనం అంటగడుతూ ఉన్నారు గనుక; ఇక అదేమార్గం అవలంబించడం మంచిదనుకున్నారు చివరకి.

ఆరోజు రాత్రి భైరవాపురం చెరువు వద్ద ఇరవై మంది యువకులు, నలుగురు యువతులు కూర్చున్నారు. అర్ధరాత్రి దాటింది. చుక్కలను కప్పుతూ మబ్బులు పరుగెడుతున్నాయి. అందరి ముఖాల్లోనూ ఆందోళన కన్పిస్తున్నది. తిండి సంపాదించుకోవాలి. అదిలేకుండా బతకడం సాధ్యంకాదు.

ఎదురుగా వాహనం వస్తున్నది. ఆ వస్తున్న మోతను బట్టి లారీగానీ, బస్సుగానీ అయి ఉంటుందనుకున్నారు. ఏదయినా సరే ఇక తెగించాలనుకున్నారు. పెద్ద దుంగను రోడ్డుమీద పడేశారు. వస్తున్నది లారీ.

దుంగ వద్దకు వచ్చి ఆగిపోయింది లారీ. దానిలో సజ్జలున్నాయి. జనం చుట్టుముట్టుకున్నారు. ఒక్కరూ నోరెత్తి అరవలేదు. డ్రైవర్ దిగి పారిపోవడానికి



సిద్ధపడుతున్నాడు. జుట్టు పట్టుకొని కూర్చోబెట్టారు. ఒకడు ఈల వేశాడు. జనం చీమల దండులా వచ్చి పడ్డారు. తలోక బస్తా వీపుకు ఎత్తుకుని కొండల మధ్యకు చీకటిలో వెళ్తున్నారు.

అంతా అయ్యాక దుంగతీసి "పో" అన్నారు. డ్రైవరు 'బతుకు జీవుడా' అనుకుంటూ లారీ ముందుకు సాగించాడు. దెబ్బలు తగలనందుకు డ్రైవరూ, బండిలో ఉన్న ఇద్దరు పాసింజర్లూ, క్లీనరూ సంతోషించారు.

ఆ బండి పోయిన కొద్ది సేపట్లో మరో బండి వచ్చింది. దాన్నికూడా నిలిపి వేశారు. నిముషాల్లో దాన్ని కూడా ఖాళీ చేశారు. ముందు సజ్జల లారీ, ఇప్పుడు జొన్నల లారీ. లారీని విడచిపెట్టి అందరూ చీకటిలోనే కొండల లోయల్లోకి పారిపోయారు. లారీలు రెండూ వెళ్ళి పోలీస్ స్టేషన్‌లో రిపోర్టు ఇచ్చాయి. ఇన్‌స్పెక్టర్ యింటిలో హాయిగా నిద్ర పోతున్నాడు. లేపడానికి ధైర్యం చాలక "ఉదయం చూద్దాం. రిపోర్టురాసిచ్చి వెళ్ళండి" అన్నాడు రైటరు. లారీలవాళ్లు చేసేదేమీ లేక, రిపోర్టులు రాసిచ్చి బయటకు వెళ్ళారు.

"వీళ్ళకూ, వాళ్ళకూ లాలూచీ ఉందేమో? లేకుంటే వెంటనే వెళ్ళి ఎందుకు పట్టుకోకూడదు?' అనుకున్నారు వాళ్లు.

ఉదయం ఇన్‌స్పెక్టరుకు చెప్పాడు రైటర్. ఇన్‌స్పెక్టర్ మండిపడ్డాడు. "రాత్రి జరిగితే ఇప్పుడా నాకు చెప్పడం? రాత్రి పోలేకపోయామా? ఇప్పటికే ఇన్‌స్ట్రక్షన్స్‌తో ప్రాణాలు పోతున్నాయి. మీలాంటి తలకాయలేని బుర్రలతో ఇక్కడ ప్రాణం పోతున్నది" అన్నాడు.

వెంటనే కానిస్టేబుల్స్‌ను పిలిపించి సిద్ధపడమన్నాడు. భైరవాపురం చెరువు వద్దకు వచ్చాడు. తమకు ఈడ్యూటీ తప్పి పోతే బాగుండునని పోలీసుల ఆశ. ఈ ఆవేశాల్లో చెంచులచేతికి దొరికితే, పందిని తిన్నట్లు తమను కూడా కోసుకుతింటారని భయపడుతున్నారు. విధిలేక ఇన్‌స్పెక్టరు వెంట కదిలారు. చెరువు దిగువన తుప్పల గుండా గింజలు పడిఉన్నట్లు గమనించాడు ఇన్‌స్పెక్టర్. కొంత దూరం అలాగే లోపలకు వెళ్ళాడు గింజల ఆసరా చూసుకుంటూ. పోనుపోనూ ఇరుకైన లోయ లోనికి మళ్ళిందిదారి. లోపలకు వెళ్ళడమా, మానడమా అని ఆలోచిస్తున్నాడు. వెంట ఉన్న ఆరుగురు కానిస్టేబుల్స్‌వద్ద తుపాకులున్నాయి. తనవద్ద రివాల్వర్ ఉంది. కానీ, ఎదురు దాడి ఆరంభమయితే పోలీసులు కాల్చగలరా? లేక పారిపోతారా? అతనికి అనుమానమే! స్టేషన్‌లో పడి ఉన్న ఖైదీని బాదినంత సులభం కాదు ఇక్కడ! వారిచేతికి తాము చిక్కితే గొడ్లలాగా బాదుతారని అతనికి తెలుసు. వారున్న ఆవేశాలు అటువంటివి. తిండిలేక ప్రతిక్షణం పోలీసులచేత తరుమబడుతూ, ఇళ్లూ వాకిళ్లు విడిచి, చెట్లూ, పుట్టా పట్టి తిరుగుతున్నారు. వారి ఆగ్రహం మొత్తం పోలీసులమీదనే ఉంటుంది. అవిధంగా ఎదురుదాడికి దిగితే, వీళ్లు నిలబడకుంటే తాను దెబ్బతినవలసివస్తుంది. ఆలోచించి వెనుదిరిగాడు. అంత వరకూ వెనుక నిలబడిన పోలీసులు, ఇన్‌స్పెక్టరు ముందుకు దారితీసి తమ తలలు పగుల గొట్టిస్తాడేమోనని భయాందోళనలలో ఉన్నవారు, ఆయన వెనుకకు తిరుగుతూనే దీర్ఘంగా శ్వాసపీల్చి, విడిచి, సంతోషంగా తామూ ఆయనవెంట నడిచారు. అందరూ

వ్యాను వద్దకు వచ్చి నిలబడ్డారు.

అక్కడఉండి చేసేదేమీలేదు గనుక, వ్యాను ఎక్కి ప్రాణ్యం వచ్చారు. వెంటనే డి.యస్.పి. కి ఫోనుచేసి వివరాలు చెప్పాడు.

"వాళ్ళు ఆచూకీ అందలేదు. రెండు లారీలు కొల్లగొట్టుక పోయారు. ఎటు పోయిందీ అర్థం కాలేదు" అన్నాడు.

"తోవల్లో గింజలు పడలేదా? ఆ విధంగా ఎంక్వయిరీ తీయవలసింది?" అన్నాడు డి.యస్.పి.

"ప్రయత్నం చేశాం సార్! తోవల్లో కొంతదూరం గింజలు పడ్డాయి. తర్వాత కన్పించలేదు. అందువల్ల దారితెలియక వెనుతిరిగివచ్చాను. కొంత దళాన్ని ఇక్కడే ఏర్పాటు చేయడం మంచిది."

గింజలు పడ్డాయని చెబితే 'ఎందుకు వాటివెంట వెళ్ళలేదు?' అంటాడు. ఆ దమ్ములేకనే తాను అక్కడినుండి వెనుకకు వచ్చాడు. తన పిరికితనాన్ని వెల్లడించడం అతనికి ఇష్టం లేదు. అందుకే అబద్ధం చెప్పాడు. ఎలాగూ డి.యస్.పి. వచ్చి చెక్ చేయడం లేదుగదా!

సాయంత్రం ఐదుగంటలకు డి.యస్.పి. జీపు వచ్చింది. అక్కడినుండి కర్నూలు దారిపట్టారు. దారిలో భైరవాపురం చెరువు వద్ద దోపిడీ

జరిగిన చోటు చూపించాడు. అప్పటికే చీకటి పడుతూఉండటం వల్ల, అక్కడ దిగి పరిశీలించాలని డి.యస్.పి. అనుకో లేదు. సరాసరి వెళ్లారు. అక్కడ ఖైదీల వద్దకు వెళ్ళి చూశాడు. రాత్రి తిన్న దెబ్బలనుండి ఇంకా కోలుకున్నట్లు లేదు. మిగిలిన ఐదుగురు పోలీసు ఆఫీసర్లను చూసి లేచినిలబడి వణకుతూ తలలు వంచుకుని నిల్చున్నారు. తలలు పంకించి, యస్.పి. ఆఫీసుకు వచ్చారు. యస్.పి. ఆఫీసులో ఉన్నాడు. ఎదురుగా ఇన్‌స్పెక్టర్లు, మరో డి. యస్. పి. ఉన్నారు. వెళ్ళి శాల్యూట్ చేశారు.

"రండి! మీకొరకే ఎదురుచూసున్నాము. తిరిగి ఈ రాత్రి ఇంటరాగేషన్ జరపాలి. నిజం ఎంత తొందరలో తెలిస్తే అంత మంచిది" అన్నాడు.

తలలు ఊపారు. అంతకంటే ఏం మాట్లాడడం బాగుండదని.

రాత్రి ఒంటిగంట సమయంలో తిరిగి లాకప్‌నుండి హనుమంతును తెచ్చారు. అంతకు ముందు రాత్రే బాగా దెబ్బలు తిన్నాడు.

సూపర్నెంట్ అడిగాడు "చెప్పండ్రా. ఎందుకు ప్రాణాలు తీసుకుంటారు? బాంకు డబ్బు దొరకకుంటే మీ శవాలు హంద్రీ నదిలో పారేస్తాంరా! బతికి బయటపడతామనుకుంటున్నారేమో?"

జవాబివ్వలేదు హనుమంతు. ఇన్‌స్పెక్టర్ ఒకరు లాఠీతో వీపు మీద బాదాడు. 'అమ్మా' అంటూ అరచాడు హనుమంతు. లాఠీ విరిగి రెండు ముక్కలైతే ఒక ముక్క కిందపడింది. చేతిలో ఉన్న ముక్క విసిరివేశాడు ఇన్‌స్పెక్టర్. రూళ్ళకర్ర అందించాడు కానిస్టేబుల్.

బూటుకాలితో తొడమీద తన్నాడు ఇన్‌స్పెక్టర్. వెల్లకిలా పడ్డాడు హనుమంతు. "చెప్పు..చెప్పు..చెప్పు" అంటూ బాదుతున్నాడు. హనుమంతు చెప్పడం లేదు. చెప్పే స్థితిలోలేడు. ఇన్‌స్పెక్టర్‌కు అనుమానం వచ్చింది.

"చచ్చాడేమో చూడరా?" అన్నాడు కానిస్టేబుల్‌తో.

కానిస్టేబుల్ వేలు ముక్కు వద్ద




ఉంచి "వీడెందుకు చస్తాడు సార్!" అన్నాడు కాలితో చేతిమీద తొక్కి.

"ఈడ్చుకెళ్ళి లాకప్‌లో వేసి, మరో కడిని పట్రా" అరచాడు యస్.పి.

హనుమంతును తీసికెళ్ళి లోపల పడేసి జమాల్‌ను తీసుకొచ్చారు. జమాల్ ముసలి వాడు. యాభై సంవత్సరాలకు పైగా వయస్సు ఉంటుంది. నెరసిన జుత్తు, మీసాలు! మొలమీద చిన్నలుంగీగుడ్డ తప్ప ఇంకేమీ లేదు.

"ఏవూ రా నీది?" అన్నాడు యస్.పి.

"పాణ్యం సార్!"

"ఏంటోనివిరా?"

"ముసల్మాను సార్!"

"మరి చెంచుగూడెంలో ఎందుకు పడిఉన్నావ్?"

"ఒక చెంచుపిల్లను పెండ్లి చేసుకుని అక్కడే ఉంటున్నాను సార్!"

"నీకు పిల్లలా?"

"ఇద్దరు ఆడపిల్లలూ, ఒక కొడుకూ ఉన్నారు సాబ్!''

"పిల్లలకు పెళ్ళయిందా?"

"ఒక ఆడపిల్లకయింది సాబ్!"

"నీ వాటా డబ్బు ఎక్కడ పెట్టావ్?''

క్షణకాలం దిమ్మెరపోయి చూశాడు జమాల్. యస్.పి. ప్రశ్న అతనికి అర్థ మయింది. అతను నోరు తెరచేలోగా ఇన్‌స్పెక్టరు జుట్టుపట్టుకుని "చెప్పరా బోషడీకే!'' అంటూ వీపున తన్నాడు. యస్.పి. వారించాడు.

"వీడు ముసల్మాన్! ముసల్మాన్ అంటే ఎంతో నిజాయితీపరుడు. నీకు అల్లా మీద విశ్వాసం ఉందిరా?''

"ఉంది సాబ్! ప్రతి రోజూ రెండు సార్లు నమాజ్ చేస్తాను.''

"ఇటువంటి నీతిపరుడు తప్పకుండా నిజం చెప్పేస్తాడు. కొట్టవద్దులే! చెప్పు జమాల్! నీవయినా నిజం చెప్పి, పెళ్ళాం పిల్లల్ని చేరు. నీవు నిజం చెపితే ఒక్క దెబ్బ పడదు. లక్షణంగా విడిచి పెడతాం" అన్నాడు యస్.పి.

యస్.పి. వేస్తున్న మాత్రి బాగా అర్థ మవుతున్నట్లు తల ఊపాడు జమాల్.

"చెప్పు. బాంకులో డబ్బు, దేవా లయం దోపిడీ సొమ్ము ఎక్కడ పెట్టారు?''

''నాకు తెలియదు సాబ్!"

''పోనీ అందులో ఎవరెవరు పాల్గొ న్నారో చెప్పరా?''

''నాకు తెలియదు సాబ్!''

''నీవు పాల్గొనలేదా?''

''లేదు సాబ్!''

రొమ్ములమీద బూటుతో తన్నాడు యస్.పి. ఆగ్రహం పట్టలేక! ఆ దెబ్బతో వెల్లకిలా పడిన జమాల్ చేతులమీద, కాళ్ళ మీద కర్రలతో బాదారు. అరుస్తూ, అటూ ఇటూ పొర్లడం తప్ప ఏమీ చేయలేక పోయాడు జమాల్. ఈడ్చుకుంటూ తీసుకెళ్లి లాకప్‌లో పారేసారు.

తర్వాతవంతు ఎల్లయ్యది. హనుమంతు అన్న ఎల్లయ్య. తల విరియబోసుకొని పెద్దపులిలా ఉన్నాడు. గోచి తప్ప అతడి ఒంటిమీద గుడ్డలేదు. జమాల్‌లాగా అతన్ని పలుకరించకుండా లోనికి రావడంతోటే తన్నారు కిందపడేసి. కొంతసేపుబాది, అలుపు తీర్చుకోడానికి పోలీసులు, ఇన్‌స్పెక్టర్లు ఆగారు.

''చెప్పు'' అన్నాడు యస్. పి. ఎల్లయ్యను చూస్తూ.

ఏం చెప్పాలో తెలియక ఎల్లయ్య ఆయన వైపు చూశాడు. వెనుక నుండి ఇన్‌స్పెక్టర్ జుట్టుపట్టి, మెడవెనుకకువంచి

దవడమీద గుద్దాడు "చెప్పరా బోషడీకే!" అంటూ. పన్ను విరిగి నోటిలోనికి వచ్చింది. కారుతున్న రక్తంతో పాటు కింద బండమీద పడింది పన్ను. రక్తం మడుగులా తయారయింది. ఎల్లయ్య చెప్పడానికి అవకాశం ఇవ్వకుండా మళ్లీ కొట్టబోయారు. యస్.పి. వారించాడు.

''చెప్పు" అన్నాడు మళ్ళీ.

మళ్ళీ అదేచూపు 'ఏం చెప్పాలా?' అని.

''బాంకు దోపిడీకి పిస్తోళ్లు ఎవరి చ్చారు మీకు?''

''నాకు తెలియదు''

''కారు ఎవరిది?"

''తెలియదు"

ఎల్లయ్య తలమీద లాఠీ పడింది. ''అమ్మా'' అంటూ రెండు చేతులూ నెత్తిమీద పెట్టుకున్నాడు. చేతి వేళ్ళమీద లాఠీ పడింది. చేతులు విదిలిస్తూ కిందికి దించుకున్నాడు. ఎల్లయ్యను ఈడ్చు కుంటూ తీసుకెళ్ళారు.

పోలయ్యను తెచ్చారు. అందరికంటే బలిష్టమైనవ్యక్తి పోలయ్య. ఎంత బాదినా భరించగలడనుకున్నారు. అందరిలా కొట్ట కుండా రౌండ్ షేప్ పిన్స్ ఉపయోగించారు అతనిమీద. టీకాలు వేసినట్లు శరీరం మీద చర్రున తిప్పుతుంటే ఆ పిన్నులు పడినచోట చక్రాకారంలో గీతపడి నెత్తురు ధారగా కారుతున్నది. ఏడుస్తున్నా ఎవరూ లెక్క చేయడం లేదు. యస్. పి. వాచ్ చూసు కున్నాడు. ఐదు నిముషాలు బాధించినా ఇంకా స్పృహతప్పనందుకు సంతోషిస్తూ "చెప్పు" అన్నాడు యస్. పి.

"తెలియదు,"

ఎంత కొట్టినా, హింసించినా జవాబు ఒకటే విన్పిస్తున్నది. లాకప్‌లో అందరూ కలిసినిర్ణయించుకుని ఈవిధంగా మాట్లాడు తున్నారు. చెబితే బాంకు దోపిడీకి పదేళ్లు, మానభంగం హత్యకేసులో యావ జ్జీవశిక్ష పడతాయని వారికి తెలుసు. అందుకే చెప్పకుండా ఉన్నారు. ఈ దొరి కినవారికి బాంకు దోపిడే కానీ, దేవా లయం దోపిడీ లేదు. వీరు లాకప్‌లో ఉండగా దేవాలయం దోపిడీ జరిగింది. అందువల్ల వీరికి ఆ కేసు వర్తించదు. అయినా ఇరికించాలంటే సమస్య కాదు. ఆ కేసులతో జీవితాంతం లోపల పడవలసి వస్తుందనే భయంతో వారు ఇక్కడ చావ డానికయినాసిద్ధపడ్డారు కాని,జవాబివ్వడం లేదనుకున్నారు ఆఫీసర్లు. మగవాళ్ళ వంతు అయిన తర్వాత ఆడవారిలో వీరమ్మను మళ్ళీ తీసుకువచ్చారు. నిన్నటి దెబ్బలకే వేళ్ళువాచి, చెయ్యి కదల్చ లేకుండా ఉంది. జలకమ్మ అన్నం నోటిలో పెడితే తినింది. కారం నోటిలో పెడితే, నరాలు జరజరమని మంటతో లాగుతున్నాయి. అలాగే తినక తప్పలేదు.

ఎదురుగా ఆమెను విసిరి కింద పడేశారు. మాసిన చీర, రవికతో తలంతా విరబోసు కొని ఉంది వీరమ్మ. రాత్రి బుగ్గమీద కాల్చిన సిగరెట్ కాల్పువద్ద అప్పుడే రసి కారుతున్నది. పుండు విపరీతంగా నొప్పి పెడుతున్నది.

"ఇప్పటికయినా చెప్పవే ముండా! ఎందుకు ప్రాణం పోగొట్టుకుంటావు?బయట ఉంటే ఏ పనో చేసుకొని బతుకవచ్చు. నీవు నిజం చెబితే ఒక్క క్షణం ఇక్కడ ఉంచను" అన్నాడు యస్. పి.

వీరమ్మ జవాబివ్వలేదు. అనవసర మనుకుంది. జవాబిస్తుంటే మరింత రెచ్చి పోయి గాడిదను బాదినట్లు బాదుతారు.

 

అందువల్ల వారిచేతులు నొప్పి పుట్టేవరకూ కొట్టుకోనివ్వమనుకుంది. వద్దన్నా, బతి మాలినా వినరుమరి.

ఒక ఇన్‌స్పెక్టర్ ఆమె పమిట పట్టి లాగాడు. అంతకుముందే చిరగడానికి సిద్ధంగాఉన్న ఆ చీర నడుంవరకు చిరిగి అతడి చేతిలోకి వచ్చింది. రొమ్ములమీద గుడ్డలేకుండా కన్పిస్తున్న ఆమెను చూసి అసహ్యించుకుంటూ యస్. పి. అక్కడి నుండి లేచివెళ్ళాడు. ఇన్‌స్పెక్టర్ సిగరెట్టు రెండోబుగ్గమీద కూడా పనిచేసింది. ఆ సమయంలో ఆమెచూసిన చూపు ఇన్‌స్పె క్టరునే వణికించింది. వాచిపోయిన చేతిని కళ్ళకు అడ్డుపెట్టుకొని ఏడ్చింది. తలుపు దగ్గరున్న పోలీసు తల పక్కకు తిప్పు కొని కళ్ళు తుడుచుకున్నాడు.

ఆమె జుట్టు పట్టిలాగాడు ఇన్‌స్పెక్టర్. వెల్లకిలాబడ్డ వీరమ్మ క్రోధంతో అతని వైపు చూసింది. "నీ పెండ్లాంపిల్లల్ని నాలాగే



ఈడ్చేరోజులు వస్తాయిరా! నీవే మొగాడి ననుకుంటున్నావేమో? నిన్ను మించినోళ్ళున్నారు. నీ పెండ్లాం పిల్లలు ఇలాగే అల్లరి పట్టినప్పుడు తెలుస్తుంది నీ కథ" అంది పండ్లు కొరుకుతూ.

మరుక్షణం కాలిన పుండ్లమీద ఇన్‌స్పెక్టర్ చేతులు డప్పు మీద మోగినట్లు మోగాయి.

"రేయ్!" అన్నాడు కానిస్టేబుల్‌ను చూస్తూ ఇన్‌స్పెక్టర్ ఆయాసపడుతూ.

కానిస్టేబుల్ ఇటు తిరిగి అతనివైపు చూశాడు.

"దీని నోట్లో ఉచ్చ పోయరా!" అంటూ అరిచాడు.

కానిస్టేబుల్ ఇన్‌స్పెక్టర్ వైపు తీక్షణంగా చూశాడు. "నేను ఉచ్చ పోయడానికి కాదుసార్ డ్యూటీ ఒప్పుకున్నది." అన్నాడు ఆవేశంగా.

"రేయ్!" అన్నాడు పండ్లు పటపట కొరికి ఇన్‌స్పెక్టర్, కానిస్టేబుల్ మీదకు చెయ్యెత్తి.

"సార్! మర్యాద ఇచ్చి పుచ్చుకోండి. నాకూ ఇక్కడ హక్కులున్నాయి. నాకూ న్యాయం తెలుసు" కానిస్టేబుల్ మాట పూర్తిగాకుండానే ఇన్‌స్పెక్టర్ బుస కొడుతూ అక్కడినుండి వెళ్ళిపోయాడు.

వారిద్దరిమధ్య వాగ్వివాదాన్ని వింటూ తల నేలకు అన్చిపడి ఉంది వీరమ్మ.

అరగంటవరకూ చూశాడు కానిస్టేబుల్. ఆమెను లోపలవెయ్యమని ఎవరూ వచ్చి చెప్పలేదు. ఏం చేయాలో కూడా చెప్పలేదు. తిరిగి ఎవరూ రాలేదు. తన మీద బాధ్యత లేకుండా ప్రవర్తించదలచుకున్నాడు. ఆమె దగ్గరగా వచ్చి వంగి చూశాడు. చెంపలు చిదపలయి రక్తంతో అట్టలు కట్టింది. పెదవుల నిండా రక్తం. శరీరంమీద రక్తం పారి అట్టలుకట్టాయి. వెంట్రుకలు చెల్లాచెదరుగా పడిఉన్నాయి. నేలమీదున్న నెత్తురు ఇంకా ఎండిపోలేదు మిలమిల మెరుస్తున్నది లెటు వెలుతుర్లో. అతన్ని చూసింది కానీ లేవలేదు వీరమ్మ.

"వీరమ్మా" అన్నాడు అతడు వంగి చిన్నగా. అతని కళ్ళల్లోకి చూసింది.

"లేస్తావా?" అన్నాడు తిరిగి. గోడ ఆసరా చేసుకుని మెల్లిగా లేచి కూర్చుంది.

"లాకప్‌లోనికి నడుస్తావా?"

తల ఊపి లేవబోయింది కానీ లేవ లేకపోయింది. చెయ్యిపట్టి లేపాడు. అతని చెయ్యి ఆసరాతో లాకప్ వరకూ నడిచింది. అపాటికే జలకమ్మ నెత్తురు మడుగులతో తిరిగి వచ్చింది లాకప్ రూంకు. ఆమెను మరో గదికి తీసుకెళ్ళి బాది ఉంటారని అనుకున్నాడు పోలీసు. ఆమెను లాకప్ దగ్గర విడిచి సెంట్రీని కేకేశాడు. సెంట్రీవచ్చి లాకప్ తలుపు తెరిచాడు. నేలన పాకుకుంటూ లోనికి వెళ్ళింది వీరమ్మ. ఆమె లోనికి వెళ్లతూనే తలుపు వేసి తాళం వేశాడు సెంట్రీ.

"ఏ ఖూని చేసి ఉంటారంటావా?" అన్నాడు సెంట్రీ వారివైపు చూస్తూ.

"ఒరేనాయనా! ఈ దేశంలో తప్పులు చేసినవాళ్ళు ఎవరూ దెబ్బలుతినరురా! లంచాలు మేపి తప్పించుకుంటారు. తప్పులు చేసినా, చేయకపోయినా దెబ్బలు తినేది ఇటువంటివాళ్ళే! వీళ్ళకూ, మనకూ తేడా ఏమీలేదురా! వాళ్ళు అడవి పేద వాళ్లు, మనం పల్లెపేదవాళ్ళం. ఈ దేశంలో నాశనమయ్యేది చివరకు వాళ్లూ, మనమే! మిగిలినవాళ్లు హాయిగా బతుకుతారు" అన్నాడు కానిస్టేబుల్ అక్కడి నుండి వెళ్లిపోతూ. వెళ్ళిపోతున్న కానిస్టేబుల్‌ను చూస్తూ తల కడీలకు ఆన్చి ఒరిగింది

 

వీరమ్మ. సెంట్రీ తన స్థానంలోనికి వెళ్ళి నిలబడ్డాడు.

* * *

తిరిగి నరద్యాలకు మార్చారు ఆ ఎనిమిది మందినీ. వారి నుండి రహస్యాలు లాగడం సాధ్యం కాలేదు. తెలిసి చెప్పడంలేదో, తెలియక చెప్పడంలేదో ఆఫీసర్లకే అర్థం కాలేదు. సాధారణంగా చెంచులు ఎప్పుడూ కేసును ఒప్పుకోరు. వాళ్ళని ఒప్పించడం సాధ్యం కాదు. గాడిదల్ని బాదినట్లు బడితెలు తీసుకొని బాదినా జవాబు కూడా ఇవ్వరు.

ఎర్ర కొండలలో నివసించే వారిలో చెంచులు, సుగాలీలు ముఖ్యులు. సుగాలీలకు మైదాన ప్రాంతం నుండి ఆవులు, గొర్రెలు లాంటివి మేపడానికి తోలు కొస్తారు. నెలకింత అని వారికి జీతాలు ఉంటాయి. తిరిగి ఎండాకాలం వచ్చి ఎవరివి వాళ్ళు తోలుకెళ్తుంటారు. వారికి కొద్దో గొప్పో పొలాలున్నాయి. ఆ పొలం మీద కొంత, ఆవులు, గొర్రెలు మేపడం ద్వారా కొంత ఈ పశువుల పెంట పోగుచేసి అమ్ముకోవడం ద్వారా కొంత ఆదాయం ఉండటం వల్ల వారిలో దొంగ తనాలు చేసేవారు చాలా తక్కువ. మైదాన ప్రాంతాలకు కూడా పనులు చేసుకోడానికి వెళ్తుంటారు. గనుక వారిలో దొంగతనం తక్కువే! పైగా సాధుస్వభావులు. మైదాన రైతులతో వారికి నిత్యసంబంధాలుంటాయి. అవసరమైతే తిండి గింజలు కూడా అప్పు పుట్టించుకోగల స్థోమత గలవారు.

చెంచువారి పరిస్థితి అందుకు వ్యతిరేకం. వీరు ప్రధానంగా కొండల మీదనే జీవిస్తుంటారు. కొండల మధ్య లోయల లోని భూములు సాగుచేయడానికి వీలుంటే చేసారు. కానీ. అది వారి వృత్తి కాదు. పండితే పండుతుంది లేకుంటే లేదన్నట్లు ప్రవర్తిస్తారు. ముఖ్యంగా అడవిలో దొరికే కుంకుడుకాయలు, సీతాఫలాలు, కలీపండ్ల మీద ఆధారపడతారు. పురుషులు అవి ఏరుకుని వస్తే, స్త్రీలు గంపల కెత్తుకొని పల్లెల మీద అమ్మకం చేస్తారు. కుంకుడుకాయలు అతితక్కువ రేటుతో వర్తకులు కొంటారు. బజారులో మూడు రూపాయల ధర ఉంటే, ఒక రూపాయ ఇస్తారు. అయినా వీళ్ల అమ్మక తప్పదు. అంతో ఇంతో వీరి నుండి అప్పు తీసు కుంటారు గనుక అది తీర్చడానికి వారికి ఇంతకు మించి గతిలేదు. ఎక్కడయినా తేనెతుట్టెలు దొరికితే తెచ్చినా వాటి ధర కూడా అధ్వాన్నంగానే ఉంటుంది.

పంట కాలంలో పొలాల మీద కాపలా ఉంటారు. మొత్తం కుటుంబం రాత్రీ పగలు కాపలా ఉన్నా వారికిచ్చే జీతం ఒక పూట కూటికి సరిపోదు. ఒంటి మీద సరిఅయిన బట్ట ఉండదు. స్త్రీలకు ఎన్నో అతుకులుబడ్డ రంగు రంగుల చీరలు ఉంటే, పురుషులకు గోచిగుడ్డ మాత్రం ఉంటుంది. ఇతర ప్రాంతాలకు వెళ్ళడానికి ఒక జత మామూలు కట్టు గుడ్డలు ఉంటాయి. ఈ విధంగా దోపిడీకి గురి కావడం వల్లా, పొలాలు చేసుకునే వీలులేక పోవడంవల్లా చెంచువారిలో దొంగతనాలు నిత్య కృత్యాలయ్యాయి. వీరి దొంగ తనాలకు తట్టుకోలేక సుగాలి గూడెంవద్ద చెంచువారికి ప్రత్యేకంగా ఇళ్లు కట్టించి అక్కడ ఉంచారు. ఉండడానికయితే ఇళ్లు చూపించారు. తినడానికి తిండెవరు పెడతారు? తిరిగి వాళ్ళు యధావిధానాన్నే కొనసాగిస్తున్నారు. ఈ దోపిడీ



లకు తట్టుకోలేక రైతులు తమ పొలాలకు కాపలాగా వారినే నియమిస్తున్నారు. చెంచువాడు కాపలాఉన్న పొలంలో మరొక చెంచువాడు దొంగతనం చేయడు. అది వారి కట్టుబాటు. ఆవిధంగా కొంత పంట దోపిడీ అరికట్టారు. అంతవరకూ వారు పంటమీద పడి తెచ్చుకుని తినేవారు. రైతాంగం ఈ విధంగా చేయడంతో, ఇక ఇళ్లమీద దొంగతనానికి దిగారు. రాత్రిపూట ఇళ్లమీద పడి దొంగతనం చేయడం, ఆ వచ్చిన డబ్బు తినడం, బంగారం దొరికితే షాహుకార్లకు మార్కెట్ రేటులో నాలుగో వంతుకు అమ్మడం, కొన్నవారు బాగుపడటం, వీళ్ళు ఇలాగే కుళ్ళిపోవడం జరుగుతున్నది.

ప్రభుత్వం వారికి సహాయం చేయడమే తక్కువ. ఆ చేసేదానిలో మధ్యవర్తుల నిలువు దోపిడీ ఎక్కువ. పైగా పోలీసుల కళ్లు ఎప్పుడూ వారి మీదనే. ఎక్కడ దొంగతనం జరిగినా మొదట వారిమీద దాడి చెయ్యటం అలవాటయింది. నాగరిక జీవితం వైపు మొగ్గి అంతో ఇంతో చదువుకుని, తమతో పాటు తమ



వారినీ సక్రమ మార్గంలోకి తీసుకు వెళ్లాలని ప్రయత్నించే యువకులు కూడా చివరకు పోలీసుల వల్ల జైలుపాలుకాక తప్పడంలేదు. మంచి మార్గంలోకి రావాలన్నా పోలీసులు అడ్డుపెట్టడంతో, వాళ్లు కూడా తమకు దొంగతనమే శరణ్యం అన్నట్లు ప్రవర్తించ నారంభించారు.

ఇప్పటి పరిస్థితి కూడా అంతే! ఒక విధంగా చెంచుల్ని రెచ్చగొట్టారు. కవులూరు శెట్టిని, కారునూ దోచిందీ, దేవాలయం, బాంకు దోచిందీ ఎవరో తెలియకున్నా చెంచువాళ్ళేననే నిశ్చయానికి వచ్చారు పోలీసులు. పైగా కుక్కలు పట్టించాయిని వాళ్లు అంటున్నారు. కుక్కలు ఫెయిలవుతూ ఉంటాయని కూడా వాళ్ళే అంటున్నారు. అయినా సరే, కుక్క పట్టిందనే అనుమానంతో వారిని తీసుకువచ్చారు. మిగిలిన నేరాలు కూడా వారివేనని తేల్చి గూడేల మీద రాత్రుళ్లు దాడి ఆరంభించారు. దాడికి తట్టుకోలేక వాళ్లు కొండలు పట్టారు. తిండి కొరకు దోపిడీలు, లారీలు కొల్లగొట్టడం తప్పదు. మనిషికి అన్నిటికంటే తిండి ముఖ్యం. పరారయిన ఆ వ్యక్తులు లారీలు కొల్లగొట్టక తప్పడంలేదు. కట్టెలు అమ్ముకోవాలంటే అధికారుల దయాదాక్షిణ్యాలుండాలి. వారికి వ్యతిరేకం అయితే రైలులోపోనివ్వరు. పోకుండా ఉంటేతిండికి జరుగదు. ఫలితంగా దొంగతనమే వారికి మార్గంగా కన్పిస్తున్నది.

బాంకు దొంగతనంలో వీరుగాక మరొకరు దొరికితే పోలీసులు ఈ విధంగా బాదగలరా?నాగరికులు బాంకు దోపిడీలో పాల్గొంటే, వారు దొరికిన వెంటనే వివరాలు చెపుతారు. చెప్పకున్నా ఈ హింస ఉండదు. కారణం? వెనుక ఏ రాజకీయ నాయకుడో ఉంటాడు. డబ్బు ఖర్చుపెట్టి విడిపించే మార్గాలున్నాయి. చెంచువాళ్ళు అనాగరికులు.వారిని పట్టిబాదుతుంటే,కాళ్లు విరిచేయమని నీతులు చెబుతారేగానీ, 'పాపం' అనే స్థితిలేదు. అందువల్లనే ఆ నిస్సహాయులమీద పోలీసులు తీవ్ర నిర్బంధం కొనసాగిస్తారు. చివరకు విసిగి విసిగి తమగతి ఇంతే అనుకున్నప్పుడు తెగించక తప్పదు. అంటే పరోక్షంగా ఇటువైపుసుండే రెచ్చగొట్టబడుతున్నారన్నమాట.

ఎనిమిదిమందిని బాంకు కేసులో, దేవాలయం కేసులో ఇద్దర్ని,కవులూరు కేసులో ఒకరిని, నాగరాజు పల్లె స్టేషన్ కేసులో ఇద్దరిని పట్టి అందరినీ ప్రత్యేక సెల్లులో పెట్టారు. ఇతర ఖైదీలకూ వీరికీ, సంబంధాలు లేవు.

కొండలలోనున్నవారు తిండికొరకు అడపాదడపా దాడులు సాగిస్తున్నారు.

వాసుదేవరెడ్డిని పాణ్యం పోలీసు స్టేషన్‌కు పిలిపించి శెట్టి కేసు గురించి అడిగారు.

"హాలువద్ద కన్పిస్తే నేను యధాలాపంగా అడిగాను. కావాలంటే ఆ రాత్రి నేను ఎక్కడున్నదీ సాక్ష్యాధారాలు చూపిస్తాను" అన్నాడతడు ధీమాగా.

అతడు చెంచువాడు కాదు బాదడానికి! అతని మీద దెబ్బపడితే ఇన్‌స్పెక్టర్ రాత్రికిరాత్రే స్టేషన్ విడిచిపోవలసి రావచ్చు. అటువంటి రౌడీయిజం వాళ్లు చేయించగలరు. అందువల్ల ఆధారాలు చూపించమని కూడా అడుగకుండా వెనుకకు పంపించి వేశాడు. ఇంటికి వచ్చి శెట్టిని చితకతన్నాడు. డబ్బూ బంగారం పోయి దెబ్బలు కూడా తినవలసి వచ్చి

నందుకు బాధపడ్డాడు శెట్టి. 'పీడిని గురించి పోలీసులకు చెప్పడమే తప్పు' అనుకున్నాడు. ఈ దెబ్బల గురించి మళ్ళీ వెళ్ళి స్టేషన్‌లో చెబితే, ఈసారి ఊచవిడి పిస్తారు. అందువల్ల తిన్న దెబ్బలు చాలు అనుకుని ఆ విషయం నోరెత్తలేదు. పోయిన వస్తువులు వస్తాయని ఆతనికి ఆశ కూడాలేదు.

దేవాలయం తిరిగి పునరుద్ధరించారు. శివలింగాన్ని మంత్రోచ్చారణతో పూజలు చేసి నిలబెట్టారు. దెబ్బతిన్న పూజారినే తిరిగి ఉండవలసిందిగా కోరారు. కూతురు పోయిన దుఃఖంలో అతడు మునిగి ఉన్నాడు. అందువల్ల తాను ఉండ లేనన్నాడు. మరొకరిని ఏర్పాటు చేశారు. అతడు రాత్రికి పల్లెలో ఉండి ఉదయం దేవాలయం వద్దకు వెళ్ళివస్తున్నాడు. ఇంతకు ముందులాగా జనం అక్కడ పడుకోడానికి భయపడుతున్నారు.

పాణ్యం పోలీసుస్టేషన్‌లో రిజర్వ్ దళాలను ఏర్పాటుచేసి ఎప్పటికప్పుడు వార్తలు అందుకోడానికి వైర్‌లెస్ సెట్లు ఏర్పాటు చేశారు.

తిరిగి చెంచువాళ్ళు రెండు లారీలు దోచారు. దాంతో ఇక ఒంటరిగా చీకటి పడ్డ తర్వాత ఘాట్ రోడ్డులో తిప్పడా నికి డ్రైవర్లు ఒప్పుకోవడం లేదు. సర్వీస్ బస్సులు ఏడుగంటల తర్వాత కొండ రోడ్డుమీదకు వెళ్ళకూడదని ఆర్డర్లు జారీ చేశారు. కర్నూలు వైపు నుండి వచ్చే లారీలను సన్నూరు దగ్గర ఆపాలి. పాణ్యం వైపునుండి వచ్చువాహనాలను పాణ్యం వద్ద ఆపాలి. కనీసం ఐదారు లారీలు తోడయిన తర్వాత అన్నీకలసి రోడ్డువెంట వెళ్ళాలనీ, ఒంటరిగా వెళ్ళకూడదనీ పోలీసులు ఉత్తర్వులు జారీ చేశారు. బేతంచర్లనుండి, సిమెంటు నగర్ నుండి వచ్చే లారీలు అవి ఏలోడ్ అయినాసరే ఆరుగంటల తర్వాత కదల కూడదన్నారు. ట్రాఫిక్ ఈ పరిస్థితిలో రాత్రి పూట నిలబడిపోతున్నది. నన్నూరు, పాణ్యం మధ్యనున్న ఇరవై ఎనిమిది మైళ్లదూరం ఏడుగంటల తర్వాత నిర్మా నుష్యంగా ఉంటున్నది. అప్పుడప్పుడు జట్లు జట్లుగా వస్తున్న లారీలు, కార్లు తప్పితే, అంతకు ముందులాగా ఎప్పుడూ ఏదో నడిచే అవకాశం లేకుండా పోయింది. ప్రయాణికులు ఇబ్బంది పాలయ్యారు.

ఇదంతా తమను చక్రబంధంలో ఇరి కించడానికేనని చెంచులు నిర్ణయించు కున్నారు. ఈ చక్రబంధం నుండి బయటపడి తిండి సంపాదించుకోవాలంటే ఎన్నిలారీలు ఏకమై వచ్చినా కొల్ల గొట్టి తీరాలనుకున్నారు.

తిరిగి పద్దెనిమిదో మైలురాయి వద్ద కూడారు. పాణ్యం వైపు ఘాటు రోడ్డు ఆరంభమయిన తర్వాత రెండవ మైలు రాయి అది. అంత దగ్గరలోనే కూడడానికి కారణం కొల్లగొట్టిన తిండిగింజల్లో ఇళ్ళ దగ్గర పడి ఉన్న ముసలివారికీ, పిల్లలకూ కొంత ఇవ్వవచ్చని. దగ్గరలోనే తుమ్మ గూడెం కూడా ఉంది గనక వారికీ కొంత సహకారం అందుతుంది. ఇటు నాగరాజు పల్లె స్టేషన్ ప్రాంతాలకూ ఆహారం అందించవచ్చనుకున్నారు. తెలివితేటలు ఎవరిసొత్తూ కావనడానికి నిదర్శనం వారే! మనుషుల్ని దళాలుగావిభజించారు. లారీల గుంపు వస్తూనే మెరుపు దాడిచేసి ఎన్ని లారీలు వచ్చినా దోచివేయాలనుకున్నారు. ఇంతకు ముందుకంటే వారికి ఇప్పుడు మంచి అవకాశం దొరికింది. ఇంతకు




ముందు ఒక లారీని నిలబెట్టి కొల్లగొట్టా లంటే మరో వాహనం వచ్చే లోపల కొల్లగొట్టుకు పోవాలి. లేదా వెనుక నుండో ముందునుండో వాహనాలు వస్తూ ఉంటాయి. ఇప్పుడు అట్లాకాదు. ఐదారు లారీలు కలసికట్టుగా వస్తాయి. వాటి నన్నింటినీగంటసేపు వరకూ నిలువు దోపిడీ చేయొచ్చు. ఈలోగా వాహనాలు రావు. అంతవ్యవధి ఉండటం వారికే లాభించింది.

పద్దెనిమిదో మైలురాయివద్ద కూర్చున్న వారు తమతమ భార్యా పిల్లల్నిగురించి చర్చించుకుంటున్నారు. కొందరు భార్యలతోసహా అక్కడే ఉన్నా పిల్లలు ఇళ్లవద్ద పడిఉన్నారు. వారిని తలుచుకొని ఆడవారు దుఃఖపడుతున్నారు.

దూరంగా లైట్లు కన్పించడంతో కొందరులేచి, రాళ్లుఅడ్డువేశారు రోడ్డుమీద! అదిటర్నింగ్ ప్రాంతంకావడంవల్ల టర్నింగ్ వరకూ వస్తేగానీ రాళ్ళు కనిపించవు. మొత్తం ఏడులారీలు.ఒకదానివెంట ఒకటి నిలిచాయి. వానరసేనలా జనం డ్రైవర్ల మీద ఎగబడ్డారు. కొందరు డ్రైవర్లను లాగి కొడుతుంటే,కొందరు బస్తాలు దించి తీసుకెళ్తున్నారు. అంతమంది జనం ఉన్నా ఒక్కని నోటినుండికూడా మాట రావడం లేదు. క్రమశిక్షణతో ఎవరి పని వాళ్ళు చేసుకుపోతున్నారు. ఏడు లారీల్లో ఒకటి మాత్రమే బియ్యపులారీ! ఒకటి జొన్నల లారీ! ఒకటి సజ్జలు, రాగులు కలిపిన లారీ! ఒకటి తమలపాకుల లారీ! ఒకటి నిమ్మపండ్ల లారీ! ఒకటి రసాయనిక మందుల లారీ! ఒకటి ట్రాన్స్‌పోర్ట్ లారీ! మూడు ధాన్యపు లారీలనుండి సరుకులు దించి మోశారు. తిరిగి గోతాలుతెచ్చి నిమ్మపండ్లు గోతాలకు ఎత్తి మోసుకున్నారు. ట్రాన్స్‌పోర్ట్ లారీలోని పెట్టెలు పగులగొట్టి గుడ్డలు, తమకు అవసరమైన వస్తువులు తీసుకున్నారు. మిగిలినవాటి జోలికి పోలేదు. ఆఖు సమస్త కొందరు తమలపాకుల లారీనుండి రెండు బుట్టలు దించుకున్నారు. డ్రైవర్లను కట్టివేసి, తమ తోవన తాము వెళ్ళారు.

ఎదురుగా కర్నూలు వైపునుండి లారీల సమూహం వచ్చింది. నిలబడిన లారీలను దూరంనుండే వాళ్ళు చూశారు. రావడానికి ధైర్యం చాలడం లేదు. లైట్లు ఆర్పుతూ వేస్తూ సిగ్నల్స్ ఇచ్చారు. ఇటు వైపునుండి ఆ సిగ్నల్స్‌కు జవాబులేదు. ఆవిధంగా ఉండటంతో ధైర్యంగా ముందుకు రావడానికి వారికి దమ్ములేక రెండు ఫర్లాంగుల దూరంలోనే లారీలునిలిపి వేశారు. తిరిగి వాటిమీద మరొకదండు వచ్చిపడింది. అవి ఆరు లారీలు. అందులో తిండిగింజలు నాలుగు లారీలు, మిగిలిన వాటిలో ఒకటి ఇనుప సామాను, ఒకటి సిమెంటు. నాలుగు లారీలు నిలువునా దోచివేయబడ్డాయి.

ఆతర్వాత వచ్చిన లారీలు అటువైపు నుండి అటే నిలబడ్డాయి. ఇటువైపు నుండి ఇటే నిలబడ్డాయి. ముందుకు పోవడానికి, వెనుకకు రావడానికి ధైర్యం చాలక ఎక్కడివారక్కడ ప్రాణ భయంతో నిలిచిపోయారు. రాత్రంతా కొల్లగొట్టినా వాళ్లను పట్టించుకునేవాళ్లు లేరు. అయినా రెండుసార్లు మాత్రమే దాడిచేసి వెళ్లిపో యారు. వెంటనే పోలీసులు వస్తారనేభయం ఉంది. అందువల్లనే మెరుపు వేగంతో దాడి జరిపి వెళ్లిపోయారు. తెల్లవారిన తర్వాత లారీలవాళ్లు ఒకరినొకరు పలుకరించుకున్నారు. ఆ సమయానికి అటూ ఇటూ చాలా దూరంవరకు లారీలు, వాహ



నాలు నిలబడ్డాయి!

వార్త తెలిసి పోలీసులు హుటాహుటిన పరుగెత్తుకొచ్చారు. నిలబడ్డ లారీలకు సైడు ఇచ్చి పంపే ఏర్పాటు చేశారు. కొల్లగొట్టబడ్డ తొమ్మిది లారీలను సైడుకు తీసి నిలబెట్టారు. డ్రైవర్లను హాస్పిటల్స్‌కు తరలించారు. రాత్రంతా కట్టివేయబడటంతో తాళ్లు బిగుసుకుపోయి డ్రైవర్లు, క్లీనర్లు పక్షవాత రోగుల్లా తయారయ్యారు. లారీలలో డ్రైవర్లు, క్లీనర్లు తప్ప ఇప్పుడు పాసింజర్స్ ప్రయాణం చేయడంలేదు రాత్రిళ్ళు.

కర్నూలు నుండి డి. ఐ. జి. వచ్చాడు. ఆఫీసర్లందరూ ఆ ప్రాంతం చేరారు. గింజలు పడ్డ వైపుగా పోవడానికి నిర్ణయించుకుని వెతకడానికి ప్రయత్నించారు. కానీ చుట్టూ మైలుదూరం వరకూ అన్ని వైపులా గింజలు పడి ఉన్నాయి. పైగా పోలీసులు సంసిద్ధంగా లేరు. ఎదురుదాడి ఆరంభమయితే దెబ్బతింటామని ఆఫీసర్లు ఆలోచించారు. విల్లంబుల వేటలో వాళ్ళకు మంచి అనుభవం ఉంది. తుపాకికంటే అవే ఎక్కువ దెబ్బతీస్తాయి. ఏ బండచాటునుండో, చెట్టు చివర్న నిలబడో కొట్టడంలో నేర్పరులు. వారు ఏ వైపు ఉన్నదీ తెలియకుండా వెతకడమే తప్పు. నిర్ధారణగా ఫలానా కొండమీద ఉన్నట్లు తెలిసినప్పుడే దాడి చేయడానికి అవకాశముంటుంది. అదీగాక వారి బలం ఎంతో తెలియడంలేదు. కొద్దిమందా, ఎక్కువమందా అనే నిర్ణయం జరగాలి. రాత్రిగందరగోళంలో ఎందరు మీదపడ్డది కూడా డ్రైవర్లు చెప్పలేకపోతున్నారు. అందువల్ల ముందుకుపోవడం సాధ్యం కాదని ఆఫీసర్లు వెనుకకు వచ్చారు. డ్రైవింగ్ తెలిసిన కానిస్టేబుల్స్‌ను లారీలు తీసుకురమ్మని చెప్పి పాణ్యం స్టేషనుకు వచ్చారు. ఆ పాటికే అక్కడి బస్సు సెంటరు జనంతో కిక్కిరిసి ఉంది. ఎక్కడ చూసినా అవే వార్తలు. 'చెంచువాళ్లు, సుగాలీలు తిరిగి రెచ్చిపోయారు. తిరుగబడ్డారు. ఊళ్ళమీద పడి చంపుతారట, దోపిడీలు చేస్తారట' అని చెప్పుకుంటున్నారు. వాళ్ళలో ఎవరికీ నిజం తెలియదు. ఎవరో ఒకరు ఏదో అంటే మిగిలినవాళ్ళు అదే మాట్లాడటం అలవాటు. పొరపాటున ఎవరయినా హేళనగా 'ఇదుగో చెంచువాళ్ళు వచ్చారు' అంటే పారిపోయే స్థితిలో జనం ఉన్నారు.

ఈలోగా ఒకడు వచ్చి సుగాలిగూడెం లోనికి, చెంచుగూడెంలోనికి గింజలు వచ్చాయని చెప్పాడు. తిరిగి వేన్లు పరుగెత్తాయి. వచ్చేటప్పుడు ఆ విషయం గురించి పట్టించుకోలేదు. రెండు గూడేలలో పడ్డారు పోలీసులు. చాలా బస్తాల ధాన్యం దొరికింది. ఆ ఇళ్ళలో పెద్దలెవరూ లేరు. అందరూ చిన్నపిల్లలు, ఒక్కొ ఇంటిలో ముసలి స్త్రీయో, పురుషుడో ఉన్నారు. నడిచే ఓపిక కూడా లేనివాళ్ళు వెళ్ళి దోపిడీలుచేసి తెచ్చారన్నా ఎవరూ నమ్మరు. అందువల్ల ఆపిల్లల జోలికి, ముదుసలుల జోలికి పోలీసులు వెళ్ళలేదు. ఎక్కడనుండి వచ్చాయని వివరాలడిగారు. 'మావాళ్ళు తెచ్చి వేశారని' వాళ్ళు చెప్పారు.! ఆ గింజలన్నీ వేన్లలో వేశారు. వేన్లు తిరిగి పాణ్యం వచ్చాయి. సరుకంతా స్టేషన్‌లో చేర్చారు. వేన్లు కడుగమని ఇద్దరు పోలీసులకు పురమాయించారు. ఆ ఇద్దరు పోలీసులు చెరువు వద్దకు వేన్లు తెచ్చి, చెరువు గట్టున ఆడుకుంటున్న పిల్లల్ని బెదరించి, వేన్లు వారిచేత చక్కగా కడిగించారు.




ఆఫీసర్లందరూ సమావేశమయ్యారు.

"ఈవిధంగా చూస్తూ ఉండటం సాధ్యంగాదు. దాడి ఆరంభించడం మంచిది" అన్నాడు యస్. పి.

చాలామంది అతన్ని బలపరచారు.

"దాడివల్ల లాభం ఉంటుందనుకోను. కొందరిని చంపవచ్చు. అంతమాత్రం చేత ఈ రావణ కాష్టం అణిగిపోతుందనుకోను. చెంచువాళ్ళే ఈ విధంగా తయారయ్యారా, లేక వీరి వెనుక ఎవరన్నా ఉన్నారా అనేది ముందు తెలుసుకోవాలి. చెంచువాళ్ళే ఇవి చేస్తున్నారన్నప్పుడు అణచడం తేలిక. అట్లాగాక వెనుక ఎవరన్నా ఉన్నప్పుడు మన ప్రయత్నాలు కూడా అందుకనుగుణంగానే మలచుకోవాలి. చెంచువాళ్ళు ఇంత దౌర్జన్యం జరపడానికి పోలీసుల దురుసుతనంకూడా కారణమని కొన్ని పత్రికలు గోల చేస్తున్నాయి. ఆధారంలేకుండా, అనుమానంపై వారిమీద దాడిచేసి, కొండలలోకి తరుమడంతో ఆకలికి తట్టుకోలేక వారు దాడి చేశారంటున్నారు. కొందరిని లాకప్



లలో పెట్టి బాధించడం కూడా చూపిస్తున్నారు. ఎవరో ఏదో అన్నారని మనం ఉలిక్కిపడే పనిలేదు. కానీ ఏది చేయదలచినా పూర్తిగా ఆలోచించడం ముఖ్యం. వెంటనే సి.ఐ.డి.ఇన్ఫర్మేషన్ లాగండి. పోతే అంతవరకూ వాహనాలకు రక్షణ కల్పిస్తూ పోలీసు వేన్లతో తిరగండి. రాత్రి ఆరుగంటల తర్వాత ఘాట్‌రోడ్డు మీద బండ్లు తిరుగకూడదు. పగలు ప్రతి గంటకూ ఒక జట్టు చొప్పున అటునుండి ఇటునుండి బండ్లు కదలాలి. ప్రతి జట్టుకు ముందు పోలీసు వేను, వెనుక పోలీసు జీపు ఉండాలి. సాయుధులైన జవాన్లతో కొంతకాలం నడుపుదాం. ఇంకా కొంత ఇన్ఫర్మేషన్ సేకరించిన తర్వాత దాడి ఏవిధంగా చేయవలసిందీ, కొండలనుండి వారిని ఎలాబయటకులాగవలసిందీ ఆలోచిద్దాం" అన్నాడు డి. ఐ.జి.

ఆయన చెప్పేవాటిలో చాలా అభ్యంతరాలున్నా, వ్యతిరేకించేందుకు ఎవరూ సిద్ధంగా లేరు. అంత పెద్ద ఆఫీసరును వ్యతిరేకించి మాట్లాడితే అతనితో అనేక బాధలు. అందువల్లే ఎవరూ నోరెత్తలేదు. అదే ప్రకారం చేద్దామన్నాడు యస్. పి.

"లాకప్‌లో ఉన్నవారిని ఏం చేద్దామంటారు?" అన్నాడు యస్. పి. తిరిగి.

"ఉండనివ్వండి. వాళ్ళకు వెనుక ఎవరూ లేనట్లే తోస్తున్నది. లేకపోతే కోర్టుకుహాజరుపరచమని హైకోర్టు వరకూ వెళ్ళేవారే! వాళ్ళలా పడి ఉంటే మనకూ మంచిదే. కేసు ఎవరో ఒకరిమీద మోపాలి కదా! పైగా ఇంతవరకూ వస్తువులు దొరకలేదు. అవి లేకుండా కోర్టులో నేరం ఆరోపించడం సాధ్యం కాదు. ఇంకా కొద్ది రోజులు పెడితే వస్తువులు చూపిస్తారేమో?" అన్నాడు డి.ఐ.జి.

"నాకు ఒక అనుమానం సార్?" అన్నాడు ఏ.యస్ పి.

అందరూ అతనివైపు తలలు తిప్పి చూశారు.

"ఇంత బాధపెట్టినా వాళ్ళు చెప్పడం లేదంటే, నిజంగా తెలియదని కూడా మనం భావించవలసి ఉంటుంది కదా?"

"ఎట్లా భావిస్తాము?కొందరు దొంగలు తొందరగా నిజం ఒప్పుకోరు. అయినంత మాత్రాన చేయలేదని మనం భావించలేము. చివరి నిముషం వరకూ మనం లాగడానికే ప్రయత్నించాలి" అన్నాడు డి.యస్.పి.

"ఏమో! ఎలా చెప్పగలం? వారిని పెడుతున్న బాధకు వారు రేపు నిరపరాధులని తేలితే?"

డి.ఐ.జి. నవ్వాడు "ఆఖరి నిముషం వరకూ నేరం మోపటానికే ప్రయత్నించాలి. ఇంతవరకూ ఎన్ని విధాల ప్రయత్నించినా ఈ దోపిడీల గురించి వార్తలు బయటపడలేదు. వీరి మీదనే అనుమానం కేంద్రీకృతమవుతున్నది. అందువల్ల వారి నుండి కూపీలాగడానికే ప్రయత్నించాలి."

అందరూ లేచారు. కర్నూలు నుండి రిజర్వ్‌దళాలను తెచ్చి పాణ్యం బస్ సెంటర్‌లో నిలిపారు. వచ్చేపోయే వాహనాల వెంట తిరగడానికి అటువైపు ఆరు, ఇటువైపు ఆరు వాహనలు సిద్ధంగా ఉంచారు. బస్సులకు టైమింగ్స్ లేదు. పోలీసుల దయాదాక్షిణ్యాల ననుసరించి బస్సులు కదలాలి. దగ్గరి ప్రయాణికులు ప్రయాణం మానుకున్నారు. సౌకర్యం ఉన్న వాళ్లు రైలుకు వెళుతున్నారు.




తప్పని సరయిన వాళ్లు విధిలేక బస్సుల్లో కూలబడి కదిలే సమయం కొరకు ఎదురు చూస్తున్నారు. ఘాట్ రోడ్డు ఎక్కిన తరువాతనయినా గమ్యస్థానం చేరే వరకూ గుండెలు పీకుతూనే ఉన్నాయి జనానికి!




నంద్యాలకు ఖైదీలను మార్చి పదిహేను రోజులయింది. తగిలిన గాయాలు కూడా మానాయి. వీరమ్మ బుగ్గల మీద కూడా గాయాలు మానాయి. ముందు పరిస్థితి గురించి ఆలోచిస్తున్నారు. ఏండ్ల తరబడి లాకప్‌లలోనే మగ్గవలసి ఉంటుందేమోనని వారి భయం. బయట పరిస్థితులు తెలియడం లేదు. తప్పించుకొనే దారి గురించి ఆలోచిస్తున్నారు.

మొదటి లాకప్ వెనుకగోడను ఆనుకొని ఉంది. రెండవ లాకప్ దాన్ని ఆనుకొని రైటర్ రూం మధ్య ఉంది. ఎదురుగా విశాలమైన హాలు. హాలు దాటి తలుపు దగ్గరకు చేరితే బయటపడవచ్చు. బయట ప్రహరీ. దానికి తలుపు. ఆ తలుపు దాటితే స్వేచ్ఛ.

అందరిలోకి చాకచక్యం, బలంగల పోలయ్య ఏవిధంగా బయట పడటమా అని ఆలోచిస్తున్నాడు. కనీసం కొందరయినా తప్పుకోవాల్సి.కడ్డీలు చాల బలంగా ఉన్నాయి. వంచడానికి ఒకటిరెండు సార్లు ప్రయత్నం చేశాడు. బలంగా వంచితే పైకిలేవడానికి అవకాశముంది. ఒక కడ్డీ వంచగలిగితే, కొంతకష్టంతోనయినా బయటపడవచ్చు. కింద వెల్డింగ్ ఊడిపోయిన మూడు కడ్డీలను గుర్తు పెట్టుకున్నాడు. మూడింటిలో చీకటి ప్రాంతం వైపు ఉన్నదాన్ని ఎంచుకున్నాడు. ఎదురుగా మందుగుండు సామాను రూం ఉంది. ఒక్కొక్కరే దూరి ఆ రూం క్రీనీడలో పోలీసుకు కన్పించకుండా నిలబడి పారిపోవడానికి ఎదురు చూడవచ్చు. బయట ప్రశాంత పరిస్థితి ఉంటే పారిపోవడంఅసాధ్యం. రాత్రింబవళ్లూ పోలీసులు, బీట్ కానిస్టేబుల్స్ వస్తూ పోతూ ఉంటారు. వర్షం రోజు అయితే పెద్దగా ఉండరు. ఉన్నవారు కూడా చలికి వణకుతూ నిర్లక్ష్యంగాఉంటారు. అటువంటి అవకాశం కొరకు ఎదురు చూస్తున్నారు.

ఆ రోజు సాయంత్రం ఐదు గంటల నుండే వర్షం ఆరంభమయింది. వర్షానికి తోడు ఈదురు గాలులు. తుఫాను వస్తున్నట్లు వార్తలు. అంత మంచి సమయం ఇక దొరకదని పోలయ్య ఆలోచించాడు. అందరినీ హెచ్చరించాడు రాత్రికి సిద్ధంగా ఉండమని.

పది గంటలు దాటింది. ఆ పాటికే స్టేషను నిర్మానుష్యంగా ఉంది. సెంట్రీ ఒక్కడూ లోపలకు బయటకు తిరుగుతున్నాడు. ముసలి సెంట్రీ, చెవులచుట్టూ తువ్వాలు చుట్టుకుని రెయిన్ కోటు వేశాడు. అయినా చలికి వణకుతూ తిరుగుతున్నాడు. మొదటి లాకప్‌లోని ఖైదీలు హాయిగా నిద్రపోతున్నారు. వాళ్ళకు ఏ దిగులూ, చింతా ఉన్నట్లు లేదు.

సమయం గడిచిపోతున్నది. కడ్డీ

ఒకటి పైకి వంచాడు. అర్ధగజం ఎత్తు లేచింది ఆ కడ్డీ! కానిస్టేబుల్‌నే చూస్తున్నారు. అతను రాకుండా కూర్చుంటే ఒక్కొక్కరే తప్పుకోవచ్చు.

ఒంటిగంట కొట్టారు. కానిస్టేబుల్‌కు చలి ఎక్కువయినట్లుంది–నిండా దుప్పటి కప్పుకున్నాడు. మరో అర్ధగంటలో ఆ కానిస్టేబుల్ మారిపోతాడు. కొత్తగా వచ్చేవాడు మెలకువగా ఉండవచ్చు. లాకప్ చెక్ చేయడానికి రావచ్చు. అప్పుడు వంచిన కడ్డీ బయటపడిపోతుంది. ఈ కానిస్టేబుల్ ఉండగానే దాటుకోవాలి. కానిస్టేబుల్ తనకున్నది అర్ధగంటే గనుక బయట వసారాలో కూర్చున్నాడు.

ముందు పోలయ్య దాటుకున్నాడు. ఆ తర్వాత హనుమంతు వచ్చాడు. తర్వాత వీరమ్మ వచ్చింది. ఒక్కొక్కరే బయటకు రావడం, వచ్చిన వారు వచ్చినట్లే ఆయుధాల రూం క్రీనీడలోకి వెళ్ళడం చేస్తున్నారు. ఈడ్చి కొడుతున్న చలిలో వసారాలో ముడుచుకుని కూర్చున్నాడు



కానిస్టేబుల్. మొత్తం పదిహేను మంది. అందరూ బయటకు వచ్చిన తరువాత పోలయ్య, హనుమంతు, వీరన్న చప్పుడు చేయకుండా ముందుకురికి కానిస్టేబుల్ మీదపడి నోరు మూశారు. మిగిలిన అందరూ పరుగెత్తుతూవచ్చి, అతని కాళ్ళు చేతులు అతడి టవల్‌తోనే కట్టి నోటిలో గుడ్డ కుక్కారు. అతడు అరవ డానికి అవకాశం లేదు. పక్కన మరిఇద్దరు కానిస్టేబుల్స్ ముసుగుతన్నిచలికి హాయిగా నిద్రపోతున్నారు. ఇతని తరువాత డ్యూటీ చేయవలసిన కానిస్టేబుల్ కూడా వారిలోనే ఉన్నాడు. అందరూ బయటకు పరుగెత్తారు.

ఒంటిగంట ప్రాంతం. జనసంచారం లేదు. ఒకరిద్దరు వీరిని చూసినా ఎవరో ననుకున్నారు. వీళ్ళు చకచకా వెళ్ళుతూ ఉండటం మూలపేటనుండి వస్తున్న బీటు కానిస్టేబుల్ చూశాడు. దూరం కావడం వల్ల ఎవరయినదీ గుర్తుపట్టలేదు. అయితే వీపున చొక్కాగూడా లేకుండా ఈ వర్షంలో ఎవరు పరుగెత్తుకువస్తారా అని ఆలోచిస్తూనే ఎదురువచ్చాడు. వీరినిచూసి అతడి గుండెలు పగిలిపోయాయి. ఆ సమ యంలో ఎదురుగా ఉంటే చంపనయినా చంపగలరని పక్కనున్న సందులోకి దూరాడు. వర్షంలో తడుస్తూ కానిస్టే బుల్‌ను వాళ్ళు చూడలేదు. ఎంత తొంద రగా టౌను విడిచి వెళ్లడమా అనుకుంటూ అదేధ్యాసలోపోతున్నారు. వారినిముందుకు పోనిచ్చి బీటుకానిస్టేబుల్ విజిల్ వేస్తూ స్టేషన్‌వైపు పరుగెత్తడం ఆరంభించాడు.

పరిస్థితి అర్థమయింది. మళ్లీ దొరికితే చంపి పూడ్చిపెడతారని వారికి తెలుసు. భీమవరం బ్రిడ్జివైపు పరుగెత్తడం ఆరం భించారు. గుడ్డలుతడిసి చీర కాళ్లకు అంటు కుని కాళ్లు ముందుకు పడటంలేదు. చీరలు పైకెత్తి పరుగెత్తడం ఆరంభించారు.

నిముషాలలో పోలీస్‌స్టేషన్‌లో పోలీ సులు కూడారు. వెంటనే ఇన్‌స్పెక్టరుకు, డి.యస్. పి. కి ఫోన్‌చేసి చెప్పారు. వారు వస్తూనే చుట్టూ అన్నిస్టేషన్‌లకూ హెచ్చ రికలు చేశారు. పోవడానికి వేను ఉంది కానీ, ఏదారిన వెళ్లాలో తెలియడం లేదు. కానిస్టేబుల్ ఇచ్చిన సమాచారం ప్రకారం భీమవరం బ్రిడ్జి దాటితే, పోలూరు మీదుగా కొండల్లో పడతారు. భయంకరమైన ఈ తుఫానులో వారి వెంటబడటం సాధ్యం కాదు. ప్రాణాలకు తెగించేవాళ్లు వారు. జీతంరాళ్ళకోసం ఉద్యోగం చేసేవాళ్లు వీళ్లు. వారిలాగా ఈ ఈదురుగాలి చలిలో వెంటబడితే వాళ్లు దొరకకపోగా, అలవాటు లేని ఈదురుగాలిలో ప్రాణాలు పోతాయి.

ఆ సమయంలో అంతకుమించి చేసే దేమీలేదని నిర్ణయించుకున్నారు. వాళ్లు ఇక ఎలాగూ దొరకరు. మంచి సమయంచూసి వాళ్లు ప్రయత్నాలు చేశారు. ఫలితం వారికే అనుకూలంగా ఉంది. ప్రాణ్యంనుండి కొండమీదుగా పోలీసులు చుట్టుకోవచ్చు. అయితే వాళ్లుమాత్రం ఈ చలిలో ఎక్కడికి వెళ్తారు? పైగా ఏ వైపునుండి వీళ్ళు కొండలో ప్రవేశిస్తారు? కాళ్ళకు చెప్పులు కూడా లేకుండా బురదలో దూకి పరుగెత్తే వారితోపాటు, యూనిఫాం, బూట్లు వేసు కుని పరుగెత్తడం ఈ బురదలో ఎలాగూ సాధ్యంకాదు.

యస్. పి.కి, డి. ఐ. జి. కి., ఐజి. కి ఫోన్లు చేశారు. కానిస్టేబుల్‌ను అక్కడి కక్కడే సస్పెండ్ చేశారు. అందరికోపం అతనిమీద తిట్లరూపంలో చూపించారు. ముసలి కానిస్టేబుల్ ఏడుస్తూ ఎవరికీ జవాబివ్వలేక పోయాడు.



చీకటి ఉండగానే కొండమూరు వద్ద కొండపైకి చేరారు చెంచులు. చేరుతూనే అనుమాన నివృత్తి కొరకు అంతటా తేరి పారచూశారు. పోలీసుల జాడ లేదు. ఈదురు గాలి వీస్తూ వర్షం పడుతూ ఉంది. చీకటిగా ఉంది వాతావరణం. ఆ సమయంలో ఎవరూ రాలేరని తెలుసు. అయినా అనుమానం.

లోయగుండా చాలాదూరం వెళ్ళారు. లోయలోని వాగు ప్రవాహంగా వస్తున్నది. వాగుఒడ్డున పడిపోనుమంది సాగారు.

అంతవరకూ చలికి గుహలో పడుకున్న జనం అలికిడికిలేచి, వీరినిచూసి కౌగలించుకున్నారు ఏడుస్తూ. ఏవిధంగా వచ్చిందీ చెప్పారు వారు. వండుకున్న అన్నంలో రాత్రి మిగిలినది వారికి పెట్టారు.

"మనం ఇంతేనా? ఇంక గూడేల్లోకి పోలేమా?" అన్నాడు పోలయ్య.

"ఇంకేం పోతాం! ఎప్పుడూ మనల్ని వెంట తరుముతున్నారు. రేపటి నుండీ మరింత మంటతో మీదకు వస్తారు. మీరు తప్పించుక వచ్చారు. ఆ కోపం వారికి ఉంటుంది!" అన్నాడు తుమ్మగూడెం పెద్దనాగడు.

"ఒరేయ్! అటో ఇటో తేలుద్దాంరా! ఇంకా ఎందుకు చీకట్లో గుద్దులాట! చావడమో, బతకడమో తేలిపోవాలి. వాళ్ళు మనల్ని మర్యాదగా కాపురాలు చేయనివ్వరు. చీటికి మాటికి మనమీద దాడి చేస్తూ, పట్టుకువెళ్ళి గొడ్లను బాదినట్లు బాదితే ఎన్నాళ్ళని పడిఉండాలి.లోకంలో ఎవడు తప్పుచేసినా దానికి మనమే బాధ్యులమంటే ఎందుకు ఒప్పుకోవాలి? మంచితనం ఇక పనికిరాదు" అన్నాడు పెద్ద వీరిగాడు. లాకప్‌లో తిన్న దెబ్బలు ఇప్పటికీ గురుకు వస్తున్నాయి.

అందరూ తలలూపారు. ఈదురుగాలి తగ్గడంలేదు. గుహలో అందరూ వెచ్చగా పడుకున్నారు. వాగు బుస కొడుతూ లోయ వంపులుసాగినట్లే వంపులు తిరుగుతూ పోతున్నది. ఈ సమయంలో పోలీసులే కాదు ఎవడూ రాడనే ధైర్యం వారికి ఉంది. అందువల్ల నిశ్చింతగా ఉన్నారు.

* * *

బంగారు వస్తువులు అమ్ముతూ ఉన్న ఒకవ్యక్తిని అనుమానం మీద పోలీసులు పట్టుకున్నారు. అమ్ముతున్న వ్యక్తిమీద అనుమానం కలిగిన వెంటనే అతన్ని కొట్లోనే కూర్చోపెట్టి కొట్టు యజమాని బయటకు వెళ్ళి పోలీసులకు ఫోన్‌చేశాడు. పోలీసులు వచ్చి పట్టుకుని తీసుకెళ్ళారు. ఆ వస్తువులు కవలూరు శెట్టికి సంబంధించిన వని తెలుసుకున్నారు. వెంటనే ఫోన్ చేయగా పాణ్యం పోలీసులు వచ్చి అతన్ని తీసుకెళ్లారు.

అతన్ని ఇంటరాగేషన్ చేయడంతో అనేక విషయాలు బయటపడ్డాయి. యస్.పి. స్వయంగా వచ్చి దొరికిన వ్యక్తిని చూశాడు.

"ఏం పేరురా నీది?"

"మంకన్న అంటారు బాబూ!" అన్నాడు చేతులు జోడించి.

"ఏంటోనివి?"

"బోయవాళ్లం బాబూ!"

"ఏ ఊరు?"

"పాణ్యమే!"

"శెట్టి వస్తువులు దొంగిలించిన వారిలో నీవు ఒకడివా?"





"లేదు బాబూ! నాగులు డబ్బు బాకీ ఉన్నాడు. డబ్బు ఇవ్వమంటే డబ్బు లేదనీ, ఈ వస్తువు అమ్ముకొని తెచ్చుకొమ్మనీ చెప్పాడు. అది దొంగ వస్తువని నాకు తెలియదు."

"వాడెక్కడున్నాడు?"

"ఈ ఊరే సార్! మా బంధువే! ఇంటివద్దే ఉంటాడు" అంటూ వివరాలు ఇచ్చాడు.

పోలీసులను పంపించారు నాగులు కొరకు. అప్పటికి కడుపునిండా సారా తాగి,నిషాతో హాయిగా పడుకునున్నాడు. మత్తులో ఉన్న నాగుల్ని తట్టి లేపారు పోలీసులు. కళ్లు సగం మూసి తెరచి "ఎవర్రా వాడు? ఏంపని నాతో! పో! రాను!'' అన్నాడు కసురుకుంటూ. లాగి కూర్చోబెట్టారు ఇద్దరు పోలీసులు.

"రేయ్ కొడకా! కండ్లు తెరచి మాట్లాడరా! మేం పోలీసులం. దొరగారు నిన్ను రమ్మంటున్నారు" అన్నారు తల పైకెత్తి తమ వైపు తిప్పుకుంటూ.

''వాడెవడు దొర మధ్యన? వాడితో నాకు పనిలేదు లేవయ్యా బాబూ!సారాయి తాగుతారా? మాకమ్మని ఊట సారాయి. మీ గవర్నమెంటు సారాయి కాదయ్యోవ్ బాబూ! ఇది మేము ఊటవేసి వండిన సారాయి. భలేరుచిగా ఉంది. దొరగాడి నోట్లోకూడా పోయండి కొంత!" వెకిలిగా నవ్వుతున్నాడు మత్తులో.

పోలీసులకు మండుతున్నది నాగుల్ని చూస్తుంటే. వాడు అనేక దొంగతనాలలో, దొంగ సారా బట్టీలలో పేరుమోసినవాడు. ఈరోజు తీసుకెళ్లి స్టేషన్‌లో మూస్తారు. రేపు పెద్దమనుషులు వచ్చి విడిపిస్తారు. ఆతర్వాత తమను వీడు బజారులో పెట్టి తన్నినా అడిగే దిక్కుండదు. ఈ వివరాలన్నీ ఇన్‌స్పెక్టరుకుతెలుసు.అందుకేతాను కలుగచేసుకోకుండా ఉండడానికి యస్.పి. కి, ఫోన్ చేశాడు. ఆయన బాధ్యత మీదే వీళ్ళు వచ్చారు.అది తెలీక మామూలు పద్ధతిలో జవాబిస్తున్నాడు నాగులు.

చెరో రెక్క పట్టుకున్నారు. "రారా నాయనా! దొరగారు నీకొరకు వచ్చారు. ఈరోజు బడిత పూజ తప్పదురా'' అంటూ ఈడ్చుకపోవడం ఆరంభించారు. జనం తమాషాగా చూస్తూ నిలబడ్డారు. నాగులు విదిలించి ''పో పోరా! మీ దొరకు చెప్పుకోండి నేను రానని! కావాలంటే అతగాడినే రమ్మను" అంటూ ఇంట్లోకి దూరాడు.

చేసేదిలేక ఒక కానిస్టేబుల్‌ను పోలీస్ స్టేషన్‌కు పంపి, ఇంకో కానిస్టేబుల్ ఇంటిబయట కాపలా ఉన్నాడు. భార్య వచ్చి మంకన్నను స్టేషన్‌కు తెచ్చారని నాగులుతో గుసగుసలాడింది. నాగులుకు కైపు దిగిపోతున్నది. ఇంట్లో నుండి లేచి, చెంబుచేత పట్టుకొని ఊరు వెలుపలకి సాగాడు. పోలీసు విడవకుండా వెంట బడ్డాడు.

''ఏందయ్యా నీసోది! నన్ను దొడ్డికి కూడా పోనిస్తావా లేదా?" అన్నాడు విసుక్కుంటూ నాగులు.

"ఒరే నాయనా! నీవు దొడ్డికి పోతే నేను ఇంటికి పోవలసి వస్తుందిరా! మాబాబువి కదూ! స్టేషన్ దాకా రారా" అన్నాడు బతిమాలుతూ కానిస్టేబుల్.ఊరు చివరిదాకా రానిచ్చాడు. మాట్లాడుతూ మాట్లాడుతూనే చెంబుతో తలమీద బాది పరుగు లంకించుకున్నాడు. తల బొప్పి కట్టినా లెక్కచేయకుండా నాగులు వెంట పరుగు లంకించుకున్నాడు కానిస్టేబుల్. రేసుగుర్రాల్లా పరుగెత్తుతున్న

ఇద్దరినీ చూస్తున్నారు పొలాల్లోని జనం.
అపాటికి మరికొంతమంది పోలీసులతో యస్. ఐ. వచ్చాడు. వీరు పరుగెత్తడం చూసి అందరూ పరుగు ఆరంభించారు. ఎటు వెళ్ళడానికి దిక్కుతోచక చిన్న చెరువునీళ్ళల్లో పడ్డాడు నాగులు. పోలీసులు చుట్టూ కమ్ముకున్నారు. బయటికి రమ్మని యస్.ఐ. పిలుస్తున్నా నాగులు రావడంలేదు. చివరకు విధిలేక గుడ్డలు విప్పి పోలీసులూ నీళ్ళలో దూకక తప్పిందికాదు. గంటసేపు అటు ఇటు తిప్పి చివరకు నీళ్ళల్లోనే దొరికాడు. జుట్టు పట్టుకొని ఒడ్డుకు ఈడ్చుకు వచ్చారు. అంతవరకూ విసిగించినందుకు మండి పడుతూ కాలితో తన్నాడు యస్.ఐ. అక్కడినుండి ఈడ్చుకుంటూ స్టేషన్‌కు తెచ్చారు.
స్టేషన్‌లో పోలీసులు తమ కక్షనంతా తీర్చుకోడానికి కిందపడవేసి బాది పారే శారు. పరుగెత్తి పరుగెత్తి వాళ్లకు విసుగెత్తిపోయింది.

"తప్పించుకొని ఎక్కడికి పోతావురా కొడకా! చెప్పు! దొంగతనం చేసింది ఎవ రెవరో?" అన్నాడు ఇన్‌స్పెక్టర్ కాలితో తన్నుతూ.
నాగులు పలుకలేదు. రెండు కాళ్ళకూ, చేతులకూ మధ్య కొయ్యదూర్చి పైన దూలానికి వేళ్లాడదీయడానికి సిద్ధపడ టంతో "చెబుతాను" అన్నాడు. దూలం పైకి వెళ్తే ఎముకలు చిట్లిపోతాయని నాగులుకు అనుభవమే! ఆ ప్రయోగాన్నే కోలుకొంకరాయి అని కొందరూ, గుది రాయి అని కొందరూ పలుకుతారు. పైకి లాగి వేలాడదీస్తే నరాలన్నీ సాగి బాధ పెడతాయి. తలకిందులు కావడంతో పేవులు నోటిలోనికి రావచ్చు. చచ్చి పోయే అవకాశముంటుంది. గతంలో నాగులుకు అది అనుభవం ఉండటం వల్లే దూలానికి వేలాడబడి చచ్చేదానికంటే చెప్పడం మేలనుకున్నాడు.
మొత్తం పన్నెండుమంది పేర్లు తనతో కలిపి చెప్పాడు. అందులో మంకన్న పేరులేదు. ఆవస్తువు అమ్ముకోమని తనే మంకన్నకు ఇచ్చానని ఒప్పుకున్నాడు నాగులు. మిగిలినవారి కొరకు వేట ప్రారం భించారు పోలీసులు. కాని నాగులును పట్టు కున్న వార్త తెలియడంతో అందరూ పారిపోయారు. పోలీసులు వారిభార్యలనూ, పిల్లలనూ స్టేషన్‌కు తెచ్చారు. అందరినీ లాకప్‌లలో తోశారు.
"మీ మొగుళ్లు ఎక్కడెక్కడున్నారో మర్యాదగా చెప్పండి. లేకుంటే వాళ్ళు దొరికేదాకా మీగతి ఇంతే" అన్నాడు యస్.పి. వారికేం తెలుసు పారిపో యిన వాళ్ళు ఎటుపోయిన విషయం? వాళ్లు ఏమీ చెప్పలేకపోయారు.
నాగులును యస్.పి. ముందు పడే శారు.
"ఆ సంఘటన గురించి వివరంగా చెప్పు" అన్నాడు యస్.పి.
"కవులూరు పక్కన తోటలో మా మనిషి కాపలా ఉంటున్నాడు. శెట్టిగారు గుర్రంబండిలో పోతున్నట్లు, అందులో ఆడవాళ్లు ఉన్నారనీ, ఒంటినిండా బంగారం ఉందనీ భార్యతో మాకు కబురు పంపించాడు. అతడు సినిమాకే వెళ్ళి ఉంటాడని నిశ్చయించుకొని అంపరం రాత్రికి వచ్చాము. అక్కడ కూర్చున్నాము. శెట్టివచ్చి దొరికాడు. వస్తువులు లాక్కొని ఇంటికి రావడానికి ప్రయాణమయ్యాము. అదే సమయంలో ఏదో వాహనం వస్తుంటే




అదికూడా కొట్టుకొనిపోదామని నిర్ణయించుకున్నాము. మొత్తం పన్నెండు మందిమి ఉన్నాము. బస్సు వచ్చినా మమ్మల్ని ఏమీ చేయలేదనుకున్నాం. చివరకు అది కారని తెలిసిపోయింది. దొరికిందాన్ని విడువకూడదని అందులోనున్న వారి వస్తువులు లాక్కొని, పొలంలో అడ్డంపడి, కొండల మీదుగా అడ్డదారిన ప్రాణ్యం వచ్చాము. ఆ విధంగా పోతే చెంచువాళ్లు అనుకుంటారనీ, కేసువారిమీదకు పోతుందనీ అనుకున్నాం. పైగా ఈ ప్రాంతంలో ఏ దొంగతనం జరిగినా అది చెంచువాళ్ళమీదకే తోస్తారు పోలీసులు. అందుకే ఆవిధంగా వెళ్ళాము"

"శెట్టి దగ్గర నగదు ఎంత దొరికింది?"

"రెండు వందలా చిల్లర దొరికింది."

"వాడు పదివేలని రిపోర్టు రాయించాడు సార్!" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"అంతా అబద్ధం! రెండు వందలకంటే మించిలేదు" అరిచాడు నాగులు.

"నీవు చెప్పిందే మేం నమ్ముతున్నాంరా నాగులూ! సరే! అదిపోనీ. బాంకును, దేవాలయాన్ని ఎట్లా దోచారు మీరు?" అన్నాడు చూస్తూ.

ఆశ్చర్యంగా తల పైకెత్తి చూశాడు నాగులు. "వాటిగురించి మాకేం తెలియదు దొరా! అవి ఎవరు చేశారోకూడా నాకు తెలియదు."

ఇన్‌స్పెక్టర్ వీపుమీద బూటు కాలితో తన్నాడు. "తెలియక పోవడమేంరా వెధవా! మంకన్నగాడు కూడా అందులో ఉన్నాడట. మీ అందరి పేర్లూ చెప్పాడు వాడు."

"నాకు తెలియదు; నేను అందులో పాల్గొనలేదు" అన్నాడు నాగులుఅరుస్తూ మూతిమీద కొట్టాడు ఇన్‌స్పెక్టర్. నాగులు నోరు మూతపడింది.

"కొడకా! అరిస్తే విడుస్తారను కున్నావా? చెప్పు! నిజం చెప్పు? ఎవరెవరు చేశారా దొంగతనం?" బాదుతున్నాడు ఇన్‌స్పెక్టర్ రూళ్ళకర్రతో.

నాగులు ఏడుస్తూ తనకు తెలియదని మొత్తుకుంటున్నాడు. యస్. పి. చెయ్యి ఎత్తడంతో ఇన్‌స్పెక్టర్ కొట్టడం మాను కున్నాడు.

"శెట్టిగారి వస్తువులు, కారులో దొంగిలించిన వస్తువులు ఎవరివద్ద ఉన్నాయి?"

"ఎవరి వస్తువు వారు పంచుకున్నారు. నాకు వచ్చిన వస్తువు మంకన్నకు అమ్మకానికిచ్చాను" అన్నాడు నాగులు ఏడుస్తూనే.

లాకప్‌లో పడవేయమన్నారు యస్.పి. తీసుకెళ్ళి లాకప్‌లో పడవేశారు. "నిజంగానే వాడికి ఆ కేసులగురించి తెలిసి ఉండదు. ఈ కేసు ఇంత సులభంగా ఒప్పుకుని చెప్పినవాడు, దాన్నిమాత్రం ఎందుకు చెప్పడూ? చెప్పకుండా ఎందుకు దెబ్బలు తింటాడు? అందువల్ల తెలియదనే మనం నమ్మాలి."

"ఏమో! ఇది చిన్న కేసు. మహా పడితే రెండు మూడు సంవత్సరాల శిక్ష. అవి హత్యకేసులు. ఉరిశిక్ష కూడా పడవచ్చు. అందుకే చెప్పకుండా ప్రయత్నం..." అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"చూద్దాం! ఇంతటితో ముగిసిపోలేదు. వాళ్ళు దొరకనిదే వాళ్ల పెళ్లాలను ఇళ్లకు పంపకండి" అన్నాడులేచి జీప్ వద్దకు వస్తూ. బస్ సెంటర్‌కు వచ్చే టప్పటికి పదిలారీలు సిద్ధంగా నిలబడి ఉన్నాయి. దూరంగా టీ తాగుతూ, సిగరెట్లు పీలుస్తూ హాస్యోక్తులు పలుకుతున్న పోలీసులు ఆదరా బాదరాగా టోపీలు,

కాలర్లు సరిచేసుకొని జీప్ వద్దకు పరు గెత్తుకు వచ్చారు.

"ఇక పోనివ్వకూడదా? ఎందుకు ఇట్లా స్టాకు పెడుతున్నారు?" అన్నాడు యస్.



పి. జవాబు కొరకు ఎదురు చూస్తూ.

"గంటకు ఒకసారి మాత్రమే వెళ్ళ మన్నాడు బాబూ ఇన్‌స్పెక్టర్‌గారు. అందువల్ల నిలిపివేశాము. వెంటనే కది లిస్తాము." అని "రండయ్యా! మీమీ వాహనాలు ఎక్కండి" అన్నాడు హెడ్ కానిస్టేబుల్ వేను వద్దకు వెళ్తూ.

ముందు వేను, వెనుక లారీలు, ఇతర వాహనాలు, వెనుక పోలీసు జీపు, దాని వెనుక యస్. పి. జీపు కదిలాయి. మెట్ట

మీద సుగాలీలు పనులు చేసుకుంటూ వీటిని చూస్తున్నారు. చెంచుగూడెం ముందు పిల్లలు ముడుచుకుని కూర్చుని వీటివైపు చూస్తున్నారు. ఆ పిల్లలవైపు చూసి, తల తిప్పుకున్నాడు యస్. పి.

సుగాలి మెట్టదాటి వెళ్లాయి వాహనాలు.

* * *

వర్షాకాలంతగ్గిపోతున్నది. చెంచువారివద్ద సున్న స్టాకుకూడా అయిపోయింది. వాళ్ళు లోయలు విడిచి బయటకురారు. లోయల లోకి పోలీసులు పోరు. దాగుడుమూత లాటగా తయారయింది. అప్పటికే నెల దాటింది వాళ్ళు కొండలెక్కి. పారిపోయిన వారు కూడా పదిరోజులుగా వారితోనే ఉన్నారు. ఈ పదిహేనురోజులూ వాహనాలుగట్టికాపలాతో సడుస్తున్నాయి. చీకటి పడ్డ తర్వాత వాహనాలు తిరగడమే లేదు. అందుకని పొలాలమీద దాడి చేసి వేరుశనగ కాయలు తెస్తున్నారు. కాని, అవి ఏపూట కాపూటే చాలడంలేదు.



గ్రామాలమీద దాడిచేయడానికి కొందరు ప్రయత్నించారు. డబ్బు, బం గా ర ం దొరుకుతుందికాని, తిండిగింజలు దొరకవు. తిండిగింజలు కొనుక్కోడానికి అవకాశం లేదు. అందువల్ల తిండిగింజలే సంపాదించాలనుకున్నారు. పోలీసు వాహనాలు కాపలా ఉన్నాసరే, దాడిచేసి సంపాదించుకోవడం తప్ప గత్యంతరంలేదనే నిర్ణయానికి వచ్చారు.

సాయంత్రం ఐదుగంటల ప్రాంతంలో బోడివాని గుట్టవద్దకు వచ్చారు అందరూ. డెబ్బైమందికి పైగా యువతీ యువకులు ఉన్నారు. అందరికీ పెద్ద దొక్కోని కొడుకు వీరిగాడు. పోలీసు స్టేషన్‌లో కుళ్ళి వచ్చిన తర్వాత, అంతవరకూ నాయకత్వం వహిస్తున్న నాగడు తప్పకొని వీరిగాడికి అప్పగించాడు.

"మరో అర్ధగంటలో బండ్లు వస్తాయి. ఎందరు పోలీసులున్నా కొట్టి తీరాలి. ప్రాణం నిలుపుకోవాలంటే తిండి ముఖ్యం. తిండిలేకున్నా ఛస్తాం. ఇలా చచ్చినా మంచిదే" అన్నాడు వీరిగాడు.

అందరూ తలలూపారు. "సిద్ధంకండి. వచ్చే టైమయింది" అన్నాడు ఎల్లయ్య లేచి నిలబడుతూ. కొండపైన ఇద్దరు నిలబడి ఉన్నారు అక్కడి నుండి చూస్తే రెండు మైళ్ళ లోపల రోడ్డుమీద ఏమున్నా కన్పిస్తుంది. మరికొంత సేపటికి బండ్లు వస్తున్నట్లు కేకేశారు పైనుండి. అందరి దగ్గరా కర్రలున్నాయి. కొందరి మొలల్లో కత్తులున్నాయి. కొందరి చేతుల్లో విల్లంబులున్నాయి. కొందరి చేతుల్లో ఖాళీగోతాలున్నాయి. రాళ్ళ రోడ్డుమీద అడ్డం వేశారు. రాళ్ళ అడ్డం ఉన్నది రెండు ఫర్లాంగుల దూరంనుండే కన్పిస్తుంది. అందువల్ల వాహనాలు రెండు ఫర్లాంగుల దూరంలోనే నిలుపుతారని వాళ్ళు నిశ్చయించుకున్నారు. రాళ్ళను చూసిన తర్వాత ముందుకు రావడం అసంభవం. వీళ్ళు కూడా రెండు ఫర్లాంగులు ముందుకువెళ్ళి కాపు కాయదలచారు. చెట్లమధ్య రోడ్డుకు కొద్దిదూరంలో పరుగెత్తారు. రాళ్ళకు రెండు ఫర్లాంగుల దూరంలో ఎంతదూరానికి రాళ్ళు కన్పిస్తాయో చూసుకొని అక్కడ నిలబడ్డారు చెట్లచాటున అటు కొందరు ఇటు కొందరు. రోడ్డుపైన వస్తువులు వారికి అగుపిస్తాయి; కానీ వారు రోడ్డుమీద నిలబడిన మనిషికి కనిపించరు.

ముందు వస్తున్న వేను, రాళ్ళను గుర్తించడంతో వెనుక డేంజర్‌లైటు వేసి నిలబెట్టారు. కీచుమంటూ బండ్లు ఒక దాని వెనుక ఒకటి నిలబెట్టారు. వేనులోనుండి పదిమందిపోలీసులు కిందికిదిగారు. ఆలోగా వెనుక జీపు నుండి ఇన్‌స్పెక్టర్, మరి ఆరుగురు కానిస్టేబుల్స్ దిగి ముందువైపుకు వచ్చారు నిలిపిన కారణం తెలుసుకోడానికి. హెడ్‌కానిస్టేబుల్ రాళ్ళవైపు చూపించాడు. మొత్తం పదిహేడుమంది చేతుల్లోనూతుపాకులున్నాయి. ఇన్‌స్పెక్టర్ చేతిలో పిస్తోలు మెరుస్తున్నది. అయినా వారికి భయంగానేఉంది. శత్రుప్రాంతంలో తామున్నారు. ఇది మైదాన ప్రాంతంకాదు; ఏవైపునుండి వచ్చిపడినా తాము ఏమీ చేయలేరు. ఇందరిలోనూ తుపాకులు ఎత్తి పట్టికాల్చే దమ్ము ఎందరికి ఉంది? అవకాశం దొరికితే తుపాకి కింద పడేసి పారిపోయేవాళ్ళూ ఉన్నారు. పరుగెత్తడానికి అడ్డమని తుపాకి అక్కడే పారేసే ప్రబుద్ధులున్నారు! వీరందరినీ పెట్టుకొని పోరాటం చేయడం సాధ్యమా? ఆలోచిస్తున్నాడు ఇన్‌స్పెక్టర్. 'లేస్తే మనిషిని కాదు'అనేరకం పోలీసులతో నడిచి తానూ




దెబ్బతింటానేమోనని అతని భయం. అతడు పారిపోతే తాము దెబ్బతింటామని పోలీసుల భయం. ఒకరి మీద ఒకరికి నమ్మకంలేదు. ఉద్యోగం, డ్యూటీ వారిని కలిపి కట్టివేసింది.

"ఏం చేద్దాం?" అన్నాడు చివరకు ఇన్‌స్పెక్టర్ హెడ్డును చూస్తూ.

"చీకటి పడుతున్నది సార్! చీకటి పడేలోగా కొండదాటడం ఉత్తమం" అన్నాడు హెడ్డు దేవునిధ్యానించుకుంటూ.

"అది నాకూ తెలుసోయ్! ఏ విధంగా దాటుదాం? ముందు రాళ్ళు అడ్డున్నాయి. అక్కడ మనుషులు కూడా ఉండవచ్చు; వారితో మనం తలపడాలి. అందుకు సిద్ధంగా ఉన్నారా?" అన్నాడు అందరినీ చూస్తూ. అందరూ సిద్ధంగా ఉన్నట్లు తల ఊపారు. నోటినుండి మాత్రం ఒక్క మాటా లేదు.

"మరో జట్టు వచ్చేదాకా ఆగుదామా సార్!" అన్నాడు హెడ్డు.

"ఇప్పుడు ఈ లారీడ్రైవర్ వెధవల దృష్టిలోనే మనం పిరికివాళ్ళమనిపించు కుంటున్నాం, ఇక వచ్చే మనవాళ్ళ దగ్గర వెధవలమనిపించుకోవాలి" విసుక్కున్నాడు ఇన్‌స్పెక్టర్. "పదండి ముందుకు ఏం జరిగితే అదే జరుగుతుంది" అన్నాడు బెల్టు పైకి లాక్కుంటూ. అలా అంటున్నాడు గానీ అతనికి ఆ ధైర్యం లేదు. ఏ కొండచాటునుండి రాళ్లువిసిరినా, తుపాకులు పేలేలోపల, తమప్రాణాలు పోతాయి. డ్యూటీ తప్పించుకోవడం సాధ్యంకాదు. పోలీసుల ముందు తను ఒట్టి పిరికివాడుగా గుర్తించబడడం ఇష్టంలేదు. ఒకసారి పిరికివాడుగా గుర్తిస్తే, తర్వాత తనమాట ఎవడూ వినడు. కనీసం ముందుకు పోకుండా నిలబడదామని ఎవరయినా అంటారేమో ననుకున్నాడు. కాని ఎవరి గుండెల్లో ఏమున్నా ముందుకు పోవడానికే సిద్ధపడ్డారు.

పశ్చిమాన సూర్యుడు కొండల చాటుకువెళ్ళి చాలా సేపయింది. ఇంకా ఆలస్యమయితే చీకటి వారికే రక్షణగా ఉంటుంది. ముందు ఇన్‌స్పెక్టరు పిస్తోలు చేతపట్టుకొని, అడుగులో అడుగువేస్తూ నడుస్తుండగా, వెనుక పోలీసులు పదహారు మంది తుపాకులు సిద్ధంగా పట్టుకొని నడుస్తున్నారు. రాళ్లగుట్ట వద్ద మనిషి ఒకడు ఒకవైపునుండి మరొకవైపుకు పరుగెత్తడం చూశారు. జనం అక్కడ ఉన్నారని నిశ్చయించుకున్నారు. చక చక అడుగులు వేయడం ఆరంభించారు. ఇంతలోనే వెనుకనుండి మీదకు రాళ్ళు వచ్చి పడ్డాయి. పోలీసులు తుపాకులు బారు చేశారు. కానీ కొందరి చేతిలో అవి ఊగుతున్నాయి. ఇన్‌స్పెక్టర్ గాలిలోకి పేల్చాడు.

"రేయ్! ధన్సారు. మర్యాదగా లొంగి పొండి..."

ఇన్‌స్పెక్టరు మాటకు జవాబుగా మరింత దగ్గరగా, వేగంగా రాళ్లు వచ్చి పడుతున్నాయి. అవి వడిశెలతో విసరుతున్న రాళ్ళు అనుకున్నారు. అన్నీ దాదాపు ఒకే సైజు రాళ్ళు వచ్చిపడుతున్నాయి. పోలీసులకు కొందరికి దెబ్బలు తగిలాయి. తుపాకులు కాల్చడానికి మనుషులు కన్పించడం లేదు. 'ఏవైపున జనం ఉన్నారో' ఎటువైపు కాల్చాలో ఆలోచిస్తున్నారు. ఈలోగా కొందరు పోలీసులు రోడ్డు గుంటల్లో దిగి పడుకున్నారు రాతి దెబ్బలు తగలకుండా ఉండటానికి. అర్ధగంటసేపు రాళ్లు విసిరి

వేయబడుతూనే ఉన్నాయి. రా త్రిమధ్య పరిగె త్తే స్థితిలో పోలీసులు లేరు. అందరూ ఎప్పుడో గుంటల్లో పడుకు న్నారు. ఇన్స్పెక్టర్ పెద్దబండ చాటు చేసుకుని కూర్చున్నాడు.

బయట ఏం జరుగుతుందో వారికి తెలియడం లేదు. ప్రాణభయంతో రాతి దెబ్బలు తినకుండా తప్పుకోడానికే ఆలో చిస్తున్నారు గానీ, లారీడ్రైవర్ల పరిస్థితి గురించి ఆలోచించడం లేదు.

రాళ్లు విసరడానికి కొందరిని మాత్రం నియమించి, ఎక్కువ మందితో లారీలవైపు వెళ్లాడు వీరిగాడు. ఇద్దరు డ్రైవర్లను చితకతన్నగా, మిగిలిన వారు దిగి కాలుదూడించారు. వాళ్ల పరుగు చూసి మరికొంత దూరం తరిమారు చెంచులు నవ్వుకుంటూ. కిందపడుతూ, లేస్తూ పారిపోయారు డ్రైవర్లు.

ఆ సమయానికి మరికొందరు సుగా లీలు, చెంచులు వచ్చిపడ్డారు. దొరికిన నాలుగు లారీల ధాన్యాన్ని మోయడం ఆరంభించారు. మనిషికి బస్తా అవలీలగా ఆ ఊపుమీద తీసుకెళ్తున్నారు. తొంద రగా తీసుకుపోవాలనీ, తప్పించుకోవా లనీ ఆదుర్దా! ఆ ఆదుర్దాలో అదో బరు వుగా వారు లెక్కించేయడం లేదు. తలొక బస్తా లాక్కెళ్తే మరో ఇరవై రోజుల తిండి దొరుకుతుందని ఆశ! ఇప్పటి పరిస్థితిలో ఎలాగూ బయట పడటం సాధ్యం కాదు. ఏదోవిధంగా ప్రాణం దక్కించుకుంటే చాలను కున్నారు వాళ్ళుకూడా!

నంద్యాల వైపునుండి లారీలు వస్తు న్నట్టు కొండమీద నుండి సిగ్నల్ ఇవ్వడంతో చెంచులు కొండల్లోకి పరుగు తీశారు. ఇంకా కొంత ధాన్యం మోసుక పోవాలనుకున్నారుగానీ రెండో వైపునుండి లారీలు వస్తున్నాయి. వాటికి కూడా పోలీ సులు కాపలా ఉంటారు. ఆ పోలీసులు, ఈ పోలీసులు ఏకమైతే తాము దెబ్బ తింటామని భయపడ్డారు. అందువల్ల తప్పించుకోడానికి పరుగుతీశారు.

లారీలు అటు వైపుకూడా ఫర్లాంగు దూరంలో నిలబడ్డాయి. పోలీసులు దిగి వ్యానుముందు నిలబడ్డారు. ఎదురుగా మూడు ఫర్లాంగుల దూరంలో వాహనాలు వారికి కన్పిస్తున్నాయి. అవి ముందుకు రాలేదంటే, ఏదయినా జరిగి వుండాలి. లేదా అనుమానం వచ్చి నిలిపి ఉండాలి. తాము తొందరపడి ముందుకు పోకూడ దనుకున్నారు. ఎదుటనుండి సిగ్నల్ కొరకు ఎదురు చూస్తూ నిలబడ్డారు. గుంటల్లో దాక్కున్న పోలీసులు లేచి,మట్టి దులుపుకున్నారు. ఐదునిమిషాలుగా రాళ్ళు పడటంలేదు. ఎదురుగా వాహనాల రొద విన్పించింది. వాహనాలు రావడంతో పారిపోయి ఉంటారని నిశ్చయించుకుని, లేచారు. ఒకరిమొఖం ఒకరు చూసుకుని, ఏదవలేక నవ్వుకున్నారు. ఇన్స్పెక్టర్ అందర్నీ రోడ్డుమీదకు రమ్మని వరుసగా నిలిపి లెక్కవేశాడు. ఎవడూ తప్పి పోనందుకు సంతోషించాడు. ఒకడు తప్పి పోయినా ప్రభుత్వ సొమ్ము ఇరవైవేల రూపాయలు వాడి భార్యకు ఇవ్వవలసి వస్తుంది. లారీలవైపు పరుగెత్తారు. వీరు పరుగె త్తుతూ ఉండటంచూసి, అటువైపు లారీల దగ్గరున్న పోలీసులు కూడా, పరు గెత్తుతూ వచ్చారు. లారీలు కొల్లగొట్టబడి ఉన్నాయి. ఇద్దరు డ్రైవర్లు స్పృహ లేకుండా ఉన్నారు.ఒక డ్రైవరు దెబ్బలకు తట్టుకోలేక కిందపడి ఏడుస్తున్నాడు. మిగిలిన డ్రైవర్లు కన్పించడంలేదు. 'ప్రభో




వెపు పారిపోయి ఉంటారేమో!' అనుకున్నారు. ఈ డ్రైవర్లనుపట్టుకెళ్ళవలసిన అవసరం చెంచులకు లేదు. చేతనైతే ఇక్కడే తంతారు; లేదా విడిచి పెడతారు. అందువల్ల పారిపోయి వుంటారనే నిశ్చయించుకున్నారు. లారీలను చెక్ చేశారు. అన్నింటికీ టార్పాలిన్ కోశారు. వారికి పనికిరాని వాటిని విడిచి, మిగిలిన వాటిమీద మోకులుకోసి, టార్పాలిన్‌లాగి బస్తాలు ఎత్తుకెళ్లారు.

పోలీసులంతా గుమిగూడారు. ఒకరి మొఖాలు ఒకరు చూసుకోవడం తప్పితే ఏమీ చేయలేక పోతున్నారు. దట్టంగా చీకటి అలుముకుంటున్నది.

ఇక నంద్యాల వైపునుండి లారీలు రావు. అప్పటికే సమయం మించింది. కర్నూలు వైపునుండి మరో వరసరావాలి. అప్పటికి చీకటి పడిఉండదు గనుక ఇంకోపరస తరలిస్తారు. వాటి కొరకు ఎదురు చూస్తున్నారు. అందరూ కలసి నిర్ణయించుకోవచ్చునని. ఈలోగా జీప్‌లో పాణ్యం వెళ్ళి చెప్పివద్దామనే స్థితిలో కూడా వాళ్లు లేరు. ఒంటిగా పోతే తమ పని ఏమవుతుందోనన్న భయంతో! లారీడ్రైవర్లు ప్రాణాలు అరచేత పట్టుకొని వచ్చి, పోలీసులకు ఎదురుగా రోడ్డు మీద కూర్చున్నారు. జన్మలో ఈ రోడ్డుకు రాకూడదనుకుంటున్నారు వాళ్ళు.

ప్రతిక్షణం ప్రాణభయంతో ఎంత సేపని బండినడిపించాలి? ఏ సమయంలో ఏమవుతుందో? చచ్చిన తరువాత రెండు రోజులకు గానీ,భార్యకు కూడ తెలియదు. ఈ విధంగా బతకడం కంటే నాలుగిళ్ళు అడుక్కుంటే ఏం?' అనుకుంటున్నారు. కర్నూలువైపునుండి మరో వరుస లారీలు వచ్చాయి. లారీలవెంట రెండుబస్సులనిండా జనంవచ్చారు. కొద్దిసేపట్లో రోడు జనంతో కిటకిటమంటున్నది. యాభైమందికి పైగా పోలీసులున్నారు. వందా యాభైమందికి మించి జనం ఉన్నారు. పారిపోయిన డ్రైవర్లు తిరిగి వచ్చారు. జనం అందరి ముఖాల్లో కూడా ఆందోళన, ఆతృత, భయంగూడుకట్టుకొనిఉన్నాయి. ముందు ఏం జరుగుతుందో వారికి తెలియడం లేదు. జనాన్ని వారి మానానికి వారిని విడిచి పోలీసులందరూ కూడి ఆలోచిస్తున్నారు 'చేయవలసిందేమిటా?' అని.

పాణ్యం ఏడు మైళ్ళ దూరంలో ఉంది. పోలీసు జీపులోనో, వేనులోనో పోలీసులు వెళ్ళి తెల్పడం మినహా గత్యంతరం లేదు. రాత్రంతా ఇలాగే ఉంటే ఏం జరుగుతుందో తెలియదు.

"బండ్లను అన్నింటినీ పాణ్యానికే తీసుకెళ్దాం పదండి. అక్కడికివెళ్ళిన తర్వాత ఆలోచిద్దాం" అన్నాడు ఒక ఇన్‌స్పెక్టర్.

"ఇక్కడ దెబ్బతిన్న లారీలను తీసుకెళితే తర్వాత పరిశోధనకు ఆటంకమేమో?" అన్నారు మరొకరు.

"పరిశోధన సంగతి దేవుడెరుగు! ముందు ప్రాణాలు రక్షించుకోవడం ముఖ్యం. అందువల్ల వెనుకకు తరలించండి" అన్నాడు మొదటి ఇన్‌స్పెక్టర్. నంద్యాల వైపునుండి వచ్చిన లారీలను వెనుకకు తిప్పారు. పోలీసులు అందరూ కలిసి రోడ్డు మీదున్న రాళ్ళను లాగి పక్కకు నెట్టారు. జనం బస్సులు ఎక్కారు. డ్రైవర్లు వాహనాలు ఎక్కారు. పోలీసులు వేన్లు, జీపులు ఎక్కారు. రాత్రి ఎనిమిదిగంటల ప్రాంతంలో

ముప్పైకి పైగా వాహనాలు రొదపెట్టు కుంటూ ఘాట్ రోడ్డు దిగాయి.

* * *

స్టేషన్ రణగొణ ధ్వనిగా పిల్లలతో, పెద్దలతో తొక్కిడిగా ఉంది. కప్పలూరు కేసుకు చెందినవారి భార్యాపిల్లల్ని ఇంకా విడువలేదు. వాళ్ళు దొరకనూలేదు. పోలీసులకు దిక్కుతోచని పరిస్థితి ఏర్పడింది. అన్నివైపులనుండీ సమస్యలు చుట్టుముడుతున్నాయి. చెంచు వాళ్ళతో కోరి,కొరివి తగిలించుకున్నట్లుంది పోలీసు ఆఫీసర్లకు.

నలుగురూ కలసి నిర్ణయించుకుని యస్.పి.కి ఫోన్ చేశారు పరిస్థితి తెలుపుతూ. తాను బలగాలతో వస్తున్నా ననీ, సిద్ధంగా ఉండమనీ ఆదేశించాడు యస్.పి. అప్పటికే వందమందిదాకా పోలీసులు పాణ్యం సెంటరులో బైఠా యించి ఉన్నారు. మరి కొందరు రావల మంటే ఒక బెటాలియన్ ఇక్కడే తయారయి కూర్చుంటుంది. వీరి సౌకర్యాలు చూడలేక, తన ప్రాణం పోతుందని విసుక్కున్నాడు ఇన్‌స్పెక్టర్.

పాణ్యంకి చెందిన ఓ పెద్ద మనిషి వచ్చాడు. వచ్చి ఇన్‌స్పెక్టరుతో కరచా లనం చేశాడు. మిగిలిన ముగ్గురికి ఆ పెద్ద మనిషిని పరిచయం చేశాడు. అందరూ కూర్చుంటూనే వేడి కాఫీ వచ్చింది. తాగుతూ అడిగాడు ఇన్ స్పెక్టరు "ఏమిటీ! సమయంకాని సమ యంలో వచ్చారు?"

"ఏ ముందండీ! మీతో పనిపడితేనే ఇక్కడకు వస్తాంగానీ, లేకుంటే స్టేషన్‌కు రాము కదా. ఉదయం నాగుల్ని మీరు తీసుకొచ్చారట! వాడి పెళ్లాం కిందా, మీదా పడి ఏడుస్తున్నది. సరే! మనకు రోజూ పనికి వచ్చే ముండ! ఎవరు వచ్చినా, రాకున్నా మన పొలాల్లో పని చేస్తుంటుంది. అందువల్ల కాస్త సహా యంగా ఇటు వచ్చాను. వీలుంటే చూడండి, జామీను ఇచ్చి విడిపించుక వెడతాను."

"మంచిదే! ఇప్పటికే జనానికి తిండి పెట్టలేక మా ప్రాణం పోతున్నది. విడిపించుకెళ్ళండి; జామీనుదారుణ్ని చూపించి. లేదా మీరే సంతకం చేయండి" అన్నాడు. వచ్చిన పెద్దమనిషి సంతకం చేసి, నాగులును బయటకు తీయించాడు. బయటకు వచ్చి మీసందువ్వాడు నాగులు. ఆ తర్వాత పిల్లల విషయం, ఆడవారి విషయం ప్రస్తావనకు వచ్చింది. చట్ట ప్రకారం స్త్రీని రాత్రి కస్టడీలో ఉంచ కూడదు. ఇక్కడ చట్టాలు పనికిరావు. చట్టాల ప్రకారం పోతే ఇరవై నాలుగు గంటల్లో ఖైదీని కోర్టుకు హాజరుపరచాలి. ఎవడు హాజరు పరుస్తున్నాడు. నెలల తరబడి లాకప్‌లలో మగ్గుతున్నారు. ఆధారాలు లేకుండా కోర్టుకు పోవడం సాధ్యం కాదు. అలాగని దొరికినవారిని విడిస్తే మళ్లీ పట్టుకోలేకపోవడమేగాకుండా ఉన్న చిన్న ఆధారాలు కూడా తర్వాత కన్పించవు. అందుకే నెలల తరబడి కూడా మూయవలసి వస్తున్నది. స్త్రీలను, పిల్లలను ఇందరిని లోపట పెట్టి మేపాల? ఎవడు మేపేది? యస్.పి. వీరి తిండి గురించి పట్టించుకుంటాడా? తనది బాధ్యత కాదన్నట్లు ప్రవర్తిస్తాడు. స్థానికుడు గనుక తాను గడ్డితిని అయినా వారికి తిండి సమకూర్చాలి. ఈ బాధలు పడటం కంటే వాళ్లను పంపించడం మేలను కున్నాడు. ఆ పెదమనిషితోనే, ముదా




యిలనందరినీ హాజరు పరుస్తానని మాట తీసుకొని, అందరినీ పంపించాడు. వీళ్ళు చేసే దొంగతనాలకు, ఈ పెద్దమనుషులే వెనుక సహకారమనీ, వచ్చిన బంగారంలో నాల్గింట మూడు వంతులు వీరే తింటారనీ పోలీసులకు తెలుసు. అయితే ఏం లాభం? జేబుదొంగను పట్టుకొచ్చి బాదినట్లు, వీరిని బాదడం సాధ్యమా? ఇటువంటి వాళ్ళకి పైన యం.యల్.ఎ.లూ, యం.పి.లూ, మంత్రులూ సహాయం. ఈ విధంగా దోపిడి జరుగుతూ ఉంటే పోలీసులు చూస్తూ ఉండ వలసిందే కానీ, నోరెత్తడం సాధ్యంకాదు.

ఆలోచిస్తూ కూర్చున్నాడు ఇన్స్పెక్టర్. అతనికి చెంచు వాళ్లమీద జాలి వేస్తున్నది. పాపాల భైరవుల్లాగా అన్ని కేసులూ వారి తలకు చుట్టబడుతున్నాయి. ఎక్కడ, ఏ దొంగతనం జరిగినా ముందు వీరిఎముకలు విరుగుతాయి. కవులూరు శెట్టి కేసులో నిన్నటిదాకా వాళ్లేనని నిర్ధారణగా భావించారు. అది మరొకరి వంతు అయింది. మిగిలిన కేసుల్లోమాత్రం వీరేనని నమ్మకమేమిటి? పైగా కారుతీసుకొని దోపిడీ చేయడం? ఇన్స్పెక్టరు నమ్మలేకుండా ఉన్నాడు. అలాగని పైఅధికారులతో వాదించలేదు. వాదిస్తే తానే వారికి వెనుకనుండి సహకారం చేస్తున్నట్లు కూడా ప్రచారం చేయవచ్చు. ఆ విధంగా తన జుట్టు పట్టుకోడానికి అవకాశముంది.

పది గంటలకు యస్.పి. వచ్చాడు జీప్‌లో. జీపువెనక ఆరు వేన్లు వచ్చాయి. మొత్తం వచ్చిన పటాలం వందాఇరవై. సిద్ధంగా ఉంది వందాపది. మొత్తం రెండువందలా ముప్పైమంది పోలీసులూ, హెడ్‌లూ, మరి పదిమంది ఇన్స్పెక్టర్స్, ఇద్దరు ఎ.యస్.పి.లు ఒక డి.యస్.పి. ఆ పటాలం మొత్తం.

ఆ రాత్రి ఎలాగూ పోవడం సాధ్యం కాదు గనుక, ఉదయం వెళ్ళి ఆచూకీతీసి, దాడిచేయడానికే సిద్ధంగా వచ్చారు. "చెంచుల్ని వేటాడడంతప్ప మరో మార్గం లేదు" అన్నాడు యస్.పి. వారిమీద దయాదాక్షిణ్యాలు చూపిస్తే తమ ప్రాణాలు తీస్తారు. ప్రజలకు చెంచులమీద వ్యతిరేకత ఏర్పడడంలేదు. పైగా కాపలా లేక తమ పొలాలు దెబ్బ తింటున్నాయని రైతులు బాధపడుతున్నారు. వ్యతిరేకత ఏర్పడింది పోలీసుశాఖకూ, చెంచులకూ మధ్య మాత్రమే! ఇది తిరుగుబాటు కూడా కాదు. నిర్దాక్షిణ్యంగా కొండలలోపలకు తరిమిన తర్వాత, బయటకు రాలేక తిండికోసం వాళ్లు చేసే పని- అది తప్పనిసరి అని కూడా చాలామంది ఆఫీసర్లే ఒప్పుకుంటున్నారు. ఆవిధంగా దాడి చేయకుండా, ప్రభుత్వానికి లొంగిపోతే కొంతమేలు చేయడానికి అవకాశముంటుందని వారి భావన. కాని చెంచుల స్థితి అట్లాలేదు. దొరికితే పెనంలో వేగే పేలాలలాగ తమని వేపుకు తింటారని వారి భయం. పైగా చేయని నేరాలకు కూడా వాళ్లు జైళ్లలో మగ్గ వలసి వచ్చింది. ఆ వ్యతిరేకత బాగా నాటుకు పోయింది వారిలో. అందుకే దొరక కుండా తప్పించుకోవాలని ప్రయత్నిస్తున్నారు.

వాళ్లకు వెనుక సహకారం లేదని స్పష్టంగా కన్పిస్తూనే ఉంది. ఉంటే ఆసెంబ్లీ ద్వారా, పార్లమెంటు ద్వారా వాదించేవారు. ఆ సహకారంలేదు గనుకే వారు చచ్చినా పట్టించుకునే స్థితిలో రాజకీయ నాయకులులేరు.

* * *

ఉదయం వరకు పోలీసులు పాణ్యం



బస్ సెంటర్‌లోనే కాలం గడిపారు. ఉన్న మూడు హోటల్లు, పది టీ స్టాల్స్ రాత్రంతా తెరచి టీ సప్లయి చేస్తూనే ఉన్నారు. రాత్రి నిద్ర పోయిన పోలీసులు చాలా తక్కువ మంది. వారు తెల్లవారిన తర్వాత జరిగేదాన్ని గురించి ఆలోచిస్తున్నారు. కొందరు ఇక తమ భార్యాపిల్లలను తిరిగి చూస్తామో లేదోనని మనసులోనే కుమిలి పోతున్నారు. ఎందుకొచ్చిన ఉద్యోగంరా ! అని కొందరు బాధపడు తున్నారు. అయితే ఎవరూ బయటపడలేదు. బయటపడితే పిరికివాడు అంటారు. అందు వల్ల ఆందోళన కప్పిపుచ్చుకోవడానికి టీ, బీడీ, సిగరెట్లమీద ఆధారపడ్డారు.

ఉదయం సిద్ధంగా ఉండవలసిందిగా ఆదేశం రావడంతో టిఫిన్‌చేసి, తుపాకులు శుభ్రంగా తుడుచుకుంటున్నారు. వరుసగా పది వేనులు, ఎనిమిది జీపులు ఉన్నాయి. ముందే నిర్ణయించారు గనుక లారీలు, బస్సులూ ఒక వైపుగా ఆపివేస్తున్నారు. కర్నూలు నుండి కూడా వాహనాలు రాకుండా చేయవలసిందిగా ఆదేశించారు.



ముందు జీపులు, వాటి వెంట వేనులు ఘాట్ రోడ్డుమీదకు పరుగులు తీశాయి. జనం వందల సంఖ్యలో రోడ్డుమీదకువచ్చి చూసి 'ఎంత మందికి మూడిందో!' అనుకుంటున్నారు ఆలోచిస్తూ.

బోడివాని గుట్టవద్ద ఆగాయి వేన్లు, జీపులు. యస్. పి. ఆదేశంతో తుపాకులు సర్దుకున్నారు పోలీసులు. ఇన్స్పెక్టర్లు, ఆఫీసర్లు రివాల్వర్స్ సరిచేసుకున్నారు.

పోలీసుగైడ్స్ ముగ్గురు ముందు దారి తీశారు గింజలుపడ్డ ప్రాంతాన్ని చూస్తూ. గింజ ఏవైపున పడుతూ వెళ్ళిఉంటాయో అటువైపే వాళ్ళు ఉంటారని వారి ఉద్దేశం.



ఏ తిండికొరకయితే ఇదంతా చేస్తున్నారో ఆ తిండిగింజలు విడిచి దూరంగా ఉండరు. అది అందరికీ తెలిసిన లోకజ్ఞానమే! దాన్నే ఆఫీసర్లు అమలు పరిచారు. గింజలు రెండు కొండలమధ్య లోయగుండా వెళ్తున్నాయి. లోయ ఇరుగ్గా ఉంది. మహా అయితే ముప్పైగజాలవెడల్పు. ఆ ముప్పై గజాలలోనే సన్నటి ఊటకాలువ! వర్షా కాలంలో గొప్పగాపారుతుంది. ఆ లోయను వారు ఎన్నుకోడానికి కారణం శత్రువు దగ్గరకు రాలేదనీ, నీరు సమృద్ధిగా దొరుకు తుందనీ! అందువల్లనే వారు అక్కడ ఉన్నారని వీరూ నిర్ణయించుకున్నారు. తల ఎత్తిచూస్తే రెండు వైపులా గుట్టలు. ఆ గుట్టలమీద పెద్ద పెద్ద రాళ్ళు. ఎదురుగా లోయ మలుపు తిరుగుతూ దూరంగా కన్పించింది. అది మలుపు తిరగడంకాక ఎదురుగా మరో గుట్ట అడ్డు ఉన్నట్లుగా అగుపిస్తున్నది. లోయలోకి పోవడానికి మార్గం ఉండాలిగనుక, అది అడ్డుగుట్ట కాదనీ, మలుపు తిరిగి ఉంటుందనీ ఊహించారు. మలుపు మరో నలభైగజాల దూరంలో ఉండగానే మలుపు గుట్టమీద జనం కన్పించారు. యస్. పి. ఆదేశంతో తుపాకులు పైకి లేచాయి. వీళ్ళు గురి చూసుకుంటూ ఉండగానే తలలు తిరిగి రాళ్ళమధ్య కన్పించకుండా మాయ మయ్యాయి. ఇక అడుగు ముందుకు వేయ డానికి ఎవరూ సిద్ధంగాలేరు. వాళ్ళుఎదురు పడ్డారు. పారిపోతారా? ఎదురు తిరుగు తారా? అనేదానిమీద ఆధారపడి ఉంటుంది పోలీసుల పరిస్థితి. క్షణాలు నిముషాలుగా దొర్లిపోతున్నాయి.

ఎదురునుంచి బాణ పరంపర ఆరంభ మయింది. ఈ గుట్టలు దాటితే ఏముం టాయో పోలీసులకు తెలియదు. మ్యాపుల ఆధారంగా వాళ్ళు నడుస్తారు. మ్యాపులు ఏ జన్మలో రాసినవో వారికే తెలియదు. మ్యాపుల్లో రోడ్డు ఉన్నచోట నిజంగా ఊబి గుంటలు ఎదురయ్యాయి. కొండగుట్ట ఉన్న చోట బ్రహ్మాండమైన మైదానాలుంటాయి. ఈ అవకతవకగా తయారయ్యే మ్యాపుల ఆధారంగా నడిస్తే దెబ్బతినవలసి వస్తుంది. పైగా కొండల సమాచారం మ్యాపుల్లో ఊహించి రాసే మేధావులున్నారు. అందువల్లనే వెనుక ఎటువంటి ప్రదేశ ముందో తెలుసుకోకుండా ముందుకు చూసుకుని పోవడానికి యస్. పి. సిద్ధ పడటంలేదు. గైడెన్స్ ఇచ్చేవారికి మ్యాపు పద్ధతి ప్రకారం ఇస్తారేగానీ వారు ఆ ప్రాంతాలు చూసి ఇవ్వరు. స్థానికులు సహకరిస్తేనే ఆ ప్రాంతాలు అర్థం చేసు కోవచ్చు.

వస్తున్న బాణాలకు జవాబుగా ఫైర్ ఆర్డర్ జారీచేశాడు యస్. పి. టపటప మంటూ వందరౌండ్లు దూసుకెళ్ళాయి కొండ గుట్టలమీదకు. నిముషంపాటు ప్రశాంతత! తిరిగి బాణాలతో దాడి చేశారు వాళ్ళు.

లోయల్లో ఉన్న తిప్పల మధ్య దూరారు పోలీసులు బాణాలు తప్పించు కోడానికి. బాణాలు విడిచేవారు చెంచులే! సుగాలీలకు అది చేతకాదని వీరికి తెలుసు.

మరోసారి తుపాకులు పేలాయి. చావు కేక వెంటనే విన్పించింది.

కొంత విరామం దొరికిందిపోలీసులకు. ఎదుటినుండి జవాబు లేదు. పారిపో తున్నారా? అనుకున్నారు. తొందరపడి వెంటపడటం సమంజసమా?

పది నిమిషాల తర్వాత రెండువైపులా ఉన్న కొండలమీద కన్పించారు జనం!





పెద్ద పెద్ద గుండ్లు పైనుండి కిందికి తోస్తు న్నారు. విపరీతమైన శబ్దం చేసుకుంటూ గుండ్లు కిందకు దూసుకువస్తున్నాయి.

తప్పుకోడానికి పోలీసులు ముందుకు అడుగు వేశారు. ఎదురుగా తిరిగి బాణ వర్షం ఆరంభమయింది. మూడు వైపులా ముట్టడి ఆరంభమయింది. అంత ఎత్తు కొండమీదకు తుపాకుల గుళ్ళు వెళ్ళవు. వెళ్ళినా తగుల్తాయన్న నమ్మకంలేదు. ఇక వాళ్ళకు ఒకే ఒక దారి వెనుతిరిగి పారిపోవడం! రెండువందలా యాభై మంది ఉన్నారు. మరో రెండువేల మంది ఉన్నా శత్రువుకు అనువయిన ప్రాంతం అది. అన్నీ తెలిసిన శత్రువు మధ్య ఆ ప్రాంతం గురించి ఓనమాలు తెలియని తాము నిలబడ్డారు. తుపాకులు ఎంత సేపని పని చేయగలవు? వాటికీ పరిమితి ఉంది. పైగా కిందినుండి తుపాకిగుండు దూసుకుని పైకి వెళ్ళాలి. బ్రహ్మాండమైన ఎత్తునుండి అతిఉరవడిగా రాతి గుండ్లు కిందకు వచ్చి తమమీద పడడానికి అవ కాశం ఉంది. ఈ సమయంలో శత్రువే గెలుస్తాడు. అతనికి రక్షణ ఉంది. చాలా ఆలస్యంగా గ్రహించాడు యస్. పి. తమ తుపాకులు అక్కడ పనిచేయవని అప్పటికి తెలుసుకున్నాడు. పైగా శత్రువు చక్రవ్యూహం పన్నుతున్నాడు. అయినా శత్రువు బలంగా లేడనడానికి నిదర్శనం నాలుగోవైపు అడ్డురాకుండా దారి ఇస్తు న్నారు. అంటే తాము తిరిగి పారిపోవ డానికి అవకాశం!

శత్రుమూక ఎంత ఉందో వారికి తెలి యదు. అయినా తిరిగి మరో నాలుగు సార్లు ఐదు వందల రౌండ్లు కొండలపైకి తుపాకీ గుళ్ళు దూసుకెళ్ళాయి. గుండు పేలినప్పుడు శత్రువు దాడి తగ్గిస్తున్నాడు. విరామ సమయంలో దాడిచేస్తున్నాడు. తాము ప్రాణాలతో వెళ్ళిపోవాలంటే తుపా కులు పేల్చుకుంటూ పోవలసిందే చేతులు కట్టుకుని పారిపోతే శత్రుమూక వెంటపడి తరుముతుంది. ఆ దెబ్బతో తలోదిక్కు పారిపోవడమో? చావడమో తప్పని పరిస్థితి అవుతుంది.

"గో బ్యాక్!" అంటూ యస్. పి. ఆదేశమిస్తూనే వెనుతిరిగారు పోలీసులు. వెళ్ళిపోతూకూడా కాల్పులకు ఆర్డరిస్తూనే ఉన్నాడు. ఎదురుగానున్న కొండమీద నుండి బాణవర్షం పోలీసులవరకూ రావడం లేదు. వాళ్ళకు కూడా తెలిసినట్టు నిలిపి వేశారు. మిగిలిన వాళ్ళు కూడా రెండు కొండలమీదకు చేరుకుంటున్నారు. పోలీ సులు చిన్న చిన్నగా కదుల్తూనే, రెండు వైపులా కాల్పులు సాగిస్తున్నారు. రోడ్డు మీదికి వచ్చేటప్పటికి పైనుండి గుండ్లు దొర్లడం ఆగిపోయింది. జనం కూడా కన్పించటంలేదు. రోడ్డుమీదకు వచ్చి పోలీసులు వరుసగా నిలిచారు. ఇద్దరు పోలీ సులు తక్కువయ్యారు. మళ్ళీ, మళ్ళీ, పది సార్లు లెక్కబెట్టారు. అయినా ఇద్దరు తక్కువ వచ్చారు. అంటే ఇద్దరు చావడమో, లేక లోయలో చిక్కుకోవడమో జరిగింది. ఆ ఇద్దరూ ఇక తిరిగి రానట్లే లెక్క... యస్. పి. గుండెల్లో మండు తున్నది. ఇది మహా అవమానకర సంఘ టన! కూటికి గతిలేక దొంగతనాలుచేసి బతికే నిరాయుధులైన చెంచులచేతిలో ఓడిపోవడం? అతనికి తల కొట్టేసినట్లు యింది. ఇంతమంది పోలీసులు ఉండికూడా ఏమీ చేయలేకపోయారు. అదే ఎదురు పోరాటంలో అయితే ఈపాటికి వందల మందిని చంపగలిగి ఉండేవారు. కాని ఇది

అనుకూల ప్రాంతం కాదు. చావకుండా తిరిగి వచ్చినందుకే పోలీసులు సంతోషిస్తున్నారు.

"బలాన్ని పెంచి తీసుకరావడంమంచిదేమో సార్!" అన్నాడు ఎ. యస్. పి.

అతని కళ్ళల్లోకి చూశాడు యస్.పి. అవమానంతో ఎ.యస్.పి. కళ్ళల్లో ఎర్రజీర కన్పిస్తున్నది.

"బలంకాదు కావలసింది. ఇంత పటాలం ఉంది. ఇంతకంటే బలమెందుకు? ఈ ప్రాంతమంతా బాగాతెలిసిన వ్యక్తులు కావాలి. అటువంటి వారిని అడ్డుపెట్టుకొనే ముందుకుపోగలం. వాళ్ళు లోయల మధ్యకు తీసుకెళ్ళి మనల్ని మట్టుబెట్టకుండా అటువంటి వారి కొరకు అన్వేషించాలి."

ఈ ప్రాంతంలోని మిగిలిన చెంచు, సుగాలీలు ఎంత సహకారం అందిస్తారో వారికి తెలియడం లేదు. అయినా సరే, అనవసరంగా భంగపడటం కంటే పటిష్ఠమైన పద్ధతిలో తిరిగి దాడిచేయాలి. వారిని మొత్తం నిర్మూలిస్తేగానీ, ఈ కొండ బాగుపడదని నిర్ణయించుకున్నారు.

ఆవేశాలు హద్దుల్లో ఉండవు. ఆవేశంతో ఊగిపోతున్న ఆఫీసర్లు ఏమైనా చేయడానికి సిద్ధపడతారు.

తుపాకులు లోపలపెట్టి ఒక్కొక్కరే వాహనాలు ఎక్కారు. కనుచూపుమేరలో రోడ్డుమీద మనుషలు కన్పించడం లేదు. మామూలు పరిస్థితులలో అయితే నిముషానికో వాహనం ఆ రోడ్డువెంట పరుగెత్తేది.

వాహనాలు పాణ్యం సెంటర్ చేరేసరికి ఒంటిగంటయింది. అందరినీ అక్కడే ఉండమని ఆదేశించి, యస్.పి. అధికారులతో కలిసి స్టేషన్‌కు వెళ్ళాడు.

యస్. పి. ముఖంచూసిన ఇన్‌స్పెక్టరుకు దాడి ఫెయిలయిందని తెలిసినట్లుంది.

"ఈకొండల్లో పూర్తిగా అనుభవంగల గైడ్స్ అత్యావసరం. వెంటనే అటువంటి వారిని ఏర్పాటుచేయండి" అన్నాడు యస్.పి. ఆదేశపూర్వకంగా.

నిన్న వచ్చిన పెద్దమనిషిని పిలిపించాడు ఇన్‌స్పెక్టర్. అతనితో వివరాలు చెప్పాడు ఇన్‌స్పెక్టర్.

"మాకు తక్షణం ముగ్గురో నలుగురో కొండప్రాంతాలు బాగా తెలిసిన వాళ్ళు కావాలి. ఏర్పాటు చేయించండి" అన్నాడు.

"ఇంకేం సార్! శెట్టికేసులో ఉన్న వారిలో చాలామందికి ఆ కొండలు బాగా తెలుసు. అతడికి కూడాఇదే అదనుగా కన్పించింది.

ఇన్‌స్పెక్టరు యస్.పి.కి వివరాలు చెప్పాడు. యస్.పి. తల ఊపాడు "కేసు కాదు ముఖ్యం. చెంచునాకొడుకులు నాశనం కావాలి. దానిముందుకేసెంత? ఫైల్ చించెయ్యి! నలుగుర్ని పంపించమను" అన్నాడు ఆగ్రహంగా.

ఇన్‌స్పెక్టరు ఆ పనే చేశాడు. రేపు ఉదయం వారిని తీసుకువస్తానని పెద్దమనిషి చెప్పివెళ్ళాడు.




రాత్రి చెంచువాళ్ళు లోయలో గుమికూడారు. చీకటిపడింది. ఒకరిముఖం ఒకరికి కన్పించనిస్థితి. ఆ పరిస్థితిలో




డొక్కవీరన్న, మరోమనిషితో అక్కడకు వచ్చాడు. అందరి ముఖాల్లో భయం, ఆవేశం, ఆతృత ఉన్నాయి. ముందు ఏం జరుగుతుందో వారికి తెలియదు. ప్రస్తుతం మాత్రం పూర్తి ఏకాకిగానూ, ప్రమాద సూచికకు దగ్గరలోనూ ఉన్నట్లు వారికి తెలుసు.

డొక్కవీరన్న వెంటవచ్చిన మనిషి అందరినీ కూర్చోబెట్టి, పరిస్థితి వివరించాడు. "ఈరోజు మీరు దెబ్బతీయగలిగారు. కాని అది మీ శక్తిసామర్థ్యాలతోనూ కాదు. శత్రువు బలహీనుడై కాదు! శత్రువుకు ఇక్కడి పరిస్థితులు తెలియవు. వెంటవచ్చిన గైడ్స్ ఇచ్చిన సమాచారం సరిగాలేదు. దెబ్బతింటామన్న భయంతో వెనుతిరిగారు తాత్కాలికంగా! అంత మాత్రాన వాళ్ళిక్కడికి రారనుకోవద్దు. వాళ్ళు మరో ఎత్తువేస్తున్నారు. ఈ కొండలోతట్టు ప్రాంతాలు బాగా తెలిసిన చెంచుల సహకారంతో లోపలకు రావడానికి ప్రయత్నాలు చేస్తున్నారు. అంటే, ఏ సమయంలోనయినా మీ మీద దాడులు కొనసాగిస్తారు. మీ దగ్గర ఆయుధాలు లేవు; ఉన్నవి వారితుపాకుల ముందు నిలవవు. ఈ పరిస్థితిలో ఒకే ఒక్క మార్గం. మీరందరూ ఇంతకు ముందులా ఒకేఒక చోట ఉండకుండా, దళాలుగా విడిపోండి. ఎలాగూ కొందరు చావక తప్పదు. ఆ చావడం అందరూ చావకుండా చూసుకోవాలి. అందువల్ల తలోవైపు వెళ్ళిపోవడం, శత్రువు ఎవరికి దొరికినా నాశనం చేయడం లక్ష్యంగా పెట్టుకోండి ఒకరితో ఒకరికి సంబంధాలు ఉంచుకోండి ప్రస్తుత పరిస్థితిలో మీరు ఇంతకు మించి ఏమీ చేయడం సాధ్యం కాదు."

బాధతో కొందరు తలలు వంచితే, కోపంతో కొందరు పిడికిళ్ళు బిగించారు. అందరూ ఆవేశంగా ఊపిరివిడుస్తున్నారు. ఇప్పటికయినా, వారు బయట బతకడానికి అవకాశముంటే, వెళ్లిపోవడానికి సిద్ధంగా ఉన్నారు. కానీ ఇక అధికారులు ఆ అవకాశం ఇవ్వరు. దాడిఫెయిలై ఇద్దరు పోలీసులు నాశనమయ్యారన్న ఆక్రోశం వారికి ఉంది. ప్రతీకారం తీర్చుకోవాలనే తపనతో ఉడికిపోతున్నారు. ఆ స్థితిలో వారిని క్షమించడం అసంభవం. చెంచులకూ ఆ విషయం తెలుసు. ఎలాగూ తమ ప్రాణాలు తీయడానికి వారు సిద్ధంగా ఉన్నప్పుడు దొరకడం మంచిది కాదనుకున్నారు.

భోజనాలు తిన్నవారు లేచి, తలా కొన్ని గింజలు గుడ్డలో కట్టుకున్నారు. మట్టికుండ, మట్టిముంతలు చేతికి తీసుకున్నారు. భయంకరమైన ఆ చీకటిలో లోయలగుండా జనం సాగారు. తెల్లారేటప్పటికి ఎంత దూరం వెళ్లితే అంత మంచిదని ఆలోచిస్తున్నారు. రేపు పోలీసులు ఈ ప్రాంతం మీదే దాడిచేస్తారు. అపాటికి ఈ ప్రాంతంలో ఎవరున్నా నాశనం కాకతప్పదు. వాతావరణం చలిగా ఉంది. ఆకాశంలో చంద్రుని అడ్డుకుంటూ మేఘాలు కదులుతున్నాయి. గుహ బయట ఒంటరిగా కూర్చున్న ఆ వ్యక్తి వద్దకు వీరమ్మ వచ్చింది. తల ఊపి పలకరించాడు. తన రెండు బుగ్గలూ చూపించింది వీరమ్మ ఏడుస్తూ.

"ఇటువంటిబాధలు సహజం వీరమ్మా! స్వేచ్ఛ నిలుపుకోవాలంటే ఎన్నో బాధలు!"

ఆమె తల పంకించి పండ్లు కొరికింది "వాడే నాకు బయట కనిపిస్తే నల్లిని

నలిచినట్లు నలుస్తాను. ఈ గాయాలవల్ల నేననుభవించిన పదిహేను రోజుల బాధ, వాడికి ఒక్క రోజులోనే చూపిస్తాను"

చిన్నగా నవ్వాడు. "వాడికి ఎంత రక్షణ? పిరికిపందలు చుట్టూ రక్షణ ఏర్పాటు చేసుకొని మరీ దాడిచేసి హింసిస్తారు. వాడు ఒంటరిగా ఎందుకు దొరుకుతాడు?"

తల ఊపింది వీరమ్మ "దొరక్కుండా పోడు; దొరికిన రోజు చెబుతాను వాడి పని" అంది క్రోధంగా చీకట్లోకి చూస్తూ.

వీరమ్మ లేచి మూట నెత్తిన పెట్టుకుంది. అందరూ వెళ్ళిపోతున్నారు చీకటిలోకి.

డొక్కవీరన్న అతని దగ్గరకు వచ్చాడు. "మనం వెళ్ళిపోదాం."

తల ఊపాడు అతడు.

ముందు వీరన్న, వెనుక అతడు. మౌనంగా ముందుకు సాగారు.

లోయలోని వాగులో నల్లటి నీళ్ళు చీకట్లో జలజల చప్పుడుతో సాగిపోతున్నాయి పల్లం వైపుగా. తమ రక్షణకు అనువైన ప్రాంతాలకు జనం కదలిపోతున్నారు.

"మేం బయటికి పోవడం సాధ్యం కాదా?" అన్నాడు డొక్కవీరన్న.

"తొందరపాటు పనికిరాదు. ఈ పరిస్థితిలో మీరు లోపలున్నా, బయట ఉన్నా ఒకటే! బయట ఉంటే స్టేషన్‌లో కాపురం చేయాలి. లోపలుంటే ఈ విధంగా బతకాలి. ఎక్కడున్నా పోలీసుల బాధ తప్పదు. ఈ కొండల్లో కనీసం రక్షణ దొరికే అవకాశం ఉంది. దీన్ని కూడా పోగొట్టుకుని, మైదానాల్లోకి వెళ్ళే వీరమ్మ గతి, హనుమంతు స్థితి చూశారు గదా. మిగిలిన వారికీ అంతే! చూద్దాం! కలెక్టరుతో సంప్రదిస్తే అతడు ఏ విధంగా కలుగ చేసుకుంటాడో?"

"కలెక్టరు కలుగచేసుకుంటాడా?"

"అతడు కలుగచేసుకోబట్టే, ఈ రోజు కాల్పుల వరకూ వచ్చింది! అతని అనుమతి లేకుండా వీళ్ళు దాడికి ఎందుకు వస్తారు?" తర్వాత ఎవరూ మాట్లాడలేదు. రకరకాల పిట్టలు, జంతువులు, అరుస్తున్నాయి. వాటి అరుపులు వింటూ, కాళ్ళకు రాళ్ళు తగలకుండా జాగ్రత్తగా కదులుతున్నారు. గొరకొయ్యలు నెత్తి మీదకు వస్తున్నాయి. ఆకాశం నిర్మలంగా ఉంది. చంద్రుడు ఎప్పుడో గ్రుంకాడు. తెల్లారేటప్పటికి ఓ గ్రామ పరిసరాలలోకి వచ్చారు. మైదాన ప్రాంతం ఆరంభమయింది.

"నేను వెళ్తానుగానీ నీవు వెళ్ళిపో వీరన్నా!"

చేతులెత్తి దణ్ణం పెట్టాడు విషాదంతో చూస్తూ వీరన్న. వెనుతిరిగి కొండలలోకి దారితీశాడు.

* * *

ఉదయం ఎనిమిది గంటలనుండి తిరిగి దాడికి సన్నద్ధమయ్యారు పోలీసులు. వేన్లు, జీపులు రోడ్డువెంట పరుగెత్తాయి. చెంచుపిల్లలు గూడెంముందు నిలబడి బిక్కమొగంతో చూస్తున్నారు వాహనాలను.

నిన్నటి ప్రాంతంలోనే తిరిగి నిలిపారు.

ఉన్నమందిని నాలుగు దళాలుగా విభజించారు. ఒకరు తిరిగి లోయలోనే సాగడం. రెండవదళం, ఒకవైపు ఉన్న గుట్టమీదుగా సాగడం. మూడవదళం రెండోవైపునున్న గుట్టమీదుగా సాగడం.





నాల్గవదళం లోయ పూర్తయ్యే ప్రాంతం నుండి దాడి చేయడం. చుట్టూచక్రబంధం. లోయమధ్యలో ఉన్నవారు ఎటూపోవడానికి వీలుండదు. గుట్టలపైనుండి రాళ్ళు రువ్వటానికి వీలుండదు. గుట్టలపైన పోలీసులు నడుస్తుంటే వాళ్ళు నిలిచి పోరాడలేరు. ఆ విధంగా వాళ్ళని తరిమి, తరిమి పట్టుకోవచ్చు.

లోయకు రెండువైపులఉన్న దళాలూ, రెండుగుట్టల మీదుగా ఉన్న దళాలూ కదిలాయి. ఒక్కో దళానికి ఒక గైడ్‌ను నియమించారు. నలుగురు స్థానికులే; ఆ గుట్టలలో రాత్రిం పగళ్ళు తిరిగినవారే!

మనుషుల అలికిడి లేదు. అక్కడే ఉంటారన్న నమ్మకమూ వారికి లేదు. ఉంటే, ఈపాటికే చెల్లాచెదురుగా పరుగెత్తే వాళ్ళు. ఎదుర్కోవడానికి సిద్ధపడేవారు. జవాబు లేదు. గాలికి ఆకులు కదిలి ఊగుతున్నాయి. ఎండుటాకుల మీద కాళ్ళు పడ్డప్పుడు చప్పుడు వస్తోంది. ఆ చప్పుడుకు తుళ్ళిపడేస్థితిలో ఉన్నారు పోలీసులు.

గైడ్ చూపిన గుహలవద్దకు వచ్చారు. గుట్టకింద దాదాపు వందమంది నివాసం చేయడానికి వీలున్న గుహలాగుంది. పోలీసు సెట్‌బాక్‌లో వస్తూ, రౌండుగా చుట్టుకున్నారు. నాలుగు దళాలు అక్కడ కలుస్తున్నాయి. గుహపైనున్న దళాన్ని పైననే నిలబడవలసిందిగా యస్.పి. ఆజ్ఞాపించాడు. గుహలో అలికిడి లేదు. ఒకరి ముఖాలు ఒకరు చూసుకుంటూ నిలబడ్డారు. యస్.పి. ముందుకు వచ్చాడు. ఆయనతో పాటు మిగిలిన ఆఫీసర్లు ముందుకు వచ్చారు. గుహ ముందుభాగంనుండి లోపలకు చూశారు. వెలుతురు కొద్దిగా లోపలకు పడుతున్నది. ఆ వెలుతుర్లో వాళ్ళకు ఏమీ కన్పించడంలేదు. జనం ఉన్న సూచనలు లేవు. మరింత ధైర్యంగా పోలీసులు ముందుకు కదిలారు. లోపలకు తొంగిచూశారు. జనం లేరని తెలిసిపోయింది. కొందరు పోలీసులు లోపల జొరబడ్డారు. గుహ మొత్తం కలియదిరిగారు. పగిలిపోయిన మట్టికుండలు తప్ప వారికి ఏమీ దొరకలేదు. ఒకమూల ఇద్దరు పోలీసులు తాళ్లతో కట్టివేసి ఉన్నారు. అటువైపు పరుగెత్తి వాళ్లను విడిపించి, నాడి చూశారు. బతికే ఉన్నారు. స్పృహలో లేరు. విపరీతంగా రాళ్ల దెబ్బలు తగిలి ఉన్నాయి. దెబ్బలకు ఆకు పసరు పూసి ఉన్నట్లుంది.

వాళ్లను అక్కడేవిడిచి గుహబయటకు వచ్చాడు యస్. పి.

"ఇంకా ఈ ప్రాంతంలో గుహలున్నాయా ?" అన్నాడు యస్. పి. గైడ్స్‌తో.

"చాలా ఉన్నాయి దొరా! ప్రతిలోయలోనూ ఇటువంటివి ఒకటి రెండు ఉండనే ఉన్నాయి" అన్నాడు ఒకడు.

అటువంటి చోటికి దారితీయమన్నాడు యస్.పి. ఒక్కో దళం ఒకవైపు కదిలింది. లోయలమీదచూస్తూ కదులుతున్నారు. ఎటువైపునుండి దాడివచ్చినా ఎదుర్కోడానికి సిద్ధంగా ఉన్నారు.

పోలీసుల రాకడ తెలియడంతో చిన్న చిన్న గ్రూపులుగా తయారయి, దొరికిన తోవవెంట పారిపోతున్నారు చెంచులు. నిన్నటి ఉత్సాహం వారిలో లేదు. బలవంతులయిన, అన్ని హంగులూ ఉన్న పోలీసులమీద తాము నిలబడి దాడిచేయడం రోజూ సాధ్యం కాదని వారికీ తెలుసు. నిన్నటి రోజు తప్పించుకోవడానికి తప్పని

సరైదారికి దిగారు. ఇలా రోజూ దిగితే తమ రక్తం భూమిలో ఇంకిపోతుందని వారికి తెలుసు. అందుకే పారిపోతున్నారు. వారు పారిపోతున్నంత వేగంగా పోలీసుల కదలిక లేదు. పోలీసుల కదలిక చెంచు వారి నడకతో సమానంగా ఉంటేనే చెంచు వాళ్ళను ఎదిరించి పట్టుకోవడం సాధ్యం. గైడ్స్ సరైయినదారే చూపిస్తున్నా, కొండలలో నడక అలవాటు లేకపోవడం వల్ల రాళ్లు తగిలి కాళ్లు నొప్పులు పెడుతున్నాయి. ఎక్కి దిగడంలో, మోకాళ్ల పోట్లు తీసుకుంటున్నాయి. తాగడానికి నీళ్లు బాగానే దొరుకుతున్నాయి. తిండి లేదు.

అప్పటికే ఒంటి గంట అయింది. చెంచువాళ్లు ఎవడూ దొరకడం లేదు. పట్టు విడువని విక్రమార్కుడిలా యస్. పి. ముందు నడుస్తున్నాడు. అతన్ని తిట్టుకుంటూ పోలీసులు నడవక తప్పింది కాదు.

గైడ్ వచ్చాడు యస్. పి. వద్దకు.



దూరంగా ఉన్న గుబురు చెట్లను చూపించాడు. పోలీసులను ఆగి కూర్చోవలసిందిగా ఆదేశించాడు యస్.పి. పోలీసులు కూర్చున్నారు ఏదో ముంచుకువస్తున్నట్లు. గైడ్ చెయ్యి పెట్టి చూపిస్తూ "ఆ గుబురు చెట్లలోనికి మనిషి వెళ్ళడం కన్పించింది

"అక్కడ ఏముంది ?"

"చిన్న దేవాలయం ఉంది. అక్కడే చిన్న చెరువు కూడా ఉంది. మనుషులు ఐదారుగురు ఉండడానికి అనువుగా



దేవాలయం ఉంటుంది. బయటే అయితే చాలామంది ఉండవచ్చు. మ్రారిచెట్లు, ఇతర చెట్లు బాగా గుబురుగా పెరిగి నీడ ఇస్తున్నాయి" అన్నాడు గైడ్.

యస్.పి. తల పంకించాడు ఆలోచిస్తూ.

"మనం వెళ్ళేదారిగాక ఇతర దారులున్నాయా?"

"చుట్టూ వెళ్ళడానికి అవకాశముంది సార్! లోయలో ఎటువైపు నుండి అయినా రావచ్చు"

"చుట్టు తిరిగి కొంతమందితో నీవు రా! నేను సరాసరి వస్తాను. మధ్యన దొరుకుతారు. రెండు వైపులా కొండలుండడం వల్ల వాళ్లు త్వరపడి పైకి ఎక్కలేరు. ఎక్కబోయినా కాల్చవచ్చు"

గైడ్ తల ఊపాడు. అతని వెంట సబ్ఇన్‌స్పెక్టరుతోపాటు ఇరవై మంది పోలీసులను పంపాడు. నక్కి నక్కి వాళ్లు ఆ ప్రాంతం నుండి దాటుకున్నారు. మిగిలిన ముప్ఫై మందితో పోలీసు గైడును ముందుంచి, చిన్న చిన్న చెట్ల మధ్య కూర్చొని పాకుతున్నారు. లేస్తే కన్పించవచ్చు. కన్పిస్తే పారిపోతారు. వెనుక దళం వచ్చేవరకూ కన్పించకుండే, వెనుక నుండి చుట్టేస్తారు. అప్పుడు రెండు వైపులా దొరికిపోతారు. ఆ విధంగా ఆలోచించాడు యస్.పి. కూర్చుని అడుగు తీసి, అడుగువేస్తూ కదలుతున్నారు.

రెండోవైపు నుండి పోలీసులు తొందరగానే కదలివచ్చారు. అటువైపు వాళ్ల కన్పించడంతో ఇటునుండి వీళ్లు కూడలేచి, ఒకేసారి రెండు వైపులనుండి చెట్లవైపుగా పరుగు తీసుకున్నారు. చెంచులు అక్కడ ఉన్నారో లేరో వారికి పూర్తిగా తెలియదు. అయినా యథాప్రకారం పొట్లు పడక తప్పదు.

గుబురుచెట్ల మధ్య కదలిక ఆరంభమయింది. జనం కొందరు అప్పుడే లేచి అటుఇటు తిరుగుతున్నట్లు కన్పించారు. ఇంకా తుపాకీ వేటుకు అందనంత దూరంలో ఉన్నారు. పారిపోవడానికి లేచి, చెట్ల వెనుకకువస్తే, అటువైపు నుండి కూడా పోలీసులు వస్తున్నారు. రెండువైపుల వేయబడిన వలలో తాము చిక్కుకున్నామని వాళ్ళు ఆలస్యంగా తెలుసుకున్నారు. ఎట్టిహెచ్చరిక లేకుండానే యస్.పి. అరిచాడు—"ఫైర్".

తుపాకులు ధనధనమోగాయి. చావు కేకలు విన్పించాయి. అటుఇటు పోలీసులు చిన్నచిన్న రాళ్ళ మధ్య నక్కి కూర్చున్నారు ఎదుటినుండి వచ్చే జవాబు కొరకు. ఎట్టి జవాబులేదు. వాతావరణం ప్రశాంతంగా ఉండేటప్పటికి పోలీసులు కాపు ఉంటారని తెలిసి కూడా ఒకస్త్రీ, ఇద్దరు పురుషులు పరుగెత్తుతూ కొండ ఎక్కడానికి వేగంగా కదిలారు.

మరోసారి యస్.పి. ఆదేశంతో తుపాకులు ధనధనమన్నాయి. ముగ్గురూ నేలకూలారు అరుస్తూ. మరో అర్ధగంట ఎదురుచూశారు. జనం ఎవరూ రావడం లేదు. అలికిడి కూడాలేదు. లేచి దుమ్ము దులుపుకొని యస్.పి. ముందుకు కదిలాడు. ఆయనతో పాటు మిగిలిన వాళ్ళు లేచి తుపాకులు బారుచేసి పట్టుకొని కదిలారు. అటువైపున్న దళంకూడా కదిలింది. కొండ ఎక్కడానికి ప్రయత్నం చేసిన ముగ్గురి వద్దకూ వచ్చారు. వారిలో చలనం లేదు. నిర్జీవంగా పడివున్నారు. తుపాకిగుళ్ళు వారి శరీరాల్ని జల్లెడలా చేశాయి. అక్కడి

నుండి గుబురు చెట్లలోనికి వచ్చారు. అక్కడ మరోనలుగురు పడివున్నారు. అందులో ఒకడు పది సంవత్సరాల పిల్లవాడు, ఒకస్త్రీ, ఇద్దరు పురుషలు. వారిలో పురుషలిద్దరూ దెబ్బలుతగిలి పడిఉన్నారు. స్త్రీ, పిల్లవాడు నిర్జీవంగా పడివున్నారు. గాయాలతో దెబ్బతిన్న ఇద్దర్నీ పరీక్షగా చూస్తున్న ఒక పోలీసు గట్టిగా అరచి "వీడు జట్కాతోలే సాయిబు సార్ !" అన్నాడు ఆతృతగా.

కానిస్టేబుల్‌ను ముందుకు రమ్మన్నాడు యస్. పి.

"వీడిని సరిగ్గా గుర్తించు".

"సరిగ్గానే చూసున్నాను సార్! నేను సంద్యాల స్టేషన్‌లోనే ఆరు సంవత్సరాలు పనిచేశాను. వీడు నూనెపల్లి, నంద్యాల మధ్య జట్కా తోలుతుంటాడు. వీడి తండ్రి వృత్తికూడా అదే! నేను పొరపాటు పడటంలేదు" అన్నాడు స్పష్టంగా.

ఇంతవరకూ ఇక్కడ చెంచువాళ్ళే ఉన్నారనుకున్నాడు. వీడెవడో మైదానం నుండి వచ్చాడు. అసలు పరిస్థితి ఏమిటో యస్. పి. కి బోధపడటం లేదు. వాళ్లూ వీళ్లూ కలసి దొంగతనాలు చేస్తున్నారా ? మిగిలిన వారిని పరకాయించి చూశాడు. వాళ్ళు చెంచుల్లాగే ఉన్నారు వేషంలో. వీడి వేషం కూడా తేడా వుంది. లుంగీ కట్టాడు. లాల్చీ తొడిగాడు. కాళ్ళకు చెప్పులున్నాయి. దగ్గరగా వెళ్ళిచూశాడు. వయస్సు పాతికకు మించివుండదు. బలిష్ఠమైన మనిషి. చేతికీ, కాళ్ళకూ తుపాకి గుళ్లు దూసుకెళ్ళాయి. కంఠం పక్కగా భుజం మీద నుండి నెత్తురు కారుతున్నది.

వీడిద్వారా మరిన్ని రహస్యాలు బయట పడవచ్చుననుకున్నాడు యస్. పి. ఇటువంటి వాళ్లు ఈ కోనల్లో ఇంకా ఎందరున్నారో తెలుసుకోవాలంటే వీడు బతికి ఉండాలి. వీడివల్ల తెలిసే సమాచారం ద్వారా మరెంత ముందుకు పోవచ్చు. చెంచువాళ్ళలాగా వీడు రహస్యాలు చెప్పకుండా గట్టిపట్టు పట్టలేడు. వీడి నుండి నిజం కక్కించడం పెద్ద సమస్య కాదు.

ప్రాణాలతో వున్న చెంచువాడిని బయొనెట్లతో పొడిచిచంపేశారు. బతికిన ఆ మనిషిని వీపున వేసుకోవలసిందిగా పాణ్యంనుండి వచ్చిన గైడ్‌ను ఆదేశించాడు. తప్పనిసరై అతడు వీపున వేసుకున్నాడు. వీరివెంట రావడం బుద్ధి పొరపాటని అతడు నిందించుకున్నాడు. వాళ్లు తోటి మనుషలు. వాళ్ల చావడానికి కారకుడు తానే తాను చూపించకుండా పక్కదారి పట్టించి ఉంటే ఏమీ చేయలేక పోయేవారు. ఆరుగురిని చంపారు. అందులో పదేండ్ల పిల్లాడు, ఇద్దరు ఆడవాళ్లు. చివరకు బతికినవాన్ని కూడా పొడిచేశారు. ఇదంతా తనవల్లనే జరిగింది. రేపు ఇదే చెంచులు మళ్లీ మైదానాలలో తిరగడానికి అవకాశం దొరికి, ఈ ఆరుమంది చావుకు తనే కారకున్నని తెలిస్తే ఎత్తుకెళ్లి సుగాలమ్మ దేవతకు బలిపెడతారని కూడా అతనికి తెలుసు. ఈ సమాచారం ఎప్పుడూ ఎవరికీ తెలియకుండా చేయమని అంజనేయస్వామికి మొక్కుకున్నాడు. సాయిబును వీపున వేసుకొని వారితో పాటు నడిచాడు. రోడ్డు రెండు మైళ్లదూరంలో ఉంది. రోడ్డువద్దకు వచ్చేసరికి మిగిలిన దళాలు కూడా తిరిగివస్తున్నాయి. అందరూ అక్కడ కలిశారు. మనిషిని వేనులో పడేశారు. వేన్లు, జీపులు పాణ్యంవైపు సాగాయి.




చెంచు గూడెంలోని ఒక ఇంటిలో ముసలమ్మ కన్నీరు మున్నీరుగా విలపిస్తున్నది. ఆమె ఎదురుగా నలుగురుపిల్లలు ఏడుస్తూ కూర్చున్నారు. ఒకడికి ఎనిమిదేండ్లు ఉంటాయి. ఓ పాప ఆరేళ్లది. మరోపాప నాలుగేళ్లు-అందరికంటే చిన్నది, ఒకటి న్నర సంవత్సరం ఉంటుంది. ఇప్పుడిప్పుడే నిలబడడానికి ప్రయత్నిస్తూ ఉంది. ఆ పాప బండలమీద పరచిన గుడ్డలమీద పడి నిద్రపోతున్నది. మిగిలిన ముగ్గురూ ముసలమ్మతో పాటు శోక ముద్రలో ఉన్నారు. ముసలమ్మ బండలమీద పడి దొర్లుతూ నోటికీ చేతికీ కొట్టుకుంటున్నది. ఎదురుగా యువకుడు ఒకడు నిలబడి ఉన్నాడు. ఏడ్పులు విని మిగిలిన ఇళ్ళ నుంచి ముదుసలులు, పిల్లలు బయటకు సాగారు. రాత్రి చాలా పొద్దు పోయింది. అయినా ఆ గూడెంలో చాలా రోజులుగా నిద్ర కరువయింది. అందుల్లనే తొందరగా అందరూ లేచి వచ్చారు.

"ఏమయింది?" అని అడిగింది డొక్క వీరన్న భార్య.

వచ్చిన యువకుడు చెప్పాడు-

"సోములు, సోములు భార్య, పెద్దకొడుకు ముగ్గురూ పోలీసుల చేతిలో చచ్చారు."

అప్పటికే బిక్కచచ్చిపోయిన జనానికి ఈ వార్త గొడ్డలి పెట్టులాగా పడింది. కొందరు దుఃఖాన్ని దిగమింగుకున్నారు. కొందరు పోలీసులనూ, పెద్దలనూ శపిస్తున్నారు. పిల్లలు అందరితోపాటు ఏడుస్తున్నారు. సుగాలిగూడేనికి ఈ వార్త తెలిసింది గుంపులు గుంపులుగా వచ్చిపోతున్నారు. ఎవరు వచ్చినా ముసలమ్మను సముదాయించడం సాధ్యం కాలేదు. ఆమెకడుపుకోత ఆమెది. ఒకేకుటుంబంలో ముగ్గురు. మిగిలిన ముగ్గురూ తుమ్మ గూడెం నివాసులు. డెబ్బైఏండ్ల పండు ముదుసలి. పిల్లలను ఏ విధంగా పోషిస్తుంది? పైగా మరీ చంటిపిల్ల. ఆ స్థితిలో ఆమెబాధ మాటలు చెప్పినంతమాత్రాన పోదు. రేపు తమవారి గతి ఏమవుతుందో ఈ సంఘటనద్వారా తెలుస్తున్నది. రేపు మరొకరి మరణవార్త వినాల్సి వస్తుంది.

పిల్లలను డొక్క వీరన్న భార్యకు అప్పగించి లేచి నిల్చుంది ముసలమ్మ.

"ఈ చీకటిలో నువ్వెక్కడకి వెళ్తావే? వద్దు, వద్దు" అంది వీరన్నభార్య.

"చివరిసారిగా నయినా నా కొడుకును చూడనివ్వవే! రేపు ఆ శవాలను తీసుకెళ్లి పోలీసులు కాల్చేస్తారు. ఇక జన్మలో నా కొడుకును చూడలేను" అంది ఏడుస్తూ.

"చనిపోయిన కొడుకు రాడు ముసలమ్మా ! అయిందేదో అయింది. మళ్ళీ నీవెందుకు అక్కడకు? వెళ్లొద్దు".

ఏడ్పుతోపాటు ఆవేశంకూడా వచ్చింది ఆమెకు. "నేను బతికి ఏం చేస్తాను? నా కొడుకు... నా కొడుకు ఏం చేశాడు వీళ్ళను. తినడానికి తిండిలేక పొలాలలో పడి కాపలాకాస్తూ బతుకుతున్న వాడిని తరిమి, తరిమి చంపారు. వీళ్ళ పెళ్లాం పిల్లలూ ఇలాగే ఛస్తారు. వీళ్ల శరీరాల్ని

ఇలాగే కాల్చాలి".

ముసలమ్మ యువకుడితో పాటు కదలింది. పీనుగులవద్దకు చేరేసరికి అర్ధరాత్రి దాటింది. కొండముందు పడి ఉన్న కోడలి శవాన్ని, కొడుకు శవాన్ని గుర్తుపట్టగలిగింది వెన్నెలలో! కొడుకు మీద పడిపోయి ఏడుస్తున్నది. ఆ నిశి రాత్రిలో ఆమె ఏడ్పు వినడానికి ఆ యువకుడూ, చలనంలేని బండలూ తప్ప ఇంకేమీ లేవు.

"పిల్లాడు ఎక్కడ?" అంది కళ్ళు తుడుచుకుంటూ లేచి. యువకుడు ముందుకు దారి తీశాడు. చెట్ల దగ్గరలో పిల్లవాడు పడిఉన్నాడు. ఆపాటికే నరాలు బిగిసిపోతున్నాయి. శరీరం కట్టెలా తయారయింది.

"ఒకపని చెయ్యరా బాబూ!" అంది దీనంగా చూస్తూ.

ఏమిటన్నట్లు ఆమె వైపు చూశాడు.

"ఈ శవాన్ని కూడా అక్కడికే చేర్చు. నా పిల్లలకు నేనే అగ్గిపెట్టి కాల్చి పోతాను. తెల్లారి ఆ నా కొడుకులు నా పిల్లల మీద చేయి వేయడం నాకిష్టం లేదు"

ఆమె దృఢత్వానికి యువకుడు మెచ్చుకున్నాడు. అప్పుడే కాల్చివేయాలని కోసల్లో ఉన్నవారు నిర్ణయించుకున్నారు. వారిబంధువులకు తెలుపకుండా కాల్చకూడదని మనుషుల్ని పంపారు. యువకుడు పిల్లవాడి శవాన్ని భుజం మీద వేసుకొని ముందుకు నడిచాడు. ఇరవైగజాల దూరంలో వున్న ఆ రెండు శవాల వద్దకు తెచ్చి అక్కడ పరుండబెట్టాడు. ఆ సమయానికి ఏడ్చుకుంటూ తుమ్మగూడెం నుండి మిగిలిన శవాల బంధువులు వచ్చారు. అందరూ కలిసి చెట్ల వద్ద పడి ఉన్న రెండు శవాలనూ తెచ్చారు. ఆరు శవాలను కుప్పగా వేశారు. లోయలో పడివున్న కట్టెలను ఏరి తెచ్చి శవాలను కప్పారు. పైన ఎండు గడ్డి ఏరితెచ్చి కప్పి వేశారు. ఇంకా కొందరు వస్తున్నారు. శవానికి ముసలమ్మ నిప్పు పెట్టే సమయానికి ఇరవైమందిదాకా తోడయ్యారు. డొక్క వీరన్న కూడా వచ్చాడు. శవాలను చూడా లన్నారు చూడనివాళ్ళు. తిరిగి కట్టెలు తీశారు. జల్లెడల్లా వున్న శవాల్ని చూశారు. బయొనెట్లతో పొడవబడ్డ శవం చితికిపోయి నీరుకారుతున్నది. తిరిగి ఏడుస్తూ కప్పేశారు. ముసలమ్మ నిప్పు ముట్టించింది. మంటలు ఎర్రగా పైకి లేచాయి.

వారి గుండెల్లో మంటలు కూడా పైకి లేచాయి.

"ఒరే డొక్కోడా! నువ్వేరా నా పిల్లల్ని నాశనంచేసింది" అంది ముసలమ్మ కాలుతున్న చితిని చూసి ఏడుస్తూ.

"ఎవరు ఏం చేశారే! వారిఖర్మ అలా తగలబడి పోయింది. మన పిల్లలు చచ్చారని బాధతో అంటామేగానీ, వీళ్ళను ఎవరూ ఏమీ చేయలేదే! చేసేదేదో ఆ ముండా కొడుకులు చేసి,చంపిపోయారు" అంది తుమ్మగూడేనికి చెందిన మరొక ముసలమ్మ.

"ఇంతటితో పోనిస్తామా? ప్రతీకారం తీర్చుకుంటాం" అన్నాడు యువకుడు ఒకడు. ముసలమ్మ బాధగా నవ్వింది.

"మనకాశక్తి లేదురా! లేదుగనుకే చంపేశారు. మనకూ ఆ శక్తి ఉంటే వాళ్ళు ఇట్లా చేసేవాళ్ళేకాదు".

"బోయ పుల్లయ్యగాడు వచ్చి చూపించాడట! ఇంతకుముందే వివరాలు తెలిశాయి. సూపర్నెంటును వెంట పెట్టు

కొని వచ్చి, ఈ ప్రాంతం చూపించి, చెట్లమధ్యనున్న దేవాలయం చూపించి అందులో జనం ఉంటారని తెచ్చాడట. వాడు చూపించకుండే ఈ పని జరిగేది కాదు" అన్నాడు డొక్కోడు.

"వాడి పనిపట్టాలి మామా! మన వాళ్లను నాశనం చేయించిన ద్రోహి వాణ్ని బతకనివ్వకూడదు."

పీరన్న తల ఊపాడు నోరుమెదప కుండా.

"జట్కాసాయబును పోలీసులు ఎత్తు కెళ్ళారట" అన్నాడు డొక్కన్న. ఎవరూ జవాబివ్వలేదు. ఎదురుగా చచ్చినవాళ్లు కాలుతున్నారు; బతికినవాణ్ని ఎత్తు కెళ్ళారు. వాణ్నికూడా చంపకుండా ఎందుకు తీసుకపోయారో వారికి అర్థం కాలేదు.

"వానినుండి రహస్యాలు లాగించ వచ్చు. అందుకే తీసుకెళ్ళి ఉంటారు. వాడికి మనమున్న స్థావరాలు తెలుసు. మళ్ళీ వాడిని తీసుకవస్తే మన్నల్ని కూడా చుట్టుముట్టుతారు. అందువల్ల వెంటనే స్థావరాలు మార్చివేయండి" అన్నాడు డొక్కపీరన్న.

"ఎన్నిసార్లు స్థావరాలు మారుస్తాం? రోజూ మార్చడమేగానీ బతికే అవకాశం లేనట్లుంది. ఈవిధంగా చచ్చేదానికంటే ఒకటేరోజు మనం కూడా అటో ఇటో తేల్చుకోవడం మంచిది'' అన్నాడు మరోయువకుడు కోపంగా.

పీరిమాటలతో నిమిత్తం లేనట్లు చితి కాలిపోతున్నది. ఆ చితినే చూస్తూ ముస లమ్మ తలను చేతుల్లో పట్టుకొని కూర్చు న్నది ఏడ్చే శక్తి కూడా లేక!

జనం ఎవరితోవ వాళ్లు చూసుకు న్నారు. అప్పటికే మూడవ ఝాము గడిచిపోయింది. తెల్లారితే శవాల కొరకు పోలీసువేన్లు తిరిగి వస్తాయి. ఆవిధంగానే మిగిలిన వారిని వేటాడడానికి ప్రయ త్నాలు చేస్తారు. ఎవరి స్థావరాలకు వారు వెళ్ళిపోదలచుకున్నారు. ముసలమ్మను దారికితెచ్చి విడిచి,తానుకూడా పోతున్నట్లు యువకుడు చెప్పాడు. ఆ యువకుడిని కౌగలించుకొని ఏడ్చింది ముసలమ్మ.

"పాపిష్టి ముండా కొడుకుల కళ్ల పడ కుండా తప్పించుకోండ్రా! మనల్ని తినడానికి వచ్చారు వీళ్ళు" అంది.

ఆమె పట్టువిడిపించుకుని వెళ్ళిపొమ్మని చెప్పి, ఆ యువకుడు తన దారి చూసు కున్నాడు. అక్కడికినుంచి అడ్డలోయగుండా వెళితే సుగాలి గూడెం మూడు మైళ్ళు. చిన్నగా నడుస్తూ సాగింది ముసలమ్మ. ఆదారులన్నీ ఆమెకుక్షుణ్ణంగాతెలిసినవే! ఆగడ్డ మీద పుట్టిపెరిగింది. ఏ అడుగున ఏ రాయి ఉందో చెప్పగలదు. పిరికితనం, భయం అసలేలేదు. గతంలో కావలసినన్ని పోలీసుల బూటుతన్నులు తిన్న శరీరమే! లాకప్‌లలో, జైళ్లలోపడ్డ శరీరమే! ముస లమ్మకు అదోసమస్యకాదు. కానీ చివరి రోజులలో పసి పిల్లలు సిలిచి, చేతికి వచ్చిన ముగ్గురూ నాశనంకావడం ఆమె మనస్తాపానికి కారణమయింది. వారిలో ఏ ఒక్కరు బతికి ఉన్నా ఇంత బాధపడ వలసిన పనిలేదు. ఉన్న నలుగురూ చంటి పిల్లలు. తానుచూస్తే పండుముదుసలి. ఏ విధంగా వారికి ఆహారం సంపాదించి పెట్టాలి?

తెల్లవారిన వెంటనే శవాల కొరకు మూడు వేన్ల నిండా పోలీసులు వచ్చారు. అప్పటికే శవాలు ఆరు కాలి బొగ్గుగా మారాయి. పూర్తిగా కాలలేదు. మసి

బొగ్గుగా ఉన్నాయి. వాటిని చూస్తూనే వారికి వాంతికి వస్తున్నది. అదిమి పట్టుకో లేక కొందరు వాంతి చేసుకున్నారు. వాటిని తీసుకపోవాలా ? వద్దా ? తర్జన భర్జన పడ్డారు. ఎవరు కాల్చిందీ తెలియదు. తెలిపే వాళ్లు ఎవరూ లేరు. ఆ ప్రాంతంలో ఎక్కువ సేపు ఉండడం ప్రమాదకరం. తొందరగా ముగించాలనుకున్నారు. కాలిన శవాలను ఒక వేనులో పడేశారు. వాగులో చేతులు కడుక్కొని మిగిలిన రెండు వేన్లలో పోలీసులు ఎక్కారు.

పాణ్యం స్టేషన్‌లో శవాల్ని దించి పడుకోబెట్టారు. కాలి మసిబొగ్గులుగా రూపంలేకుండా పడి ఉన్న మాంసం ముద్దలను చూసి యస్.పి. దిగ్భ్రాంతు దయ్యాడు. తమ కంటే ముందే రాత్రికి రాత్రే వెళ్ళి ఎవరో కాల్చారు. వివరాల కొరకు ప్రయత్నాలుసాగించారు ఒకవైపు. ఇంకోవైపు పీనుగుల్ని నంద్యాల హాస్పిటల్‌కు తరలించారు. సాయంత్రానికి పీనుగుల గురించి సమాచారం అందింది. అటు తుమ్మగూడెంనుండి, ఇటు సుగాలి గూడెంనుండి శవాల బంధువులను వేన్లలో వేసుకవచ్చారు. అందర్నీ వరుసగానిలబెట్టి అడిగాడు యస్. పి.

"శవాల్ని కాల్చింది ఎవరు?"

"నేనే!" అంది ముసలమ్మ నిశ్చలంగా. "నా కొడుకు, కోడలు, మనుమడు! మిగిలిన దాన్ని నేను! నేను కాల్చుకోక ఎవరు కాలు స్తారు ? నా పిల్లల నేనే కాల్చుకున్నాను".

"మిగిలినముగ్గుర్ని ఎవరుకాల్చారు?"

"వీరితోపాటే వాళ్ళను కూడా నేనే కాల్చాను"

యస్. పి. ఆమెముందుకు వచ్చాడు. అతని కడుపు భగభగ మండుతున్నది. రేపోమాపో చావడానికి సిద్ధంగా ఉన్న కూలిపని చేసుకునే ముసలిది, ఇంతలావు ఆఫీసరును ఎదిరిస్తున్నది. ఎదిరించి మాట్లాడుతున్నది.

"నీవు ఒక్కదానివేనా? ఎవరూనమ్మరు నీ మాట. ఇరవై గజాల దూరంలోఉన్న మూడు పీనుగుల మోసుకొచ్చి కట్టెలు ఏరి కప్పి ఆ చీకటిలో నీవు కాల్చావంటే నేను నమ్మను. నిజంచెప్పు. ఎవరెవరు వెళ్లారు?"

"నేను ఒక్కదాన్నే!"

దవడమీద పడ్డ చెయ్యిదెబ్బకు తూలి దూరంగా పడింది. పడటంలో తలనేలన పర చిన రాతికి కొట్టుకుని రక్తం కారుతున్నది. దగ్గరగావచ్చి, పొట్టమీద కాలేశాడు. "నిజం చెప్పకపోతే తొక్కి నిన్ను చంపు తాను" అన్నాడు కర్కశంగా చూస్తూ.

అతని చూపుకూ, ఆవేశాన్ని చూసి, నిజంగా చంపవచ్చుననుకుంటున్నారు చుట్టూఉన్న పోలీసులు, ఆఫీసర్లు. కాలు అదిమి తొక్కితే ఒకేదెబ్బకు చస్తుంది. పొట్టమీద కాలు బిగుసుకుపోతుంటే నోరు తెరుస్తున్నది ముసలమ్మ. కాలుతీసి, లేప మని చెప్పాడు కానిస్టేబుల్‌తో. కానిస్టేబుల్ ఆమెను లేపి నిల్చోబెట్టాడు.

"మర్యాదగా చెప్పు లేకుంటే ఖతమ్!"

ఆమె పలుకలేదు. మిగిలినవారిని అడి గాడు. ఎవరు కాల్చారో మాకు తెలియద న్నారు. నిజానికి ఆ కాల్చినవారిలో వారూ ఉన్నారు. ముసలమ్మ అందరి బాధ్యతా నెత్తిన వేసుకుంది. తిరిగి తాము బయట పడితే, అందర్నీ అక్కడ చంపేస్తారు. పైగా పారిపోయినవారి వివరాలు తెలు స్తాయి. ఇవన్నీ తెలియకుండా ఉండటానికి తాము చూడలేదన్నారు; ఎవరు కాల్చిందీ తెలియదన్నారు.

సూపరింటెంట్ ఆవేశం రేగింది. ఆవేశం

దిగడంతోపాటు ఆలోచన పెరిగింది. ఇంకా వారిని బాధపెట్టినా నిజాలు బయట పడతాయనే నమ్మకంలేదు. అంత మొండిగా ముసలిది ఎదిరించి మాట్లాడడం అతనిలో కోపం రేపింది. ఆ ముసలిది ఒకే దెబ్బకు ఛస్తుందని అతడికీ తెలుసు. వచ్చి కుర్చీలో కూర్చున్నాడు. పోలీసులు బయట నిలబడ్డారు జరిగే సంఘటనలు చూస్తూ.

ఇన్‌స్పెక్టర్లు, ఎ. యస్. పి. లోపల కూర్చున్నారు. వాళ్ళను తీసుకెళ్ళమని ఆదేశిస్తూనే పోలీసులువచ్చి, బయటకు తీసుకెళ్ళారు.

"ఏం చేద్దాం వీరిని ?" అన్నాడు యస్. పి. స్టేషన్ ఇన్‌స్పెక్టర్‌ను చూస్తూ.

"ఏం చేద్దాంసార్!? విడిచేద్దాం! వీరి వల్ల మనకు ఒరిగేదేమిటి ? ఎంత తన్నినా నిజం బయటపడదు" అన్నాడు అతడు. యస్. పి. తల ఊపాడు.

వాళ్ళను వెళ్ళిపొమ్మని పోలీసులు చెప్పారు. ఎవరితోవన వాళ్లు సాగి



పోయారు.

"రాత్రి పీనుగలవద్ద కాపలాలేదు; పీనుగలను రాత్రికి చేర్చలేకపోయాం. ఈ పీనుగలను చూస్తే పై ఆఫీసర్లు ఏమంటారు ?" అన్నాడూ ఎ.యస్.పి. పైకి చూస్తూ.

"ఎవడు చూస్తున్నాడు వచ్చి? పగలు పోవడానికే భయపడి ఛస్తుంటే, రాత్రి పీనుగలవద్ద కాపు ఎవడుంటాడు? అప్పటికే తిండిలేక ఛస్తున్న పోలీసులు ఏవిధంగా



మోసుకవసారు? పోనీ! ఇప్పుడు మునిగిం నేమిటి? శవపరీక్ష పూర్తవుతూనే నూనె పల్లె బయట పారేయిస్తేసరి" అన్నాడు యస్.పి.

'ఆ విధంగా కొందరు చూచి చస్తారు!' అనుకున్నాడు ఇన్స్పెక్టర్ మనసులోనే.

"ఈ సాయిబుగాడు ఎట్లా ఉన్నాడు? తేరుకున్నాడా?"

"తెలియదు సార్ ! ఫోన్‌చేసి కను క్కుంటాను" లేచి డి.యస్.పి. నంద్యాల హాస్పిటల్‌కు ఫోన్‌చేశాడు.

కట్లు కట్టబడ్డాయనీ, ప్రాణానికి భయం లేదనీ, రక్తం చాలా పోయిందనీ డాక్టరు చెప్పాడు.

"వాడిని రెండుగంటలసేపు ఇక్కడకు పంపడానికి అవకాశముంటుందా?"

"కదిలించడం మంచిదికాదు. మాట్లాడ వలిస్తే ఇక్కడికేవచ్చి మాట్లాడండి."

"కదిలించాలంటే కనీసం ఎన్ని రోజులు పడుతుంది?"

"మరో రెండు రోజుల వరకూ కదిలించడం మంచిది కాదు."

మౌత్‌పీస్‌కు చెయ్యిఅడ్డుపెట్టి యస్.పి.తో అన్నాడు-

"ఏం చేద్దామంటారు. వెళ్లి మాట్లాడదామా?"

"వద్దు; హాస్పిటల్‌లో ఎలా మాట్లాడతాం! రేపు సాయంత్రం నంద్యాల పోలీసు స్టేషన్‌కు ఒక అర్ధ గంట పాటు తరలిస్తాడేమో అడగండి".

డి.యస్.పి. డాక్టరుతో మాట్లాడాడు అరగంట పర్మిషన్ కొరకు.

"ఎల్లుండి ఉదయం పదిగంటలలోగా పేషెంటును ఇక్కడి నుండి కదిలించే ప్రసక్తే లేదు" అన్నాడు విసుగు పడుతున్న డాక్టరు. డాక్టరు విసుగు చూసి ఫోన్ పెట్టేశాడు.

కానిస్టేబుల్ లోపలకు వచ్చి, కాఫీ టేబుల్‌మీద పెట్టాడు. కెటిల్ నుండి గ్లాసుల్లోపోసి, ఒక్కొక్కరికే అందించాడు. కాఫీ తాగుతూ పై కప్పువంక చూస్తూ ఆలోచిస్తున్నారు. ఈ రోజు దండయాత్రకు పోవడం మానుకున్నారు. అప్పటికే ఒంటిగంట కావస్తున్నది.

* * *

మంగళగిరి బస్టాండు దగ్గరలో టాక్సీలు నిల్పినచోట ఖాదర్ నోటికి వచ్చినట్లు పేలుతున్నాడు - తన అంబాసిడర్ కారు బోనెట్ మీద కూర్చుని. అతని చుట్టూ టాక్సీ డ్రైవర్లు, క్లీనర్లు ఉన్నారు. ఖాదర్ వారికి కన్పించక పదిరోజులకు పైగా అయింది. అతడూ, అతడి కారూ ఏమయిందో వారికి తెలియడం లేదు. మంగళగిరి చేరి వారం రోజులయినా కారుతోలడం మానుకున్నాడు. కారు ఇంటి వద్ద పెట్టి, తప్పతాగి, చెడతిని, భార్యను కొట్టి, తిట్టి ఇంట్లో రోజూ చెంచునాటకం వేస్తున్నాడని డ్రైవర్లకు తెలుసు. ఎప్పుడు చూసినా వంద రూపాయలనోట్లు మారుస్తున్నాడు. 'ఇంతడబ్బు పీడికి ఎటావచ్చింది?' అనేది వారి అనుమానం. భార్యకు అతడి వాగుడువల్ల తెలిసింది. కానీ, భయంతో బయటకు చెప్పలేకపోయింది.

ఆ రోజు ఉదయం ఎవరోవచ్చారు. ఖాదర్‌తో మాట్లాడి అందరూ కలిసి కారు ఎక్కి విజయవాడకు వెళ్లారు. తిరిగి ఖాదర్ ఒక్కడే వచ్చాడు. అతని స్నేహితుడు రామన్న రోడ్డుమీదనే కారును అటకాయించడంతో రోడ్డు పక్కన నిలిపి దిగాడు.

"ఏరా ! కన్పించడంలేదేం? భలే హుషారుగా ఉన్నావే?" అన్నాడురామన్న.





ఖాదర్ నవ్వి, రామన్న చెయ్యిపట్టుకొని బార్‌లోకి లాక్కుపోయాడు. కాఫీ తాగడానికి భయపడేవాడు, బార్‌లోకి లాక్కుపోతుంటే ఆశ్చర్యంగా చూస్తూ వెళ్లాడు రామన్న. లోపల కూర్చోబెట్టి,జిన్ తెప్పించాడు. ఇద్దరూ తా గ డా ని కి పూనుకున్నారు.

"మనిషివి హఠాత్తుగా మారావేమిట్రా? ఏమిటి కథ?" అన్నాడు రామన్న.

"మనిషి సుఖపడటం నేర్చుకోవాలిరా! ఎల్లకాలం తినడానికి తిండిలేక ఛస్తే ఎట్లారా ?" అన్నాడు నవ్వుతూ ఖాదర్ సీసా నోటివద్ద పెట్టుకొని.

"మాకూ చెప్పరా చంపక ! మేము కూడా సుఖపడతాం కదా! నీవొక్కడివే రహస్యం దాచిపెట్టుకోవడమెందుకు?"

ఖాదర్ కళ్లు తాటించి,ముక్కుపుటాలు ఎగురవేసి "రేయ్ భాయ్! నీవు నాకు నమ్మకమైన స్నేహితుడవని చెబుతున్నాను. ఎక్కడైనా చెబితే నిన్నూ, నన్నూ ఇద్దరినీ చీల్చేస్తారు. నీవు కూడా ఇకముందు మాతో కలిసిరా! లక్షణంగా కొ త్త కొ త్తనోట్లు సంపాదనే. ఆనుకో !" అన్నాడు ఖాదర్ నవ్వుతూ. చెవిలో రహస్యంగా చెప్పాడు.రామన్న ఆశ్చర్యపోతూ ఖాదర్‌వైపు చూశాడు.

వారం రోజులుగా ఖాదర్ పరిస్థితిని విన్న పోలీసులు అనుమానపడి నిఘా వేశారు. విచ్చలవిడిగా డబ్బు ఖర్చుపెడుతున్నట్లు డ్రైవర్లూ, క్లీనర్లూ చెప్పారు. కారు తోలడంలేదు. కారు తోలేటప్పుడే సరిగా తిండిదొరక్క బాధలుపడే ఖాదర్, పదిరోజులుగా కారుతోసహా ఊరిలో లేక పోవడం, వారం రోజులుగా వచ్చినా కారు నడపకపోవడం, సారాయి తాగడానికి–గతిలేనివాడు బార్లలో వందరూపాయల నోట్లు మార్చుతూ జల్సాగా తిరగడం! ఇవన్నీ పోలీసులకు అనుమానాలు కలిగించాయి. తోటి డ్రైవర్లు ఇచ్చిన తేదీ ప్రకారం చూస్తే బ్యాంకు దోపిడీ రెండు రోజుల ముందునుంచీ కారూ, ఖాదరూ మంగళగిరిలో లేరు. ఆ బ్యాంకు దోపిడీకి వాడిన కారు అంబాసిడర్. దాని నంబరు ఎవరికీ తెలియదు. నల్ల అంబాసిడర్ అది బాంక్ మేనేజరు చెప్పాడు. కాని, ఖాదర్ అంబాసిడర్ కారు లేతఆకుపచ్చది. దోపిడీ జరిగే టైముకు రెండురోజులుగా ఊరిలో లేదు గనుక,రంగుమార్చడం పెద్దసమస్య కాదనుకున్నారు. ఈ అనుమానాలన్నీ పోలీసులకు ఏర్పడడంతో ఇన్‌స్పెక్టర్ డ్రైవరు రామన్నను పిలిచి, కూపీ లాగమని అడిగాడు. రామన్న అందుకు అంగీకరించి ఆరోజు ఖాదర్ ఇంటికి వెళ్తే కారుతో వెళ్లిపోయాడని భార్య చెప్పింది. బజారుకు వస్తే విజయవాడ వైపు వెళ్ళిందని చెప్పారు. వచ్చేవరకూ రోడ్డు మీద పడిఉండి, వస్తూనే పట్టుకొని కావలసిన సమాచారం కొరకు ప్రయత్నించాడు. అతనికి అనుమానం కలగకుండా మాట్లాడి ధైర్యంచెప్పి, తానుకూడా వారిలో కలుస్తానని మాటఇచ్చి రామన్న వెళ్లిపోయాడు. రామన్న వెళ్ళిపోతూనే బయటకు వచ్చి, కారు బోనెట్‌మీద కూర్చుని వదరుతున్నాడు దోస్ ఎక్కువ కావడంతో. చాలాకాలంగా కన్పించని సహచరుడు కన్పించడంతో డ్రైవర్లు, క్లీనర్లు చుట్టుకున్నారు.వాళ్లు అడుగుతున్నారు. తాగిన మత్తులో అతడు ఏదో చెబుతున్నాడు.

అంతలోనే పోలీసు వేను వచ్చి అక్కడ నిలబడింది. వారితో పాటు రామన్న కన్పించడంతో ఖాదర్ నిషా దిగింది. బోనెట్‌మీద నుండి దూకి పారి

పోవాలనుకున్నాడు. కానీ, దూకినవాడు ఆ నిషాలో మరి లేవలేదు. పోలీసులు లేపి వేను ఎక్కించారు. కారు తీసుకురమ్మని రామన్నకు చెప్పారు.

"ఏంటిగురూ! ఏంటికథ?" అన్నాడు ఆదుర్దాగా మరో డ్రైవర్.

"మనవాడు పెద్ద హాండులేరా నాయనా ! బాంకులు కొల్లగొడుతున్నాడు" అన్నాడు స్టార్టుచేసి పోనిస్తూ డ్రైవరు నోరుతెరచి పోతున్న కారువైపు చూస్తున్నాడు.

ఇన్‌స్పెక్టర్ ముందుకు ఈడ్చుకు వచ్చి నిలిపారు ఖాదర్‌ను పోలీసులు.

"ఏందయ్యా! ఏంది ఈ దౌర్జన్యం?" అంటున్నాడు గింజుకుంటూ. నిలబడ్డ ఖాదర్‌ను పైకీ - కిందకూ చూశాడు ఇన్‌స్పెక్టర్. ఉలెన్ సూటులో మెరిసి పోతున్నాడు ఖాదర్.

"ఎవరెవర్రా బాంకు దోచింది?" అన్నాడు దగ్గరగా వస్తూ.

"బ్యాంకా ! ఏమో నాకు తెలియదు" అన్నాడు చేతులు వెల్లకిలా తిప్పి మత్తులో ఉన్న ఖాదర్. గడ్డంక్రింద గుద్దాడు ఇన్‌స్పెక్టర్. కింద పడినవాణ్ణి తొడమీద తన్నాడు. జుట్టు పట్టుకొని చెంపలు పగిలేలా బాదాడు. పోలీసులు నిలబడి చూస్తున్నారు. రామన్న కారు పోలీసు స్టేషన్ ముందు పెట్టి లోనికి వచ్చాడు.

"చెప్పు...చెప్పు...చెప్పు" బాదుతున్నాడు.

ఖాదర్ ఏడుస్తూ కాళ్ళుపట్టుకున్నాడు. "చెబుతాను; చెబుతాను సార్! చంపకండి" అన్నాడు గొంతు పగిలేలా అరుస్తూ.

"చెప్పు" అన్నాడుఇన్‌స్పెక్టర్ టేబుల్ మీదకూర్చుంటూ. రైటర్ కాగితాలు సిద్ధంగా పట్టుకున్నాడు రాయడానికి.

"స్టూవర్టుపురం ముఠా నాయకుడు గంగులు వచ్చి కారు కావాలని అడిగాడు. అంతకు ముందే అతను నాకు తెలుసు. నా దారిద్ర్యంవల్ల ఇక లాభం లేదని వారితో కలిసేదానికి నిశ్చయించుకున్నాను. వారు తెచ్చే ఏ దానిలోనయినా సమాన వాటా ఇస్తే కారు తీసుకొని వస్తానన్నాను. వాళ్ళు ఒప్పుకున్నారు.

బ్యాంకు దోపిడీ వివరాలు చెప్పాడు. స్థానికుడయిన ఒక హోటల్ యజమాని ద్వారా వివరాలు సేకరించామనీ, ఇందులో అతడికీ వాటా ఉంటుందనీ, మొత్తం పదివాటాలు పంచాలనీ చెప్పాడు. ఇరవై లక్షలకు పైగా ఉంటుందన్నాడు. రెండు రోజుల్లో రెండులక్షలు వస్తుందని ఆశించాను. పైగా కారు నడపడం వరకే నా డ్యూటీ! మిగిలిన పనులతో నాకు సంబంధంలేదు. కారుకు రంగు మార్పించి నల్లరంగు స్ప్రే చేయించారు. బాంకు రోజు వాళ్ళు ఎనిమిదిమంది, నేను తొమ్మిదిమందిమి కలిసి బ్యాంకు వద్దకు వెళ్ళాము. నేను బయట కారులో ఉన్నాను. వాళ్లు లోపలకు వెళ్ళారు. ఆరోజు పని పూర్తి చేశాము. మళ్ళీ కారు స్ప్రే చేయించి, మామూలు రంగుకు తెచ్చారు. ఎక్కడికక్కడ కలరు, రిజిష్టరు నెంబరు మార్చాలని నాకు సలహా ఇచ్చారు. రెండవరోజు రాత్రి అదేదో దేవాలయం... దాని పేరు కూడా నాకు తెలియదు. అక్కడికి తీసుకెళ్ళారు. నిచ్చెన, తాళ్ళు తీసుకొని కారుదిగి దేవాలయం వెనుక భాగానికి వెళ్లారు. లోపల వాళ్లు ఏమి చేసిందీ నాకు తెలియదు. మూడుగంటల తరువాత సంచులతో బయటకు వచ్చారు. అక్కడినుండి మకాం మార్చాము. కడప




ఏరియాకు తీసుకెళ్ళారు."

"దేవాలయంలో ఆడపిల్లను చెర చింది నీకు తెలియదా?"

ఖాదర్ ఆశ్చర్యంగా నోరుతెరచి ఇన్ స్పెక్టరు వైపు చూశాడు. తల అడ్డంగా ఊపి, "ఇంతవరకూ నాకు తెలియదు" అన్నాడు.

"పేపర్లు చూడవా."

"నాకు చదువురాదు"

"ఎవరయినా అనుకుంటే వినలేదా?"

"నాదగ్గర ఆ విషయాల గురించి ఎవరూ, ఎప్పుడూ అనలేదు"

యస్.పి. కి ఫోన్ చేశాడు ఇన్స్పెక్టరు. గుంటూరు నుండి యస్. పి. వచ్చాడు. ఖాదర్‌తో వివరాలు తెలుసుకుని, ఎనిమిదిమంది పేర్లకొరకు ప్రయత్నించారు. నాకు తెలియదన్నాడు ఖాదర్. అంతవరకూ నిజం చెప్పినవాడు అబద్ధం చెప్పడం లేదనుకున్నారు. గంగులు కొరకు వేట ప్రారంభించవలసిందిగా యస్. పి. ఆదేశించాడు. ఇంటర్ కమ్యూనికేషన్‌లో కర్నూలుకు తెలిపారు వివరాలు.

కర్నూలు నుండి పాణ్యంలో ఉన్న యస్.పి.కి ఈ వార్త తెలిసే సమయానికి చెంచువాళ్ల మీద తిరిగి దాడి చేయడానికి వ్యూహం పన్నుతున్నారు. అనుకోకుండా వచ్చిన ఈ వార్త వింటూనే అక్కడున్న ఆఫీసర్లంతా నిశ్చేష్టులైపోయారు. ఇంతవరకూ వారిచూపు చెంచువాళ్ల మీద ఉంది. చెంచులు తప్ప మరెవరూ చేసిఉండరని వారి విశ్వాసం. అంత నమ్మకంతో ఉన్న వారికి, ఎవరు మరో విధంగా చెప్పినా నమ్మే స్థితిలో లేరు. కానీ, ఆధారాలతో మనిషి దొరకడంతో నమ్మక తప్పలేదు.

వెంటనే పంపించవలసిందిగా గుంటూరు యస్.పి.కి తెల్పాడు. పంపుతున్నట్లుకూడా అటువైపునుండి తెల్పారు. గంగులు రూపురేఖలతో గల ఫొటోలు, వేలిముద్రలు కూడా పంపుతున్నట్లు తెల్పారు. గంగులు ఏ పరిసరాలలో ఉన్నదీ ఇంకాతెలియదనికూడా చెప్పారు.

మరుసటి రోజు ఉదయం ఏడు గంటలకు గుంటూరు నుండి పోలీసువేను, వెనుక పోలీసు జీపు, దొంగతనానికి ఉపయోగించబడిన కారూ వచ్చాయి. పాణ్యం పోలీసు స్టేషనులో ఖాదర్‌ను దించారు. ఖాదర్‌లో నిషా ఏమీలేదు. అతనికి ఇప్పుడు ఎటు చూసినా పోలీసులే కన్పిస్తున్నారు. రామన్నకు చెప్పి తాను నాశనమయ్యాననుకున్నాడు. రామన్నకు చెప్పక పోయినా దొరకక తప్పని పరిస్థితి అని అతనికి తెలియదు. ఖాదర్‌ను మధ్యన కూర్చుండబెట్టి చుట్టూ ఆఫీసర్లుచేరి ఇంటరాగేషన్ ఆరంభించారు చెప్పవలసిన వివరాలు మంగళగిరిలోనే చెప్పాడన్నా వినిపించుకోలేదు. గుంటూరు పోలీసులు వెళ్లిపోయారు. మంగళగిరిలో చెప్పిందే తిరిగి రిపీట్ చేశాడు. అంతకు మించి తనకు తెలియదన్నాడు.

"బాంకు ప్రాంతం, దేవాలయాన్ని గుర్తిస్తావా?"

తల ఊపాడు ఖాదర్. వ్యానులో వేసుకొని బాంకువద్దకు వెళ్లారు. దొంగను తెచ్చారని తెలిసి, జనం తండోపతండాలుగా వచ్చారు. వారిని అదుపు చేయడం కష్టమయింది. ఖాదర్ కారు నిలబెట్టిన ప్రదేశం చూపించాడు. మేనేజరు మీదకు ఎక్కడ నిలబడి పిస్తోళ్లు గురిపెట్టారో చూపాడు. తాను ఏవిధంగా వారికి సిగ్నల్ ఇచ్చాడోకూడా తెలిపాడు. ఆ తర్వాత అక్కడినుండి కర్నూలు వైపుగా వెళ్లారు.

పగలు బేతంచర్లలో కొంతసేపున్నారు. ఆ తర్వాత కర్నూలుకువచ్చి హోటల్లో భోజనం చేశారు. తొమ్మిది మందీ విస్కీ తెచ్చుకొని, కారులోనే కూర్చుని తాగారు. అక్కడి నుండి గుడి వద్దకు వచ్చారు. ఖాదర్ కారుని ఆపిన చోటు చూపాడు. అక్కడే తాను కారులో కూర్చుని సిగ రెట్లు తాగుతున్నానని చెప్పాడు. ఐరన్ నిచ్చెన, తాళ్లతో ఎటువైపు వెళ్లిందీ చూపించాడు. దాదాపు ముడునాలుగ్గంటల ప్రాంతంలో తలుపులు తెరచుకొని నిచ్చెన, తాళ్లు, సంచులు మోసుకొని వచ్చి కారు పైన వేసి కట్టారని చూపించాడు. లోపలకు తాను వెళ్లలేదుగనక, లోపల వివరాలు తనకు తెలియవన్నాడు. కానీ, అరుస్తున్నట్లు కేకలు కొంతసేపు విన్పడ్డాయని చెప్పాడు. అక్కడినుండి కారు నూనె పల్లెకు వచ్చింది. నూనెపల్లె సెంటర్లో టీ తాగారు. అళ్లగడ్డ చిన్నటౌను గనక అక్కడ ఎవరూ అనుమానించరని ఆలోచించి, అక్కడే ఒక హోటల్లో గదులు తీసుకొని గడిపామన్నాడు. తమ కారును చాలా మంది చూసినా, ఎవరూ దాని విషయం పట్టించుకోలేదన్నాడు. అక్కడి నుండి మరుసటిరోజు రాత్రి కడపకు వెళ్లారు. రాత్రికి రాత్రే కారురంగు స్ప్రే చేయించారు. స్ప్రేచేసేచోట కారు గురించి వివరాలడిగితే 'మద్రాసు కారు' అని చెప్పారు. వారం రోజులు తిరుపతిలో ఉన్నారు. ఆ తర్వాత తిరిగి ఎవరి గ్రామం వాళ్లు చేరారు. సగటుగా లక్ష రూపాయలు డబ్బు ఇచ్చారు. వస్తువులు మొత్తం అమ్మినతరువాత మిగిలినడబ్బులు ఇస్తామన్నారు. ఆడబ్బు తెచ్చి బాంకులో వేసుకున్నాడు మంగళగిరిలో. కొంతడబ్బు దగ్గర ఉంచుకొని, హాయిగా జీవితం గడుపుతున్నాడు.

ఖాదర్ చెప్పిన తేదీలు, వివరాలు ఎక్కడా తొట్రుపాటు పడకుండా చెప్పాడు. చెప్పకుంటే ఎముకలు విరుగుతాయని తెలుసు. పైగా హత్యకేసులో, మానభంగం కేసులో ముద్దాయికాదు. మిగిలిన వాటిల్లో నయినా సహకారి మాత్రమే! కొంతయినా శిక్ష తగ్గుతుందని ఆలోచించి వివరాలన్నీ విశదంగాచెప్పాడు. బంగారం ఏంచేశారన్న విషయం అతడికి తెలియదు. అది చెప్ప గలవాడు గంగులు మాత్రమే! అతడి కొరకు రాష్ట్రమంతటా హెచ్చరికలు చేశారు గుప్తులతో.

కేసు ఒక కొలిక్కి వచ్చినందుకు ఆఫీసర్లు సంతోషించారు.

* * *

ఖాదర్‌ను తీసుకువచ్చిన మరుసటిరోజు యస్.పి. ఆఫీసులో కూర్చొనిఉండగా పుల్లయ్య పరుగెత్తుకుంటూ వచ్చాడు. ఆయాసంతో నమస్కారం చేసి "సార్! కొంతమంది ఇక్కడికి మూడుమైళ్ల దూరంలోనున్న కొండమీద వంటచేసు కుంటూ ఉన్నారు" అన్నాడు.

"ఎంతమంది ఉంటారు?"

"ఆరు, ఏడుగురి కంటే ఎక్కువ ఉంటరు సార్!"

వెంటనే ఇన్‌స్పెక్టరును పిలిచాడు. రెండు వ్యాన్లలో పోలీసులను నింప మన్నాడు.

"వ్యాన్లు అక్కడికి పోవాలంటే కష్టం సార్! రోడ్డుమీద నిలిపి పోవలసిందే!" అన్నాడు పుల్లయ్య. యస్. పి. తల ఊపాడు.

యాభైమంది పోలీసులను సిద్ధం చేశారు. రెండు వ్యానులు, రెండు జీపులు

కర్నూలు రోడ్డు వెంట కదిలాయి. సుగాలి మెట్ట దాటిపోతున్న వాహనాలను చూసి పిల్లలు నిక్క మొహంతో నిలబడ్డారు. మళ్లీ ఎవరికి మూడిందోనని పెద్దలు కలవరపడుతున్నారు.

వ్యాన్లు ఇరవై మైలురాయివద్ద ఆగాయి. పట్టమయిన ఎత్తు కొండలు. పెద్ద పెద్ద గుండ్లు. ఆ గుండ్ల వెను కమనుషులున్నా కన్పించడం కష్టం.

పుల్లయ్యను అనుసరించారు వెనుక పోలీసులు. లోయగుండా సాగారు. సన్నని కాలిబాట. కాలిబాటకు ఇరువైపులా తుమ్మకంప. లోయనిండా తాటిచెట్లు. అక్కడక్కడ ఈతచెట్లు. వాగు రెండు ఒడ్లమీద చాపలకు పనికివచ్చే జంబు దట్టంగా పెరిగిఉంది. లోయ వెడల్పు లేదు. ఆ కొంచెం వెడల్పులోనే పొలాలు చేస్తున్నట్లు సాక్ష్యాలుగా దున్ని పైరు చల్లబడి ఉన్నాయి. జొన్న పొలం నడుముల ఎత్తు పెరిగి ఉంది.



జాగ్రత్తిగా నడుస్తున్నారు తుపాకులు కాయపెట్టి. కొండమీద ఎందరున్నారో తర్వాత సంగతి. లోయలో ఉండి దాడి చేస్తారేమోనని వీరి భయం. లోయదాటి కొండమీదకు దారి తీశాడు పుల్లయ్య్య తీతి నిదానంగా నడుస్తూ.

"నిదానంగా రావాలి సార్! రాళ్లు చప్పుడవుతే వెంటనే పారిపోతారు" అన్నాడు.

"పారిపోయే దారులున్నాయా?"

"అటువైపు దారులున్నాయి సార్! మనం కూడా అటువైపునుండి వస్తే వాళ్ళు పసిగడతారని ఇటు తిరిగి రావలసి వచ్చింది."

పోలీసులు పైకి చూస్తూ నడవడంలో రాళ్లు బూట్లకు కొట్టుకుంటున్నాయి. ముసలి పోలీసులు ఇద్దరు వెనుకపడి ఆయాసంతో ఎక్కుతున్నారు. ఫర్లాంగు ఎత్తున ఆ కొండ ఎక్కడానికి పదిహేను నిమిషాలు పట్టింది. ఒక రాయి ఆధారం చేసుకొని అందరూ కలిసే వరకూ కూర్చున్నారు. పైన మాటలు విన్పిస్తున్నాయి. ఎంద రున్నదీ తెలియడంలేదు. తల ఎత్తి చూస్తే పసిగడతారేమోనని తల ఎత్తకుండా కూర్చున్నారు. అందరూ కలిసి వచ్చిన తరువాత ఒక్కపెట్టునకేకవేసి ముందు కురికారు.

అన్నం వండుకుని అప్పుడే తిన డానికి సిద్ధమవుతున్నారు అక్కడివాళ్లు. వెడల్పాటి రాళ్లమీద నీళ్ళతో శుభ్రంగా తుడిచి, రాతిమీద అన్నం పోసుకొని ఉప్పూ, మిరపకాయ నలుచుకొని తినడానికి అన్నం కలుపుకుంటున్నారు.

హఠాత్తుగా మీదకు వచ్చిన వారికి కనీసం విల్లంబులు అందుకోడానికి గానీ, రాయి చేతికి తీసుకునే తీరిక గానీ లేదు. అన్నం అలాగే బండలమీద విడిచి పరుగు తీసుకున్నారు. మొత్తం ఆరుగురు. అందులో ఒకరువీరమ్మ. కొండ పైన చాలా దూరం చదునుగా ఉంది. పరుగెత్తడం సాగించారు. వీళ్లు వెంటపడ్డారు. చీరతట్టు కొని కింపపడింది వీరమ్మ. వెంటనే లేచింది. వాళ్లు దగ్గరవుతున్నారు. తన వాళ్లు పారిపోతున్నారు. తిరిగి దొరికితే జరిగేఘోరం తెలుసు. ఈసారి మాటలతో విడువరు. తప్పించుకున్నారనే కసువు మంటతో వాళ్ల ఉన్నారు. ముందు పరుగు పెడుతున్నవారు కేకలేస్తూ పరుగెత్తు తున్నారు. దూరంగా దళాలున్నాయి. వారందరూ కలిసి వచ్చేలోపల తాను పట్టు బడుతుంది. తర్వాత అందరూ కలిసి దాడి చేసి విడిపిస్తారన్న నమ్మకం లేదు వీరమ్మకు. కళ్లనిండా నీరు తిరిగింది. 'దొరకకూడదు' అనుకుంది.

పక్కనే బ్రహ్మాండమైన లోయ. వెనుకా ముందూ ఆలోచించలేదు. లోయలోనికి దూకింది. భయంకరమైన కేక! కొండలు మార్మోగుతూ ప్రతిశబ్దాలు ఇచ్చాయి.

భయంకరమైన అరుపు విన్నపోలీసులు నిశ్చేష్టులై నిలబడ్డారు.

యస్. పి. ముందుకు పొమ్మని ఆదేశి స్తుంటే ముందు వెళ్తున్నవారిని తరుము కుంటూ పోసాగారు.

"సార్! ఇంకపోవద్దు!" అన్నాడు గైడు పుల్లయ్య.

పుల్లయ్యవైపు చూశాడు యస్. పి.

"ముందు కొండ దిగువభాగం, లోయ ఉంది. ఆ లోయలోకి దిగితే పరిస్థితులు ఎట్లా ఉంటాయో చెప్పలేం. వీళ్ళు కేక లేస్తూ పరుగిడుతున్నారంటే, లోపల జనం ఉండవచ్చు. సహాయంగా కేకలేస్తుండ వచ్చు. అందరూ కలిస్తే అక్కడ మనం




దెబ్బ తినవచ్చు. అందువల్ల వెనుతిరగడం మంచిది."

పుల్లయ్య మాట తిరస్కరించి, అతన్ని నాలుగు తిట్టి ముందుకుసాగాడు యస్. పి. అతనివెంట పోలీసులు నడిచారు.

పరుగెత్తిన ఐదుగురూ లోయ దిగువకు చేరారు. వారివెంట పరుగెత్తిన పోలీసులూ లోయ దిగువలో చేరారు. లోయచుట్టూ చెంచులు కమ్ముకుంటున్నారు. యస్. పి.కి అర్థమయ్యేలోగానే కమ్మడం పూర్తవుతున్నది. మధ్యన ఏకాకులుగా నిలబడి పోవలసి వస్తున్నది. పుల్లయ్యను చూశాడు యస్. పి. పుల్లయ్య పోలీసుల వైపు చూడడంలేదు. చెంచువాళ్లవైపు చూస్తున్నాడు. ఈ రోజు తనను చంపకుండా వాళ్ళు విడువరు. రెండు రోజుల కిందట చంపబడ్డ ఆరుగురు,ఇప్పుడు చచ్చినవ్యక్తి మొత్తం ఏడుగుర్ని తన సహకారంతోనే పోలీసులు దాడిచేసి చంపారు. ఆ కడుపు మంట వారికి ఉంటుంది. పోలీసులు వాళ్లను వాళ్ళు రక్షించుకోవడమే కష్టం. ఇక తనను వాళ్ళు రక్షించగలరా? పుల్లయ్య కాళ్ళు చేతులు చల్లబడుతున్నాయి.

యస్. పి. దళాలను హెచ్చరించాడు. ఆ సమయంలో ఏమాత్రం నిర్లక్ష్యంచేసినా తమ బతుకు ఇక ఇంతటితో ఆఖరని ఆయనకు తెలుస్తున్నది. ఆడపిల్ల అలా చావడమే తమకు శాపమయిందనుకుంటున్నాడు. పుల్లయ్య చెప్పినట్లు వెనుకకు మరలిఉంటే బాగుండేది. ముందుకురావడం పొరపాటే! ఒక్కోసారి గైడు మాటలు వినకుండాపోతే జరిగే అపకారం ఇటువంటిదే అయిఉంటుందనుకున్నాడు.

పోలీసులను ఫైర్ చేయవలసిందిగా ఆజ్ఞాపించాడు. అటు చెంచులు వడిసెల్లో రాళ్లు పెట్టి, పెద్దగుండ్లను బాటుచేసుకొని విసురుతున్నారు. విల్లు సారించి అంబుల పొదినుండి లాగి వదుల్తున్నారు. యస్.పి. భుజంనుండి అంబు దూసుకుపోయింది. బ్లేడుతో కోసినట్లు సర్రున తెగింది. వాళ్ల ప్రాణాలతో విడుస్తారన్న నమ్మకం యస్. పి.కి పోయింది. ఇక్కడే తన సమాధి కడతారేమోననిపించింది. ఎప్పుడూ జీవితంలో భయం ఎరగని యస్. పి. నిలువునా కంపించిపోయాడు. తెట్టు తెట్టుగా జనం వచ్చి పడుతున్నారు. వారినుండి ఏదో విధంగా తప్పించుకోక పోతే చావు ఖాయం. తనతోపాటు యాభై మంది పోలీసులు, ఎనిమిదిమంది ఆఫీసర్లు! పోలీసులు వెనుకడుగు వేస్తూ చెంచుల్ని ముందుకు రాకుండాచేయటానికి తుపాకులు పేలుస్తున్నారు. రామ-రావణ యుద్ధంగా తయారయింది. పోలీసులలో చాలామంది దెబ్బలు తిన్నారు. వీరి తుపాకి గుండ్ల వలన ఎదుటి పక్షం ఎంతమంది దెబ్బ తిన్నారో వారికి తెలియదు. అటో ఇటో తేల్చడమనే పద్ధతిలో చెంచులు నిలబడ్డారు. రోజూ పోలీసులు వచ్చి దాడి చేస్తుంటే ఓర్చుకోలేకపోతున్నారు. ఏ విధంగానూ బతుకనిచ్చేలా లేరు. చచ్చే టప్పుడు చంపిచద్దామన్న తెగింపువచ్చింది.

పోలీసులు పరుగులాంటి నడకతో వెనుతిరిగి పోవడానికి ప్రయత్నిస్తూ, నిలబడి కాల్పులు చేస్తున్నారు. కొంత దూరం పరిగెత్తడం, వెంట పడకుండా ఉండడానికి కాల్పులు జరపడం, తిరిగి పరుగెత్తడం, కాల్పులు జరపడం - ఈ పోరాటం మధ్య పుల్లయ్య ఏమయ్యాడో పోలీసులు పట్టించుకోలేదు. ముందు లోయ దాటి రోడ్డు ఎక్కా[illegible]



పుల్లయ్యను గురించి ఆలోచన.

గంటసేపు పోరాడిన తర్వాత గట్టు చేరారు. ఆనోగా ముగ్గురు పోలీసులు దారిలోనే పడ్డారు. ఎత్తుకు రావడానికి కూడా వీలులేదు. పుల్లయ్య కన్పించ లేదు. వ్యాన్దగ్గరకు వచ్చి ఆయాసంతో ఒగరుస్తూ నిలబడ్డారు అందరూ.

అందరూ అంతో ఇంతో దెబ్బతిన్న వాళ్ళే. దెబ్బలు తిన్నందుకు బాధపడటం లేదు. [illegible] ఒడ్డుకు వచ్చినందుకు సంతోషిస్తున్నారు. ఇక చిక్కుబడి పోయిన ముగ్గురు పోలీసులూ, పుల్లయ్య గతి అంతేనని వారికి తెలుసు. అటు వైపు ఎంత నష్టమో వీళ్లకు వివరాలు తెలియదు. చనిపోయిన వారిని విడిచిపెట్టి పోవడమా లేక వ్యానులో చేర్చడమా? తిరిగి లోయలోకి దిగే ధైర్యం ఎవరికీలేదు. ఎంతతొందరగా ఆ ప్రాంతందాటితే అంత క్షేమమనుకుంటున్నారు. చెంచు వాళ్ల ఎవరూకన్పించడంలేదు. అప్పుడే అందరూ సర్దుకుంటున్నారు.



శవాల విషయం విడిచిపెట్టి వ్యాన్లు, జీపులు ఎక్కి పాణ్యం చేరారు. స్టేషన్ ఇన్‌స్పెక్టర్ వీరి అవతారం చూసి ఆందోళన చెందాడు. అందరికీ ప్రాథమిక చికిత్స చేయడానికి డాక్టర్‌ను, నర్సును పిలిపించారు. వారికి కట్లు కట్టిన తర్వాత విశ్రాంతిగా పడుకోమంటున్నారు.

వారికి విశ్రాంతి కన్పించడం లేదు. భయంకరంగా అరుస్తూ లోయలో పడిన స్త్రీ, ఆగ్రహంతో బాణాలు విడుస్తూ, రాళ్లు రువ్వుతూ మీదకు వస్తున్న చెంచులు కళ్లకు కన్పిస్తున్నారు. వారి జీవితంలో ఎన్నడూ అటువంటి పోరాటం చూసి ఎరుగరు.

ఆఫీసర్లు మళ్ళీ సమావేశమయ్యారు.

"దాడి చాలా తీవ్రంగా ఉంది. వాళ్లు ప్రాణాలకు తెగించి మీదకు వస్తున్నారు. మనం కూడా పెద్ద మీద దాడి కొనసాగించడం ద్వారా రెచ్చగొడుతున్నామేమో?" అన్నాడు డి.యస్.పి.

"వీళ్లు ఇంత రెచ్చిపోతున్నారంటే, ఏ కారణం లేకుండా ఇది ఇలా జరుగుతున్నదంటే నమ్మశక్యం కావడంలేదు. దీని వెనుక ఏదో కుట్ర ఉండవచ్చు. అదే మనకు తెలియడంలేదు. అది తెలిస్తే చెంచువారితో మనం పోరాడాలా, సామరస్యంగా ప్రవర్తించాలా, అన్నది తేల్చుకోవచ్చు'' అన్నాడు యస్.పి.

అందరికీ ఆ ఊహే మనస్సులో ఉంది. చెంచులు అంత కట్టుగా దాడి చేయడానికి సిద్ధపడుతున్నారంటే, ఆ కారణం ఏదో బయటకు లాగాలి. తర్వాతే ఏం చేయదలచినా చేయవలసి ఉంటుంది.

మాటిమాటికీ దాడి చేయడం వీరికీ నచ్చడం లేదు. వాళ్లను తిరిగి బయటకు రానివ్వాలి. బయటకు వచ్చి ఏ విధంగా ప్రవర్తిస్తారో చూచి, దాన్ని బట్టి ప్రవర్తించాలి. వారు మర్యాదగా ప్రవర్తిస్తుంటే కలుగచేసుకోవడం మంచిదికాదు. పోలీసు శాఖ అంటేనే వారికి అసహ్యంగా ఉంది. ఎప్పుడూ వారిమీద దాడిచేయడం, అరెస్ట్ చేయడం, సలగగొట్టడం, వారు చేయని నేరాలలో ఇరికించడం, బతుకనీయకుండా తరిమి కొట్టడం... ఇవన్నీ వారికి కంటగింపుగా అయ్యాయి, దీనికితోడు అందర్నీ కొండల్లోకి తరమడం, తినడానికి తిండి లేకపోవడం, దోపిడీ చేయక తప్పని పరిస్థితి సృష్టించడం, చివరకు వీటన్నింటికీ తట్టుకోలేక తెగించి పోరాడవలసిన స్థితి తామే కల్పించడం జరుగుతోంది. ఇప్పటికయినా వాళ్లు తిరిగి సమాజంలోకి వచ్చేలా చేయడానికి దాడి చేయకుండా చూసుకోవడం మంచిదని కొందరు అనుకుంటున్నారు. కాని యస్.పి. వాళ్లను నిర్దాక్షిణ్యంగా అణచే పేరుతో దాడికి సిద్ధపడుతున్నప్పుడు కింది అధికారులు అమలు జరుపవలసిందేగాని, వ్యతిరేకించడం సాధ్యంకాదు.

యస్.పి., ఎ.యస్.పి., డి.యస్.పి. సంధ్యాలకు వెళ్లారు. హాస్పిటల్‌కు వెళ్లి డాక్టరుతో మాట్లాడి, దెబ్బతిన్న మనిషితో ఒకగంట మాట్లాడడానికి స్టేషన్ వరకూ పంపించవలసిందిగా కోరారు. డాక్టర్ అంగీకరించలేదు.

"రూల్స్ ప్రకారం అతన్ని బయటకు తరలించడం సాధ్యంకాదు" అన్నాడు.

"హాస్పిటల్‌లో చేర్పించింది మేమే! మేము చేర్పించిన ఖైదీని వెనక్కు ఉపసంహరించుకునే హక్కు మాకుంటుంది" అన్నాడు డి. యస్. పి. ఇంత పెద్ద ఆఫీసర్లు వచ్చినా డాక్టరు వినసందుకు అతడికి కోపంగా ఉంది.

"ఉపసంహరించుకుని తీసుకెళ్ళే మేం పద్దసం. తిరిగి ఇక్కడ చేర్చుకోవడం జరగదు. రోగికి ప్రమాదం జరిగినా దానికి హాస్పిటల్‌వారు బాధ్యత వహించరు."

విసుగ్గా చూశాడు యస్. పి. అతని అహం ఎగిరిపడుతున్నది. కానీ, హాస్పిటల్ రూల్స్‌కు చెందినంత వరకూ డాక్టర్‌ను తాము ఏమీ చేయలేరు. అతనితో వైరం సంపాదించుకునే కంటే మర్యాదగానే ప్రవర్తించడం మంచిదనుకున్నారు.

"ఇతడు మా కేసుల్లో ప్రధానవ్యక్తి. అందువల్లనే మేము ఇంతగా అడుగవలసి వస్తున్నది. పోనివ్వండి మీ హాస్పిటల్ లోనే మాట్లాడుతాం! ప్రత్యేకంగా రూంలో ఏర్పాటు చేయిస్తారా?" అన్నాడు డి. యస్. పి.

డాక్టరుకూడా అనవసరంగా తగవు పడాలనుకోవడంలేదు. సర్దుకునిపోదామనుకున్నాడు.

"ఒక గంటకు మించి మాట్లాడటానికి అవకాశం ఉండదు. ఎక్కువసేపుండటం వల్ల అతడు అలిసిపోతాడు."

ఒప్పుకున్నారు. ఆఫీసర్లు. డాక్టర్ ప్రత్యేక రూంలో ఇంటర్వ్యూ ఏర్పాటు చేయించాడు. రోగిని స్ట్రెచర్‌పై పరుండబెట్టి రూంలోకి తీసుకొచ్చారు. అతన్ని చూశారు ముగ్గురూ! ముగ్గురినీ అతడు చూశాడు. బలహీనంగా ఉన్నట్లున్నాడు. రక్తం పోయిందని డాక్టరు అన్నాడు.

యస్. పి. ముందుకు వచ్చి "ఎలా ఉంది?" అన్నాడు చూస్తూ.

అతడు తలూపాడు బాగానే ఉందని.

"ఏవూరు మీది?"

"నంద్యాలే!"

"ఏం చేస్తుంటావు నీవు?"

"గుర్రం బండి తోలుతాను"

"ఏం చదువుకున్నావు?"

"ఐదవ తరగతి"

"చెంచువాళ్ళతో నీకు స్నేహం ఎట్లా ఏర్పడింది?"

అతడు కండ్లుమూసుకున్నాడు; 'చెప్పడమా? మానడమా?'

"ఇప్పటికే చాలా నష్టం జరిగింది. ఇక ముందయినా నష్టం జరగకుండా ప్రయత్నించాలి. నీకూ, వారికీ కలిగిన స్నేహం తెలిసేకానీ వారికి మేమేదైనా సహాయం చేయగలమో లేదో ఆలోచించుకోవాలి."

"నన్ను వెంకటరెడ్డి తీసుకెళ్ళి వారి వద్ద విడిచాడు."

ఆఫీసర్లు ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. కొత్త పేరు ఇది. ఈ చెంచువాళ్ళతో తగవు ఆరంభమయిన ఇరవై రోజుల తర్వాత బయటకు వస్తున్నది. ఒక్క చెంచువాడు కూడా ఈ పేరు బయట పెట్టలేదు.

"వారివద్ద ఎందుకు విడిచాడు నిన్ను?"

"డొక్కోడు అనే వీరన్న ఒకరిని తమ వద్ద సాయంగా ఉంచమని అడిగాడట. నన్ను అక్కడ ఉండమని చెప్పాడు. ఆయనకూ నాకూ ఉన్న స్నేహాన్ని బట్టి అక్కడ ఉండదలచుకున్నాను"

"చెంచువాళ్ళకూ, అతడికీ ఉన్న బంధమేమిటి?"

"ఆ వివరాలు నాకు తెలియవు. నేను అడుగనూలేదు; అడిగినా చెప్పడు."

"అనవసరంగా నీ ప్రాణం పోయేది కదా! ఎందుకు కలుగచేసుకున్నావ్?"

"నేనే కాదు; అక్కడున్న ఎవ్వరూ కలుగచేసుకోలేదు. వంట చేసుకోడానికి

ప్రయత్నం చేస్తున్నారు. హఠాత్తుగా వచ్చి మీరే కాల్చారు."

"వెంకటరెడ్డిది ఏవూరు?"

"అతని వివరాలు నాకేమీ తెలియవు. మూలపేటలో జులేఖా అనే అమ్మాయి ఉంటుంది. అక్కడికి వెళ్లితే వివరాలు తెలియవచ్చు."

"జులేఖా ఏం చేస్తుంది?"

"వ్యభిచారం చేసి బతుకుతుంది."

యస్.పి. కళ్లుచిట్లించి ఆశ్చర్యంగా చూసి నమ్మలేనట్లు "ఏమిటి?" అన్నాడు తలవంచి.

"నాకు అంతే తెలుసు" అన్నాడు అతడు. ఇక అతడివల్ల లాభం లేదనుకున్నారు. విసిగిస్తే డాక్టరుకు కోపం. అంతటితో విడిచివచ్చి జీప్ ఎక్కారు.

"జులేఖాను కలుసుకుందామా?" అన్నాడు యస్.పి.

"కలుసుకోవాలి. స్టేషన్‌లో వద్దు; ఇంటిదగ్గిరే కలుసుకుందాం. మరిన్ని వివరాలు బయటపడతాయి" అన్నాడు ఎ.యస్.పి.

మూలపేటకు వెళ్లి జులేఖా ఇంటికి చేరేసరికి తలుపు వోరగా వేయబడిఉంది. చిన్న సైజు డాబా అది. ఆ ఇంటిని చూస్తే వ్యభిచారపు కొంపలా కన్పించదు.

తలుపు తట్టారు బయటనుండి. ఓ ముసలమ్మ వచ్చి వారినీ, జీపునూ, చూసింది. వారి గుడ్డలు పోలీసుల్లా లేకున్నా జీపుమీద పేరుంది. దాన్నిబట్టి పోలీసులని గుర్తించింది.

"జులేఖా ఉన్నదా?"

ముసలమ్మ తలఊపింది. తలుపు తెరుస్తూ ముగ్గురూ లోనికి వచ్చారు. హాలులో కూర్చోబెట్టింది కుర్చీలు లాగి. లోపలకు వెళ్లి చెప్పింది- వారు ఎవరయింది! జులేఖా ముఖం చిట్లించి, లేచి హాలులోకి వచ్చింది. ముగ్గురికీ నమస్కారం చేసింది. ఎదురుగా ఉన్న మరో కుర్చీ లాక్కుని కూర్చుంది.

"జులేఖా అంటే నువ్వేనా?"

తలఊపింది.

"మీ స్వంత ఊరు ఇదేనా?"

"కాదు. ప్రొద్దుటూరు. ఇక్కడికివచ్చి పది సంవత్సరాలవుతుంది. మా నాన్న చనిపోవడం మూలంగా మా కుటుంబం చెల్లాచెదరయింది. నేనూ, మాఅమ్మా ఇక్కడ పడ్డాము."

"చదువుకున్నావా?"

తలూపింది జులేఖా.

"స్కూల్‌ఫైనల్ పాసయ్యాను. టైపు చేయడం వచ్చు."

"ఇంతావచ్చి ఇక్కడ వ్యభిచారిగా బతుకడం ఎందుకు?"

"ఒంటరి ఆడదానికి ఈ దేశంలో ఇంతకంటే సత్కారం దొరుకుతుందనుకోను. ఇదే ఆడదాని చివరి ఆయుధం. నేనూ అదే స్వీకరించాను."

"వెంకటరెడ్డి నీకు తెలుసా?"

"తెలియకపోవడమేమిటి? మావూరివాడే! మొదటినుండీ నాకు తెలుసు. నాలాగే అతడూ పొట్ట చేతపట్టుకొని వచ్చాడు ఈ ప్రాంతం. నావద్దకు వస్తూ పోతూ ఉంటాడు."

"అతడికొరకే వచ్చాము. అతడితో మాట్లాడాలి. ఎక్కడ దొరుకుతాడు?"

ఎదురుగానున్న గోడగడియారంవైపు చూసింది. "రాత్రి ఇక్కడే ఉన్నాడు. ఉదయం ఎనిమిదిగంటల రైలుకు కర్నూలుకు ప్రయాణమై వెళ్ళాడు. బస్సులు రోడ్డువెంట తిరగకపోవడంవల్ల ధోన్ తిరిగి కర్నూలుకు వెళ్తానన్నాడు.

ఇప్పుడు మూడుగంటలయింది గనుక కర్నూలు చేరి ఉండవచ్చు.''

"కర్నూలులో ఎక్కడ కలుసుకో వచ్చు.''

యస్. పి. కళ్ళల్లోకి దీర్ఘంగా చూసింది జులేఖా. "ఇక్కడ చెంచు వాళ్ళమీద దాడి జరుగుతున్నదనీ, అది అక్రమమనీ కలెక్టరుతో చెప్పడానికి లాయరు లక్ష్మణరావుతో కలిసి వెళ్ళాడు. మీకు కావాలంటే కలెక్టరు ఆఫీసువద్ద దొరుకుతాడు. అతని మీద కేసులు ఏమీలేవు మీరు పట్టుకోడానికి'' అంది లేస్తూ. ముగ్గురూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. లేచి బయటకు వచ్చారు. జీపు కర్నూలువైపు సాగిపోయింది.

* * *

కలెక్టరు ఆఫీసువద్ద లాయరు లక్ష్మణ రావు, వెంకటరెడ్డి కలిసివచ్చి కలెక్టరు పి. ఎ. తో సంప్రదించారు. కలెక్టరు ఉన్నాడనీ, ఆయనతో మాట్లాడడానికి అవకాశం ఏర్పాటు చేస్తానన్నాడు. పి.ఎ.

సాయంత్రం నాలుగంటలకు కలెక్టరును కలిశారు. పాణ్యం చెంచువాళ్ల వివరాలు చెప్పారు.

"చెంచువాళ్ళు అంత దౌర్జన్యంగా ప్రవర్తించకుంటే ఏం?" అన్నాడు కలెక్టరు.

"మీకు వచ్చిన రిపోర్టుల ఆధారంగా చెంచువాళ్లు తప్పు చేశారని భావిస్తున్నారు. కానీ, అక్కడ జరిగింది వేరేవిధంగా ఉంది. చెంచువాళ్లు ఎన్నడూ దొంగతనం చేయలేదని నేను వాదించలేను. ఎందు కంటే ఈ దేశంలో మనిషి తినడానికి తిండికొరకు మగవాడి చివరి ఆయుధం దొంగతనం. ఆడదాని చివరి ఆయుధం వ్యభిచారం. ఆవిధంగా వాళ్ళు చేసి ఉండవచ్చు. అవి పెద్దవికావు. జొన్న కంకులు, వేరుశనగకాయలు, పత్తి దొంగలింపుల్లాంటి చిన్నచిన్నవి కేవలం పొట్టకూటికొరకు చేసే ప్రయత్నాలు. వారిమీద బాంకు దోపిడీ మోపారు. నిజానికి దేశంలో ఎన్నడూ జరగని సరికొత్త పద్ధతిలో ఆ దోపిడీ జరిగిందని పత్రికలు రాశాయి. ఆ నేర్పు చెంచు వారికి ఉంటే ఎప్పుడో బాగుపడి ఉండే వాళ్లే! వాళ్లకు లేదుగనుకే ఈ విధంగా తయారయ్యారు. అమాయకులైన చెంచు వాళ్లమీదకు ఆ బలమైన నేరం మోపారు. మరుసటిరోజే కాల్వబుగ్గ రామేశ్వరం దోపిడీ, స్త్రీ మానభంగం జరిగింది. ఇక్కడ కూడా కారు, ఇనుప నిచ్చెన లాంటి వస్తువులతోనే దోపిడీ జరిగింది. ఇనుప నిచ్చెనలు సంపాదించుకోగలరేమో కానీ, కార్లు తెచ్చుకోవడం వారికి సాధ్యం కాదు. అయినా వారినెత్తినే ఈ అభాండం కూడా మోపారు. మూడవరోజే కవులూరు వద్ద శెట్టి ఆస్థి దోపిడీ. అదే రోడ్డులో కారు అటకాయించి దోపిడీ జరిగింది. దాన్ని కూడా వారిమీదనే మోపారు. అక్కడి నుండి పోలీసులు ప్రతిక్షణం గూడేలమీద దాడి సాగించారు. కుక్కలు పట్టాయనే పేరుతో ఎనిమిది మందిని తెచ్చి హింసించారు. వారు ప్రాణాలకు తెగించి స్టేషన్‌లో చావకుండా ఉండటంకొరకు లాకప్‌నుండి పారిపోయారు. స్త్రీల బుగ్గల మీద సిగరెట్లతో కాల్చారు. చేతి వేలి గోళ్లలో గుండుసూదులు గుచ్చారు. అనేక హింసలు పెట్టారు. వాటినన్నింటినీ భరించడం తప్ప ఏమీ చేయలేరు. ఎంతో మందిని పట్టుకొనివచ్చి గొడ్లను బాదినట్లు బాదారు. పిరిబాధ తట్టుకోలేక వారు కొండల్లోకి పారిపోయారు తిండిగింజల కొరకు లారీలు కొల్లగొట్టారు. నిజమే. అది





ఏ పరిస్థితిలో జరిగిందీ చూడాలి. బయటి ప్రపంచాన్ని చూడనివ్వకుండా చేసిన పరిస్థితిలో, తినడానికి తిండి కూడా దొరకని స్థితిలో వాళ్లు ఆ పనిచేశారు. వాళ్ళు నిజంగా డబ్బు కొరకే దోపిడీలు సాగించి ఉంటే బస్సులు నిలిపి దోచేస్తే ఏం చేసేవారు? డ్రైవర్లను బాది వారి గడియారాలు, డబ్బు లాక్కుంటే ఏం చేసేవాళ్లు? అటువంటి వస్తువుల జోలికి వాళ్లు పోలేదు. వారికి అవి అవసరంలేదు. తిండి మాత్రమే కావాలి కాబట్టి, ఆ కొండలనుండి బయటికి పోతే పోలీసులు సలగతన్నేస్తారు కాబట్టి, ఆ లారీలు తప్పనిసరిగా దోచుకోవలసిన స్థితి వచ్చింది."

"ఆ సాకుతో బస్సు సర్వీసులు రద్దు చేయించారు. ఇనుపఖనిజాల లారీకి కొయ్యచెక్కల లారీకి కూడా పోలీసు కాపలా ఏర్పాటు చేశారు. ఆ విధంగా భయోత్పాతంలేపి చెంచులమీద అందరికీ



వ్యతిరేకత కలిగించడానికి తీసుకున్న చర్యేగానీ, ప్రజలకు ఉపయోగపడటానికి కాదు.ఇదేసమయంలో మైదాన ప్రాంతాల మీద రాత్రిపూట దాడిచేయడానికి అవకాశమున్నా వారు చేయలేదు. అంటే ప్రజలతో వారు తలపడాలని ఆలోచించడం లేదు."

"ఈ పరిస్థితులు కావాలని సృష్టించి వారిమీద రిజర్వ్ దళాలతో నిర్విరామంగా దాడి చేయించారు యస్.పి., అతని అనుచర బృందం. చెల్లాచెదురయిన వారిని మరింత చెల్లాచెదరు చేయడానికి దాడి మీద దాడి కొనసాగించారు. ఆ విధంగా ఏడుగురిని చంపారు. తల్లికీ, పిల్లకూ సంబంధం లేకుండా చేశారు. చివరకు బతకడానికి అవకాశం ఉన్నవాడిని కూడా తుపాకీ మొనలతో పొడిచి చంపారు. ఇంతకంటే ఘోరమేమిటి? ఇంతటి చర్య తీసుకోవలసిన అవసరం అక్కడ ఉందా అనేది ఆలోచించాలి."

"బాంకు దోపిడీ కేసు చెంచువాళ్లు చేయలేదని తెలిసిపోయింది. అదే విధంగా దేవాలయందోపిడీ,కవులూరుదోపిడీ వాళ్లు చేయలేదని తెలిసిపోయింది. ఆ దోపిడీలు వాళ్లు చేశారోలేదో పూర్తి ఎంక్వయిరీ చేయకుండానే వారసత్వదొంగలుగా వారిని ప్రకటించి అరెస్టుచేసి, బాది, హింసించి, మిగిలినవారిని కొండల్లోకి పారిపోయేలా చేశారు. నిజానికి పోలీసుల దాడి ఆరంభమయేవరకూ వాళ్ళు ఏ దొంగతనమూ చేయలేదు. అప్పటికే పొలాలకు కాపలా ఒప్పుకున్నవారు పొలాలలో ఉన్నారు. మిగిలినవారు ఇళ్లవద్దే ఉండి సాధారణ మైన పనులూ, కట్టెలు తెచ్చుకొని అమ్ముకోవడం లాంటి పనులూ చేసి బతుకుతున్నారు. ఇంకో వైపు, నాగరాజు పల్లెస్టేషన్ ప్రాంతంవాళ్లు లంచాలు ఇవ్వడం లేదనీ, ఇచ్చిన లంచాలు చాలడం లేదనీ స్టేషన్ మాష్టరు వాళ్ళమీద జులుం చెలాయించడానికి ప్రయత్నం చేశాడు. ఆ విధంగా వారిమీద పోలీసుల దాడి సృష్టించి వారినీ, వీరినీ కలిపి పారిపోయేలా చేశారు. పారిపోయిన తర్వాత తప్పులు జరిగాయని మేము ఒప్పుకుంటున్నాము. అవి ఎందువల్ల జరిగాయో కూడా తెలుపుకుంటున్నాం. జరిగిందే చూసి, జరగడానికి కారణాన్ని మరచిపోవద్దని మేము కోరుతున్నాము."

"ఇప్పటికే చెంచులు చాలా నష్టపోయారు. ఈ ప్రభుత్వం వారికి ఏదో ఒరగబెడుతున్నట్లు ప్రతిక్షణం వారిని గురించి మాట్లాడుతోంది. ఆచరణలో చూస్తే వారి రక్తమాంసాలు పీల్చడమే ధ్యేయంగా కన్పిస్తున్నది. ఇప్పటికైనా వారి మీద దాడి ఆపుచేయించి, తిరిగివారు తమ తమ పనులు చేసుకోడానికి అవకాశం కల్పించి, వారికి ఆశ్రయం కల్పించవలసి ఉంది. ఆ విధంగా గాక ఇప్పటిలాగే వెంటబడి తరుముతుంటే, వాళ్లుకూడా ప్రాణం పోవడం తప్పనిసరి అయినప్పుడు తెగించి నిలబడతారు."

"అందువల్లనయినా ఆ ప్రాంతంలో దళాలు ఉపసంహరించబడాలి. అమాయకులను కేసుల్లో ఇరికించడం మానుకోవాలి. వారి వెంటపడడం నిలిపివేయాలి. ఇవి జరగకుండా లొంగిపొమ్మని వాళ్లను కోరినా, వాళ్ళు లొంగి పోలీసులతో తన్నులు తినడానికి ఎట్టి పరిస్థితుల్లోనూ రారు." అన్నాడు వెంకటరెడ్డి.

లక్ష్మణరావు గోళ్ళు గిల్లుకుంటూ

కూర్చున్నాడు. కలెక్టరు ఆలోచిస్తూ కూర్చున్నాడు.

"చెంచులు మళ్లీ దాడి చేయకుండా మీరు ప్రయత్నం చేయగలరా?"

"పోలీసు దళాలను ఉపసంహరించి తిరిగి వాళ్ళు జనంలో తిరిగే అవకాశం దొరికితే, వాళ్లు ఎవరిమీదా దాడి చేయరు. ఒకవేళ ఏ ఒక్కడయినా ప్రయత్నించినా, అటువంటివాడిని మేమూ సమర్థించం. సామూహికంగా దాడి చేయడమనేదే ఘోరమని మేం చెబుతున్నాం. రేపు ఏ ఒకడో ఇద్దరో దొంగతనం చేసి దొరికిపోతే వారిమీద కేసు పెట్టుకోవచ్చు. అలాగాక, కొందరు దొంగతనం చేసి దొరికారు గనుక మొత్తం అందరూ దొంగలేనంటూ భావించి అందరిమీద దౌర్జన్యం చేయడానికి ప్రయత్నిస్తేనే ఇలాంటి తగవులు ఆరంభమవుతాయి."

"ముగ్గురు పోలీసులనూ, ఒక గైడ్‌ను కూడా వాళ్ళు చంపారు."

"కాదనడంలేదు నేను. కలియబడ్డ తర్వాత పెద్దా చిన్నా కనిపించదు. ఎవరి ప్రాణరక్షణ వాళ్ళు చూసుకోక తప్పదు. ఆ సమయంలో ఆ దొమ్మీలో ఒకరో ఇద్దరో చనిపోయి ఉండవచ్చు. మొదట ఇద్దరు పోలీసులు దొరికితే వారిని చంపకుండా, గాయాలకు పసుపు రాసి కూడా అట్టే పెట్టారు. పోలీసులను చంపడమే చెంచువాళ్ల రాచ కార్యమయితే, ఆ యిద్దరినీ ఎందుకు విడుస్తారు చంపకుండా? పైగా వారికి శుశ్రూష ఎందుకు చేయాలి? ఆ ఇద్దరూ బతికే ఉన్నారు గనుక విచారించండి నిజాలు బయట పడతాయి. అలాగే ఆ ముగ్గుర్ని కూడా చంపాలని చంపడం కాదు. మందిలో జరిగి ఉంటుంది. ఆ విధంగానే ఆలోచిస్తే చంపాలన్న కక్షలోనే ఏడుగురిని పోలీసులు చంపారు. అది న్యాయమవుతుందా? పైగా పారిపోతున్న వారిని కాల్చి చంపారు."

కలెక్టరు మాట్లాడలేదు.

"వాళ్లు పూర్ లేబర్స్! వారిమీద దాడి చేయడమనేది విచక్షణా రహితంగా ప్రవర్తించడమవుతుంది. పైగా ప్రభుత్వం చెప్పే నీతులకు విరుద్ధం. పత్రికలలో నీతులుప్రచారంచేసి ఆచరణలో ఆ లేబర్‌నే నాశనం చేస్తే విలువేముంది? ఇప్పటికయినా దాడి ఆపడం తక్షణ చర్య. ఆ తర్వాత వారిని అరెస్ట్ చేయకుండా, తిరిగి వారివారి ప్రాంతాలకు పోనివ్వడం రెండవ చర్య. రెండుచర్యలూ వెంటనే జరిగితే మధ్యనఉన్న అపోహలు ఇటు చెంచువారి నుండి అటు పోలీసులనుండి తొలగించవచ్చు! 'పోలీసులం' అనే అహంకారంతో ప్రవర్తించినంతకాలం సామరస్యం నెలకొనదు సరికదా ఇంకా ఉద్రిక్తత విజృంభిస్తుంది" అన్నాడు లాయరు లక్ష్మణరావు.

"ఆలోచిద్దాం" అన్నాడు కలెక్టరు.

"ఆలోచనలతో కాలం గడిపితే మళ్లీ పోలీసులు దాడిజరిపి మరి కొందరిని పొట్టన పెట్టుకుంటారు. తక్షణం దాడినిలిపివేసే ఏర్పాటు చేయండి. ఆ తర్వాత నిదానంగా మిగిలిన విషయాలు పరిష్కరించుకోవచ్చు."

"చెంచువాళ్ళు ఈలోగా దాడిచేయరనే హామీ ఏమిటి?" అన్నాడు కలెక్టరు లాయరు వైపు చూస్తూ.

లాయరు వెంకటరెడ్డివైపు చూశాడు.

"ఆ హామీ నేను ఇస్తాను. తమంతట తాముగా చెంచువాళ్లు దాడి చేయకుండా నేను చూస్తాను. పోలీసులు వెలు - పెడితే మాత్రం ఆ తర్వాత నేను కట్టుబడి

ఉండను" అన్నాడు వెంకటరెడ్డి.

"సరే! ముందు దాడి నిలుపుదల చేసే ఏర్పాటు చేస్తాను." అన్నాడు కలెక్టరు. లాయరు లక్ష్మణరావు, వెంకటరెడ్డి లేచి బయటకు వచ్చారు. రైలు స్టేషన్‌కు వచ్చే సరికి ఆరుగంటల బండి సిద్ధంగా ఉంది. బండి ఎక్కి ధోన్‌లో దిగారు. ధోన్‌లోనే భోజనంచేసి,హుబ్లీనుండి వచ్చే పదిగంటల బండి ఎక్కారు. నంద్యాల చేరేసరికి పన్నెండు గంటలయింది. లాయర్‌ను ఇంటివద్ద దింపి, అదేరిక్షాలో మూలపేట వెళ్ళాడు వెంకటరెడ్డి.

* * *

చెంచువాళ్ళ మీద దాడులు నిలిపివేయవలసిందిగా కలెక్టరు ఆర్డర్ జారీ చేశాడు. తాత్కాలికంగా అరెస్టులు కూడా నిలిపివేయవలసిందిగా తెలిపాడు.

ఆర్డర్‌ను పాటించక తప్పలేదు పోలీసులకు. కలెక్టరును ధిక్కరించి నడవడానికి వారికి అధికారం లేదు, పైగా చెంచువాళ్ళ మీద అనవసరదాడి జరిపామని కొందరు



పోలీసు అధికారులే భావిస్తున్నారు. వారి మీద ఏ నేరారోపణ రుజువు చేయకుండానే తీవ్రమైన ఒత్తిడి కలిగించి, తద్వారా పరోక్షంగా తామే లారీలమీద దాడిచేయించామని ఆలోచిస్తున్నారు.

ఆ ప్రాంతంలో జరిగే ప్రతికేసునూ చెంచువాళ్ళకే అంటగట్టి, వారిని పట్టితెచ్చి గొడ్లను బాదినట్లు బాది, చేయని నేరాలకు జైలుపాలు చేసిన సంఘటనలు ఎన్నో ఉన్నాయి. నిజంగా నోరులేని గొడ్లలాగానే వాళ్ళు ఇంతవరకూ పడి ఉన్నారు. గొడ్డు ఓర్చుకోడానికీ ఓ హద్దు ఉన్నట్లే వాళ్ళుకూడా ఓర్చుకోడానికి హద్దు ఉంది. పైగా కుక్కల్ని తరిమినట్లుతరుముతుంటే ఎంతసేపని ఓర్చుకోగలరు? తిరుగుబాటు చేశారు. ఆ విధంగా ఆలోచించినప్పుడు, తిరుగుబాటుకు పరోక్షంగా పోలీసులే సహాయం చేసినట్లవుతున్నది. వారిని కొండలలోకి తరుమకుండా ఉన్నట్లయితే, జరిగిన అన్ని కేసులలోనూ ముద్దాయిలుగా ఇరికించకుండా ఉండిఉంటే, వారిపని వాళ్ళు చేసుకుంటూ బతికేవారు.

ఇవన్నీ పోలీసు వర్గాలలో కూడా చాలా మందికి ఆలోచన రేకెత్తించాయి. అయినా క్రమశిక్షణ పేరుతో వాళ్ళనోరు నొక్కివేయబడింది. పై అధికారి ఆజ్ఞ పాటించడమేగానీ, వ్యతిరేకించి మాట్లాడడం సాధ్యంకాదు.

చెంచులు తిరిగి ఇంకా గూడేలకు రాలేదు. రావడానికి తగిన పరిస్థితులు ఏర్పడినట్లుకూడా వారికితెలియదు. వెంకటరెడ్డి వారిని కలిసి పరిస్థితులు చెప్పాడు. తాత్కాలికంగా దాడి ఆగిపోయింది. కాని అది పూర్తిగా ఆగిపోయినట్లు నమ్మడానికి వీలులేదన్నాడు. బయటకు వస్తే పోలీసులు 'పులి-బ్రాహ్మడి కథ' మొదలు పెడతారనికూడా చెప్పాడు. ఒడ్డున కూర్చుని బంగారుకంటె చూపించి, బ్రాహ్మణుని నీళ్ళలో బురదలో దించిన పులిలాగా 'మీరు బయటకురావచ్చు'అని పోలీసులు కేకవేసి. బయటకు వచ్చిన తరువాత లోపలకు తోస్తారనేది అందరికీ అనుభవమే.

"మాకు తిండిగింజలు అయిపోయాయి. బయటకు వెళ్లి తెచ్చుకునే అవకాశం లేదు. ఏం చేయాలి?" అన్నాడు నాగడు.

"మనం లారీలమీద దాడిచేస్తే, వాళ్ళు తిరిగి మనల్ని వేటాడి చంపుతారుకదా?" అన్నాడు దొక్కవీరన్న.

"అన్నింటికీ సిద్ధపడి ఇంతవరకూ ఉన్నాం. ఇప్పుడు పిరికిపడితే లాభంలేదు. పిరికిపడితే దెబ్బతినేదీ మనమే! ముందుకు దూకినా దెబ్బతినేదీ మనమే!ఎలాగయినా దెబ్బతినక తప్పనప్పుడు, చేతులు ముడుచుకుని కూర్చోవటం ఎందుకు? చేతనయిన పనిచేసి దెబ్బతిందాం.''

''లారీలవెంట పోలీసులు కాపలా రావడంలేదా?''

''వస్తారు. ఇంతకు ముందూ వచ్చారు. ఏం చేశారు? ఇప్పుడూ అంతే!'' అన్నాడు నాగడు.

''తిరిగి మరోదఫా కొల్లగొడితే ఇరవై రోజులు తిండికి దొరుకుతాయి. ఆ ఇరవై రోజులలో ఏదో ఒక పరిష్కారం జరక్కుండాపోదు''

అందరూ తలూపారు.

ఆ పరిస్థితులలో అంతకు మించి మార్గంలేదు. ముందు తిండి సంపాదించుకోవాలి. దాడి చేయమని పోలీసులు చెబుతున్నారు. కానీ, మూడువందల మంది గుడారాలు వేసుకొని బస్ సెంటర్‌లో ఉన్నారు. వారిలో ఒక్కరినీ విరమించ పంలేదు. అందువల్ల వారి మాటలు

నమ్మదం సాధ్యం కాదనుకున్నారు. మరో కొద్దిరోజులపాటు తిండి సంపాదించుకోవాలి. ఆ తర్వాత విషయాలు ఆలోచించాలి. అంతేగానీ, తిండిలేకుండా ఆలోచించడం వల్ల లాభంలేదు. బయట ఉన్నవారు వాళ్ళు. లోపలున్నవాళ్ల వీరు! బయట ఉన్నవారికి సౌకర్యాలు ఉన్నాయి. లోపలున్నవారికి తిండిలేదు. ఆవిధంగా లొంగించేదానికి ప్రయత్నం చేస్తున్నట్లుంది. అందుకు లొంగకుండా నిలబడకుంటే, భవిష్యత్తులో కూడా కుక్కల్లాగానే పోలీసులు తమను చూస్తారని వాళ్ళు అర్థం చేసుకున్నారు.

వెంకటరెడ్డి వీరమ్మను దహసం చేసిన చోటును చూశాడు. కిందపడి చచ్చిన చోటు చూపించారు. బండల మీద రక్తం ఇంకా అట్టగట్టి ఉంది. చెల్లాచెదురుగా పడ్డట్లు, చాలా చోట్ల రక్తం మరకలు కన్పిస్తున్నాయి. రక్తం చూసి కన్నీరు విడిచాడు. చెంచువాళ్లతో కలిసిపోయిన ఈ సంవత్సరంలో, చెంచు గూడేనికి వచ్చిన ప్రతిసారీ అన్నం వండి పెట్టడం వీరమ్మ నిత్యకృత్యం. అతడు తిరిగి వెళ్ళే వరకూ, అతనితో ఎంతో సంతోషంగా మాట్లాడుతూ ముద్దుగా "బాబూ బాబూ" అంటూ పిలిచేది. చెల్లెలిగా అప్యాయంగా ఆమెను చూసుకునేవాడు. తన స్వంత చెల్లెలులాగా భావించేవాడు. చివరకు చావు కళ్ల చూడకుండానే వెళ్లిపోయింది. అతడితోపాటు నాగడు, చిన వీరిగాడు, వీరమ్మ భర్త పెద్ద వీరిగాడు, వీరమ్మ అన్నలు హనుమంతు, ఎల్లయ్య, పోలయ్యలు కూడా కలిసి అక్కడకు వచ్చారు.

"వీరమ్మకు ఇక్కడ సమాధి కడితే బాగుంటుంది నాగన్నా!"

నాగన్న విషాదంగా నవ్వాడు. "చేతగాని వాళ్లు సమాధులు కట్టి, వాట్ని చూస్తూ కన్నీళ్లు కారుస్తూ బతుకుతారు. చేతనయిన వాళ్లు ప్రతీకారం తీరుస్తారు." అన్నాడు.

వెంకటరెడ్డి మాట్లాడలేదు. తల పైకెత్తి చూశాడు. కోట గోడలా ఎత్తుగా గుట్ట. అంతఎత్తు నుండి పడితే ఎముకలు కూడా విరిగిపోయి ఉంటాయి.

అక్కడి నుండి ముందుకు సాగారు. మైలు దూరంలో ఉన్న దేవాలయం వద్దకు వచ్చారు. ఆరుమంది చచ్చిన ప్రాంతాలు చూపించారు. వారిని తెచ్చి దహసం చేసిన చోటు చూపించారు. బూడిద ఇంకా ఉంది. అక్కడి నుండి పుల్లయ్యను పట్టుకొని తెచ్చి, ఎక్కడ నరికారో చూపించారు. దాడిలో దొరికిన పుల్లయ్యను కోనలో ఉన్న జాలమ్మ దేవతకు బలి కొట్టారు. చచ్చినవారి చావుకు అతడే కారకుడని వారి మంట. చనిపోయిన పోలీసులు ఏయే ప్రాంతాలలో చచ్చారో చూపించారు. రక్తం ఇంకా చెడిపోలేదు. రాళ్ల మీద ఎండి మెరుస్తూనే ఉంది. ఆ రోజు లోయలో అతనితో పాటు చెంచులు కూడా స్వేచ్ఛగా తిరిగారు. గత నెల రోజులుగా ఇంత స్వేచ్ఛ చెంచులకు లేదు. పోలీసులు దాడి చేయరని తెలిసిన తర్వాత మొదటి సారిగా వాళ్లు తిరుగుతున్నారు. అయినా బయటకు పోవడానికి ధైర్యం చాలడంలేదు. బయటకు వెళ్తే తిరిగి పోలీసులు పీడిస్తారని వాళ్ల భయం.

ఆరోజు సాయంత్రం తిరిగి చెంచులు బోడివాని కుంటవద్ద చేరారు. ఆ మలుపు వద్ద అయితే సులభంగా వుంటుందని వారి ఉద్దేశం.

రోజులాగే తిరిగి పోలీసు బందోబస్తుతో లారీలు కదిలాయి. లోయలోకి వచ్చే టప్పటికి ఇంకా ఎండఉంది. సూర్యుడు పశ్చిమాన అస్తమించడానికి ప్రయత్నాలు ఆరంభించాడు. లారీలకొరకు వీళ్ళు ఎదురు చూస్తూనే ఉన్నారు.

రోడ్డుమీద రాళ్ళు చూస్తూనే ముందున్న పోలీసు వ్యానులోని పోలీసుల గుండెలు గుభిల్లుమన్నాయి. రౌద్రం అణగి పోయింది కాబట్టి ఇకదాడిచేయరనీ, కాపలా ఉందంటే ఉందనే పద్ధతిలో రావడమే ననీ వాళ్ళు అనుకున్నారు. పరిస్థితి చూస్తే ఈ విధంగా ఉంది. వీళ్ళు ఇక తాము దొరికితే ప్రాణాలతో కూడా విడుస్తారనే నమ్మకం వారికిలేదు.అప్పటికే ఘోరమైన పోరాటాలు జరిగాయి. అందులో తామూ పాల్గొన్నారు. ఇప్పుడు కొద్దిమంది చేతిలో చిక్కితే వాళ్ళు విడిచి పెట్టక పోవచ్చు. పోరాడుదామంటే సాధ్యం అవుతుందా అని వారి అనుమానం.

రాళ్ల దగ్గరలో వ్యాను ఆగింది. వ్యానుతోపాటు వరుసగా లారీలు ఆగాయి. వాటివెనక జీపూ ఆగింది. వ్యానులోనుండి గానీ, జీపులోనుండి కానీ, పోలీసులు దిగ లేదు. కాల్చడానికి సిద్ధపడడం తప్ప మరో మార్గంలేదు. దిగితే మీద పడతారని వాళ్ళభయం. మనుషులు కన్పించలేదు. దిగి దెబ్బతినడం కన్నా, లోపలుండే కన్పించినవాణ్ని కాల్చేయాలని నిశ్చ యించుకుని, వ్యానుకు రెండు వైపులా తుపాకులు ఎత్తి కన్నాలలో పెట్టి సిద్ధంగా కూర్చున్నారు. డ్రైవర్లు లారీలనుండి దిగ కుండా కూర్చున్నారు భయంతో! చీకటి పడబోతున్నది. చెంచుల జాడలేదు. దిగి అడ్డున్నరాళ్ళు తొలగించేస్థితిలో వీళ్ళులేరు. ముందుదిగి రోడ్డుమీద కాలు పెట్టే వాడెవడూ వారిలోలేడు! ధస్తే అందరితో పాటూ లోపల చావాలి లేదా అందరూ ఒక్కుమ్మడిగా కిందికి దిగాలి. ఆ రెండు పనులూ అక్కడ కావడంలేదు. అడు పెట్టిన జనంకూడా రావడంలేదు. చీకటి చట్టంగా అలుముకుంటున్నది. చీకటి పడట మంటే మృత్యువు మెడలు కౌగలించు కోవడమేనని వారికి తెలుసు. చీకట్లో తాము ఏమీచేయలేరు. వాళ్ళు అన్నీ చేసి పోతారు. వీళ్ళు ఈవిధంగా మథనపడు తుంటే చెరువు కింద చెంచులు కూర్చు న్నారు. దగ్గరలో ఉన్న చెట్టుపైన ఇద్దరు న్నారు లారీలవైపు చూస్తూ. పోలీసులు దిగకుండనే తాముపోతే కాల్చి వేస్తారని వాళ్లకు తెలుసు. అందువల్ల వాళ్లు దిగాలి కిందకు! లేదా చీకటి పడనివ్వాలను కున్నారు. చీకట్లో వారి తుపాకులు ఏ వైపు పేలుతాయో పేల్చే వాడికే తెలియదు.

కర్నూలు వైపునుండి లారీలు వచ్చాయి లైట్లతో. రాళ్లగుట్టకు ఫర్లాంగు దూరంలో వాళ్ళు నిలిపారు. ఎదురుగా ఉన్న పోలీసు వ్యాను లైట్లు వెలుగుతున్నాయి. లోపల వెలుగుతున్న వెలుతురులో జనం వ్యానులో కనిపిస్తున్నారు. కాని, వారు కిందకు దిగలేదు గనక వచ్చిన వ్యాన్ల నుండి కూడా కిందకుదిగకుండా కూర్చు న్నారు. రెండు వైపులనుండీ దోబూచు లాటగా తయారయింది. మొత్తం యాభై మందిదాక పోలీసులున్నారు. ఎందరున్నా దిగితే హతమవుతామని వాళ్ల భయం. చీకటి పడిపోయింది గనుక ఇక అటు నుండి కానీ, ఇటునుండి కానీ లారీలు వచ్చే అవకాశం లేదు. కొండలోయ లోనికి వెళ్లిన లారీల కొరకు అటు వైపు,ఇటువైపు ఎదురు చూస్తూఉంటారు.

చూసి, చూసి ఏ అర్ధరాత్రికో రిజర్వు ప్రాణాలు కదుల్తాయి ప్రమాదం జరిగిందని నిర్ణయించుకొని. రాత్రి ఒంటి గంటవరకూ ఇక్కడ పడిఉండటం సాధ్యమటుంచి, వీళ్లు నిలుపుతారా అన్న సమస్య వారికి బాధగా ఉంది.

రోడ్డువెంట స్లోపుగా పెద్ద గుట్టలు ఉన్నాయి. చెంచులు తిరిగి గుట్టలమీదకు వచ్చారు. చంపడానికి వాళ్లూ సిద్ధంగా లేరు. అయితే తిండి గింజలు లేకుండా వెనుకకు పోవడానికి సిద్ధంగానూ లేరు. పోలీసుల మీద దాడిచేసి గతంలాగే కొందరు పోరాడుతుంటే మిగిలిన వాళ్లు దోచుకొని వెళ్ల వచ్చునని ఆశించారు. కాని జరిగిందివేరు. పోలీసులు దిగకుంటే, వారితో పోట్లాడ్డం సాధ్యం కాదు. కొండ మీదనుండి రాతి గుండ్లు దొర్లించడం ఆరంభించారు. రాళ్ల శబ్దంవిన్న పోలీసులు, గుండ్లు వాహనాలమీద తోస్తున్నారని అర్థం చేసుకున్నారు.

చిమ్మ చీకటి! విశాలమైన ఆప్రాంతంలో పరిమితమైన టార్చిలైట్లు పనిచేయడంలేదు. వ్యానుదిగి చీకట్లో కాల్చడం తప్ప వారికి మరోమార్గం లేదు. గుండ్లు పైనుండి దొర్లుతున్నట్లు లైట్ల వెలుతురులో కన్పి స్తున్నాయి. కానీ, మనుషులు కనిపించడం లేదు. తుపాకులు కాల్చాలంటే, గుండ్ల మీద మాత్రమే కాల్చాలి. చివరకు పోలీ సులు వ్యాను విడిచి కిందకు దిగారు. చీకట్లోనే ఏమీ కన్పించకున్నా బెదరించే దానికి పది రౌండ్లు కాల్చారు. బెదరింపు లకు వారు భయపడేస్థితి ఎప్పుడో దాటి పోయింది.

కీచుమని అరుస్తూ వచ్చి మీదపడ్డారు చీకట్లో! తుపాకులు బారుచేయడానికి కూడా వీల్లేక వారితో కలబడవలసిన పరిస్థితి ఏర్పడింది. దూరంగా రెండోవైపు నుండి తుపాకులు పేలాయి. వాహనాల హెడ్‌లైట్ల వెలుతురులో జనం కన్పిం చడంతో, ఆ వ్యాను నుండి పోలీసులు దిగి కాల్పులు సాగించారు. అక్కడ కూడా కొందరు సిద్ధంగానే ఉండడంవల్ల రాళ్లతో దూరంనుండి వడిసెలలు విసరి లైట్లు పగులగొట్టారు. టార్చి వెలిగించే వాడిమీదకు వడిసెలలతో రాళ్లు వచ్చి పడు తున్నాయి. పోలీసులు రోడ్డుమీద నుండి దూరంగా పారిపోవడానికి సిద్ధపడ్డారు. ఆ స్థితిలో చీకటిలో వాళ్లు చస్తారో లేదోగానీ, తాము చావడం తథ్యమనుకున్నారు. 'తీసుకపోనీ! పోతే మనకేం!' అను కున్నారు చివరకు.

వీరి పోట్లాట చూసి డ్రైవర్లు ముందు గానే దిగి అడవిలోకి పరుగు లంకించు కున్నారు కిందా మీద పడుతూ. ఒకవైపు కొందరు పోట్లాడుతూఉంటే మరికొందరు ధాన్యం మోస్తూనే ఉన్నారు.

రాత్రి ఒంటి గంటకు మరికొన్ని పోలీసు వ్యాన్లు వచ్చాయి. లోపలనుండి లారీలు రాకపోవడం అనుమానం కలిగిం చింది. కర్నూలు వైపునుండి కదలినట్లు పాణ్యానికి ఫోన్‌చేశారు. పాణ్యం నుండి కదలినట్లు కర్నూలుకు ఫోన్ అందింది. రెండు వైపులా కదలిన బండ్లు అటూ ఇటూ రాలేదు పన్నెండు గంటలవరకూ. ప్రమాదం జరిగిందనే నిశ్చయించుకుని, తిరిగి ఫోన్లుచేసి, అటు ఇటు నుండి వ్యాన్లు కదిలాయి. ప్రమాద స్థలం వద్దకువచ్చారు. పాణ్యం నుండి వచ్చేవాళ్లు పెట్రోమాక్సు లైట్లు కూడా తేలేదు. టార్చిలైట్లు మాత్రమే ఉన్నాయి. వాహనం హెడ్‌లైట్ల వెలు తురులో గుండ్లు మీదపడి తుక్కయిన




లారీలనూ, పోలీసు వ్యానునూ చూశారు. కర్నూలు వైపునుండి వచ్చినవారు పెట్రో మాక్సు లైట్లతో వచ్చారు.

అందరూ కలిసేటప్పటికి పారిపోయి దాక్కున్నవారుకూడా తిరిగి రోడ్డుమీదకు వచ్చారు. దాడి ఏ విధంగా జరిగిందో, జరగడానికి ఎంత ఆలస్యమయిందో వివరాలతో చెప్పారు. అంతా విన్న యస్.పి. తల ఊపాడు. వాళ్లు తిరిగి దాడి చేస్తారని అతడు ఆలోచించలేదు. అణగి నోరు మూసుకున్నారు గనుక ప్రమాదముండదని భావించాడు. తెల్లవారే వరకూ అక్కడే ఉన్నారు. తెల్లవారి వెలుతురు వచ్చేకొద్దీ బండ్ల స్వరూపం కన్పిస్తున్నది. మొత్తం ఇరవైఅయిదు వాహనాలు. ఏది కూడా నడిచి ఇళ్లు చేరుతుందనే నమ్మకంలేదు. అన్నీ దెబ్బ తిన్నాయి. కొన్ని ఎందుకూ పనికిరాని స్థితిలో పడ్డాయి. ఇంతా దాడి జరిగితే రెండు లారీలనుండే సరుకు దోచబడింది. మిగిలిన లారీల జోలికి వాళ్లు రాలేద



వాళ్ళకు కావలసినంత సరుకు మాత్రమే తీసుకెళ్ళారని పోలీసులనుకున్నారు.

ఉదయం కలెక్టరుకు ఫోన్ చేశాడు యస్.పి. పరిస్థితి వివరించి తిరిగి దాడి జరపకుంటే లాభం లేదనీ, లేకుంటే వాళ్లు చెలరేగుతారనీ, అణచివేయక తప్పనిసరి అనీ తెలిపాడు. తాను స్వయంగా వస్తున్నట్లు తెల్పాడు కలెక్టరు.

డి.ఐ.జి.తో కలిసి ఎనిమిది గంటలకు కలెక్టరు వచ్చాడు. ఇంగ్లీషు సినిమాలలో కొద్ది వెంట యుద్ధం జరిగినప్పుడు విరిగి పడే శకటాల్లాగా ఉంది అక్కడ పరిస్థితి. అటునుండి ఇటు నిదానంగా చూస్తూ తిరిగాడు. దోచబడిన రెండు బియ్యం లారీలను చూశాడు. తలెత్తి ఎత్తుగుట్టవైపు చూశాడు. చుట్టూ తలతిప్పి చూశాడు. ఎటు చూసినా లోయలూ, గుట్టలూ తప్ప అతనికి ఏమీ కన్పించడంలేదు. ఊపిరి ఎగపీల్చి వదిలాడు దీర్ఘంగా ఆలోచిస్తూ.

"ఇటువంటి పరిస్థితిలో దాడిచేయడం మేలు. ఏమాత్రం అలక్ష్యం చేసినా వాళ్ళు మరింత పైరేగిపోతారు. మనల్ని చవటలుగా భావించి తిరిగి దాడి చేస్తారు". అన్నాడు డి.ఐ.జి.

కలెక్టరు తల ఊపలేదు. పావుగంటసేపు పలుకనేలేదు ఆలోచిస్తూ. అతనికీ తెలుసు ఈసారి దాడికి అనుమతించడమంటే చెంచులు కుక్కచావు చస్తారని. ఇంకా పటాలాన్ని దింపి యస్. ఎ. పి. దళాలను కూడా దింపి కొండలన్నీ కెలికి కెలికి నాశనం చేస్తారు. అంతటి ఆవేశంలో ఉన్నారు పోలీసు ఆఫీసర్లు. ఈ స్థితిలో వారికి దాడికి అనుమతించడమంటే కోతి చేతికి కొబ్బరికాయ చిప్ప ఇచ్చినట్లే. అనవసరంగా వారిని చంపించడం మంచిదా? ఇరవై లారీలలో వాళ్లకు సరుకు దొరికినా రెండు లారీల సరుకే తీసుక పోవడానికి కారణమేమిటి? కలెక్టరు తర్జన భర్జన చేసుకుంటూ అటూ ఇటూ తిరుగుతున్నాడు. అతని అనుమతిలేనిది ఏమీ చేయడానికి వీలులేని పోలీసు ఆఫీసర్లు అతని వైపే చూస్తూ నిలబడ్డారు. డి.ఐ.జి. వెళ్ళిపోయాడు. అతనితోపాటు కొందరు పోలీసులూ వెళ్ళిపోయారు.

"ముందు వాహనాలను తొలగించండి. తర్వాత చూద్దాం" అన్నాడు కలెక్టరు.

యస్.పి.ని దగ్గరగా పిలిచి "వెంకటరెడ్డి అనేవాడు ఎక్కడుంటాడో మీరు ఎంక్వయిరీ చేయించండి" అన్నాడు.

యస్. పి. అతని వివరాలు క్లుప్తంగా చెప్పాడు. జులేఖా ఇంటిలో దొరకవచ్చు అని కూడా చెప్పాడు.

"వాణ్ని నా దగ్గరకు తీసుకురండి. తర్వాత మిగిలిన వివరాలు ఆలోచిద్దాం. తొందరపడి దాడిచేసినా రెండు వైపులా నష్టం! ఎటు నష్టం జరిగినా బాధపడవలసింది తిరిగి మనమే. ఇప్పటికే ఇది స్టేట్ స్థాయిదాటి కంట్రీ స్థాయిలో చర్చ జరుగుతోంది. ఇది కొండజాతులమీద పోరాటంగా కొందరు రాజకీయవాదులు వాడుకోవచ్చు. అందువల్ల వారి జోలికి వెళ్ళకండి. అతన్ని ఎంత తొందరగా వీలయితే అంత తొందరగా తీసుకురండి" అన్నాడు జీప్ ఎక్కుతూ.

* * *

వెంకటరెడ్డిని చూస్తూనే చాలాకోపంగా అన్నాడుకలెక్టరు"నీవు మోసంచేశావు!" వెంకటరెడ్డి ఆశ్చర్యంగా ఆయనవైపు చూశాడు.

మిగిలినవారు కూడా ఆయనవైపు చూసి, తిరిగి వెంకటరెడ్డి వైపు చూశారు.

"పోలీసు దాడులు ఆపుచేయడానికి

కపటోపాయం చేశావు" అన్నాడు మళ్లీ.

"నేను ఏ మోసమూ చేయలేదు" అన్నాడు వెంకటరెడ్డి నిశ్చలంగా చూస్తూ. లాయరు బుర్ర గోక్కున్నాడు.

"పోలీసు దాడులు విరమిస్తే, చెంచులదాడి విరమింప చేస్తానని ఎందుకు చెప్పావు?"

కలెక్టరు వైపు వెంకటరెడ్డి ఆశ్చర్యంగా చూశాడు.

"ఆ మాట నేను చెప్పలేదు"

"రెండు రోజులకింద ఇదే లాయరు ముందు చెప్పావు."

"నేను చెప్పినదాన్ని వక్రించి మాట్లాడుతున్నారు మీరు. మీరన్నట్లు నేను చెప్పలేదు. చెంచులమీద పోలీసు దాడులు ఆపుచేసి, తిరిగి వాళ్ళు బయట తిరిగే పరిస్థితులు ఏర్పడితే వారు ఎట్టి దౌర్జన్య, దోపిడీ చర్యలు చేయరని నేను అన్నాను."

"ఇప్పుడు దాడి మానుకున్న తర్వాత తిరిగి వాళ్ళు దాడి చేశారు."

''కావచ్చు. వారికి తిండికావాలి. నాగరిక సమాజంలో తిరిగేవారికే తిండి దొరకక చస్తుంటే, అడవులనుండి బయటకు రాలేని వారికి తిండి ఎక్కడ దొరుకుతుంది? వారు తిండి లేకుండా చావడానికే వారిని బయటకు రానివ్వటం లేదు. తిండి కొరకు వాళ్ళు తిరిగి చేశారు. అది కూడా మీవైపునుండే తప్పు అవుతుంది''

"దాడి మానుకోవడం మా తప్పు! అంతేనా?"

"కాదు. దాడి మానుకున్నంత మాత్రాన వారికి ఒరిగేదేమీ లేదు. దాడితోపాటు, వాళ్ళు బయట తిరగకుండా చేస్తున్న ఆంక్షలు మానుకోవాలి. వాళ్ళు నెలకిందట ఉన్న విధంగా కష్టం చేసి ఆహారం సంపాదించుకోడానికి అవకాశం కల్పించాలి. అది కల్పించనంతవరకూ మీరు దాడి మానినంత మాత్రాన వారికి ఒరిగేదేమీ లేదు."

"ఒకటి విరమించబడింది; మరొకటి విరమించడానికి ప్రయత్నం చేయబడుతున్నది. అంతలోనే తొందరపడవలసిన అవసరమేమిటి?"

"అసలు జరిగింది ఒకటే. పోలీసు దాడి మానుకున్నంత మాత్రాన అక్కడి ఫలితం ఏమీఉండదు. వాళ్లు తిరిగి బయట పడడానికి స్వేచ్ఛ, వారిమీద తిరిగి దాడిచేయకుండా ప్రవర్తించడం, లేనిపోని కేసులు వారి నెత్తిన రుద్దకపోవడం, సకలజనం చేసే దొంగతనాలు వారి మీద రుద్ది జైలుకు పంపకుండా ఉండటం ఇలాంటివన్నీ సక్రమంగా అమలు జరిగినప్పుడే సాధ్యమవుతుంది."

"దీనివల్ల వచ్చే ఫలితం తెలుసా?''

"నేను జైలులో కూర్చోవలసివస్తుంది ముందు. దానికి సిద్ధంగా వున్నాను. ఆ తర్వాత తిరిగి వాళ్లమీద దాడి జరుగుతుంది. తిండిలేకుండా చస్తారు. బయటకు రాకుండా దాడి ద్వారా జరిగేది అదే! అందుకు వాళ్ళు సిద్ధంగా ఉన్నారని నేను వారి తరఫున ఇప్పుడు చెప్పక తప్పడం లేదు."

కలెక్టరు అతడివైపు తేరిపార చూశాడు నిదానంగా. ఇరవై సంవత్సరాల లోపల వయస్సు. ఇప్పుడే ఈ విధంగా తయారయ్యాడు. ముందు ముందు మరింకెంత పెంకెగానయినా ప్రవర్తించవచ్చు.

"నీవు ఏ పార్టీకి చెందినవాడివి?"

"నాకు రాజకీయాలు తెలియవు. రాజకీయంగా నేను ఎవరివైపూ లేను"

"చేసే పనులన్నీ రాజకీయంగా చేస్తూ రాజకీయాలు తెలియవనడం విచిత్రమే! వాళ్లను అనవసరంగా నీవు రెచ్చగొడుతున్నావు. నీ గుప్పిట్లో వాళ్లను ఇరికించుకున్నావు. ఆ విధంగా వారిని ఆడిస్తూ వారితోపాటు ఇంతమంది అధికారుల్ని ఆడిస్తున్నావు."

"నావల్ల వారికి మేలు జరగకుంటే వాళ్ళు నన్ను అనుసరించరు. నావల్ల మీకు కీడు జరుగకుంటే, నన్ను అరెస్టు చేయరు. అదేవిధంగా అటువైపూ అంతే! వాళ్లు గొర్లు కాదు–తోలడానికి, అదలించడానికి! వాళ్ళూ మనుషులే! మనుషులుగా మీ వాళ్ళు చూడకపోవడమే వాళ్ళ కరకుదనానికి కారణం!"

"నీ స్వంత ఊరు ఏవూరు?"

"మీ పోలీసుల దగ్గర నా చరిత్ర ఉంది. నేను చెప్పడంకంటే, వారు సేకరించిన సమాచారం మరింత వివరంగా ఉంటుంది."

"ఇప్పుడు నీవు ఏంపని చేస్తున్నావు?"

"తినడం తిరగడం తప్ప మరో పని లేదు."

"అంటే చెంచువాళ్ళు గూండాయిజం మీద తెచ్చి ఇచ్చే డబ్బుతో తిరుగుతున్నావా?"

"ఆ పరిస్థితి ఇంతవరకూ నాకు దాపురించలేదు."

"ఇప్పుడు నిన్ను చెంచువాళ్లను దాడికి ప్రేరేపిస్తున్న వ్యక్తిగా ఆరోపిస్తూ అరెస్టు చేయిస్తాను."

"మీరు అరెస్ట్ చేస్తానంటే నేను సర్వసిద్ధంగా ఉన్నాను. కాని, ఒక్క విషయం గుర్తుంచుకోండి! నాకు పడితే ఏడేండ్లు డకాయిట్ కేసు కింద శిక్ష పడుతుంది. దానికి ప్రతిఫలం తర్వాత జరిగేది నేను చెప్పడం కంటే కళ్లతో మీరే చూస్తూ ఉంటారు తర్వాత" బయటికి వెళ్లిపోయాడు. ఆఫీసర్లు చూస్తూ కూర్చున్నారు. ఎవరూ కలుగచేసుకోలేదు.

"ఎంత అహంకారం? చూడడానికి చిన్నవయసే గానీ తలబిరుసు వ్యక్తి."

లాయరు అందుకున్నాడు వెంటనే "సార్! అందరూ లొంగుబాటుతనంతో ఉండరు. అలాంటివారిలో అతడూ ఒకడు. తను నమ్మినదానివైపు విశ్వాసంతో ముందుకు పోవలసినవాడు ఎవరినీ లెక్కచేయడు. మీరు ఆవేశాలకు లోనై పరిస్థితిని తారుమారు చేయకుండా ఆలోచించవలసిందని కోరుతున్నాను. తిరిగి పోలీసులు దాడి చేయడం, వాళ్లుకూడా తెగించి పోరాడటం, రక్తపాతం, అలజడి తప్ప ఇంకేమీలేదు. శాంతియుతంగా పరిష్కరించడం అత్యవసరం."

"వాళ్ళు దాడిచేయడంలో తప్పు లేదంటారా మీరు?"

"ఎలాఅంటాం సార్! అది తప్పే! కాని, వారికి సృష్టించబడుతున్న పరిస్థితులు కూడా మనం చూడాలి. రెండు వైపులనుండీ ఆలోచిస్తేనే పరిస్థితి అర్థమవుతుంది."

"ఇప్పుడు ఏం చేస్తే అక్కడ పరిస్థితి మామూలుకు వస్తుందంటారు?"

"చెంచువాళ్ళకు పూర్తిగా స్వేచ్ఛ ఇవ్వడం అత్యవసరం. అక్కడున్న పోలీసులను వెంటనే పంపడంకూడా అవసరం. తమమీద ఇక దాడి జరుగదనే భావన వారిలోకల్పించాలి. అటువంటప్పుడే అక్కడ పరిస్థితి సరిగ్గా వస్తుంది. వారిలో ఆ భావన

ఏర్పడనంతకాలం ఎన్ని ప్రయోగాలు చేసినా విఫలమవుతుంది."

"ప్రస్తుత పరిస్థితిలో అది సాధ్యమవు తుందంటారా? ఒకవైపునుండే జవాబు వస్తున్నది. రెండవవైపునుండి జవాబు రావడం లేదుగదా!"

"రాకపోవడానికి ఉన్న ఆటంకాలు తొలగించండి, వెంటనే జవాబు వస్తుంది. వారిమీద దాడి జరగకుంటే, కొండ లోయల్లో నిముషమో యుగంగా భయ భ్రాంతులై ఎందుకు కాలం గడుపుతారు? పైగా మైదానాలలో అంతో ఇంతో తిండి కలిగినవారికీ, సంపాదించుకునేవారికీ ఇళ్లూ, భూముల సౌకర్యం ఇస్తున్న ప్రభుత్వం కొండల ఒడ్డున, కొండల మధ్యన బతికే వీరికి ఆ వసతి ఎందుకివ్వడంలేదు? వీరికి ఇళ్లూ, భూములు ఇచ్చి ఆర్థికంగా నిలుప వచ్చుకదా! ఆర్థిక దారిద్ర్యమే అన్నిం టికీ మూలమవుతున్నది. పైగా వారు తెచ్చే ఏ వస్తువునయినా విలువుతోపిడి పద్ధతిలోనే వర్తకులు కొంటారు. గిరిజన కార్పొరేషన్‌లు గిరిజనులకు ఉపయోగ పడడానికి బదులు, అందులో పని చేసే వారికి మేలుచేస్తున్నాయి. ఇవన్నీ పరిష్క రిస్తే వాళ్లూ సమాజంలో భాగస్థులవుతారు. అంతవరకూ వారు ఈవిధంగానే తయా రవుతూ ఉంటారు."

"ఇవన్నీ పరిష్కరించడానికి సమయం అవసరం. ఆ సమయంవరకు ఓపిక పట్ట డానికి బదులు దాడులుచేస్తుంటే, అవి పరిష్కరించబడవు,దాడులు ఎదుర్కోకా తప్పదుకదా! చెంచువాళ్లకు మీరు నచ్చ చెప్పండి. వారు తిరిగేదానికి అవకాశమివ్వ బడుతుంది. ఆ విధంగానే దాడులు చేయ కుండా ప్రయత్నాలు చేస్తే, పోలీసులు వారిమీదకు పోవలసిన అవసరముండదు. మీరు నచ్చచెప్పగలిగితే వారిమీద నిఘా ఎత్తివేసి, స్వేచ్ఛగా [illegible] అవకాశం కల్పిస్తాము."

"నేను నచ్చచెప్పగలగడంకంటే, ఆ అవకాశం అతడికే ఇవ్వడం మంచిది. వారికీ, అతడికీ లంకెఉంది. అతడు చె తేనే వింటారు."

"వాళ్లకూ, అతడికీ ఉన్న సంబంధా లేమిటి?"

"నాకూ తెలియవు. తెలిసినా చెప్పడం లాయర్‌గా నా బాధ్యత కాదు."

"ఒక వ్యక్తి వెంట కొందరు జనం ఉన్నారంటే అతడు గూండానో, రౌడీనో, రాజకీయ నాయకుడో అయిఉండాలి."

"అవి ఏవీ అతడిలో లేవనే నా ఉద్దేశం! అతడు రాజకీయాలలో తిరగడం లేదు."

ఎవరూ మాట్లాడలేదు. ఆ సమా వేశాన్ని చాలిస్తూ కలెక్టరు లేచాడు. ఆయనతోపాటు అందరూ లేచి నిల బడ్డారు.

లాయర్‌ను వెళ్ళిపొమ్మన్నాడు కలెక్టరు. లాయరు బయటకు వెళ్ళిన తర్వాత "వీడు ఏ రాజకీయాలలో లేని మాట నిజమేనా?" అన్నాడు ఎదురుగా ఉన్న పోలీసు ఆఫీసర్లతో.

"ఇంతవరకూ అతని చరిత్రలో రాజకీయాలు కన్పించడం లేదు సార్! కానీ, అంతర్గతంగా ఏదో ఉంటుందని మేం నమ్ముతున్నాం. ఏమీలేనివాడు ఇలా చెయ్యవలసిన అవసరం ఉండదు. కనుక సంబంధం ఉన్నట్లే భావించాలి."

"ఇంత కటువుగా మాదగ్గిరే మాట్లాడే స్థితిలో ఉన్నప్పుడు, వారికి ఇంకెంత గట్టిగా నచ్చచెప్పగలుగుతున్నాడో తెలుస్తూనే ఉంది. చెంచుల్ని రెచ్చగొడు

తున్నట్లు కేసు రిజిష్టర్ చేసి అరెస్ట్ చేయండి. వాడి సంగతి తర్వాత చూద్దాం. చెంచులు బయటకు రావడానికి అవకాశం కల్పిస్తూ క్యాంపులు ఎత్తివేయించండి. వాళ్లు బయట కన్పించినా చర్యలు తీసుకోకండి."

"వాడిని అరెస్ట్ చేస్తే చెంచులు తిరగబడవచ్చునేమో! అప్పుడు ఏ విధంగా ప్రయత్నించాలంటారు?"

కలెక్టరు తలెత్తి యస్.పి. వైపు చూశాడు. "తిరుగుబాటు చేయవచ్చునంటారా? చూద్దాం! ఆ పరిస్థితి ఏర్పడితే వాణ్ని అప్పుడే విడిచే ఏర్పాటు చేద్దాం. వాళ్లు ఏ విధంగా ఫీలవుతారో కూడా మనం చూడాలి. అది చూడకుండా, వాడు చెంచువాళ్ళకు దేవుడిలా మనం భావిస్తూ, వాడితో చర్చలు జరపనవసరం లేదు"

పోలీసు ఆఫీసర్లు పలుకలేదు. ఎవరి తోవన వాళ్ళు వెళ్లారు.

ఆ రోజు రాత్రి కర్నూలు రైలు స్టేషన్‌లో ట్రైన్ ఎక్కడానికి ప్లాట్‌ఫాం మీద లాయరుతో కలసి నిలబడి ఉన్న వెంకటరెడ్డిని అరెస్ట్ చేసి పాణ్యం తీసుకవచ్చారు. మరుసటిరోజు కోర్టులో హాజరుపరచి నంద్యాల సబ్‌జైలుకు తరలించారు.

ఇదంతా జరుగుతుందని లాయరు ముందుగానే ఊహించుకున్నాడు. చెంచులకూ, అతడికీ లింకు తెగగొట్టడం ద్వారా అతని పరిధి నుండి చెంచులను విడదీయవచ్చు. ఆ తర్వాత తాము చెప్పినట్లు చెంచులు వినక తప్పని పరిస్థితి సృష్టించవచ్చు. ఆ విధంగా వాళ్ళు ఎత్తులు వేయగలరని ఆలోచించాడు.

బెయిల్ కొరకు ప్రయత్నిస్తే నిరాకరించారు.

సబ్‌జైలులో వేసిన రోజే లాయరుతో కలిసి జులేఖా సబ్‌జైలుకు వచ్చిచూసింది. ఆమె దుఃఖాన్ని మాన్పించాలని అతడు ప్రయత్నం చేయలేదు. నిరాసక్తంగా సెల్‌లో కూర్చున్నాడు. ఆ విధంగా జరుగుతుందని అతడు ఆలోచించలేదు. ఆలోచించిఉంటే చెంచువాళ్ళ దగ్గిరే ఉండేవాడు.

"డబ్బు ఎంతయినా ఇస్తాను. ఖర్చుపెట్టి విడిపించే ఏర్పాటుచేయండి" అని అడిగింది లాయర్‌ను బయటకు వచ్చిన తరువాత.

లాయర్ బాధగా నవ్వాడు. "ఇప్పుడు డబ్బుల సమస్య కాదమ్మాయ్! అతన్ని కావాలని లోపల తోశారు. విడిపించడానికి ఎన్ని ప్రయత్నాలు చేసినా లాభం లేదు. అతన్ని విడిపించాలంటే తిరిగి చెంచువాళ్ళు దాడి చేయడం ఆరంభిస్తేనే సాధ్యం."

జులేఖా ఇంటికెళ్లింది. కోర్టుపని చూసుకొని, లాయరు ఇంటికి వెళ్ళాడు.




పాణ్యం వద్ద పోలీసు క్యాంపు ఎత్తివేయబడింది. సాధారణంగా స్టేషన్‌లో ఉండేవారు మాత్రం మామూలుగా ఉన్నారు. గుడారాలు పెకిలివేయబడ్డాయి. పోలీసుల




పోలీసులు వెనుకకు వెళ్లిపోతున్నారని. తాము బయటకు పోవాలా? తమకు చెప్ప వలసినవ్యక్తి రెండు రోజులుగా రావడం లేదు. ఇంతవరకూ అతడి మాట మీద నడిచారు. ఇప్పుడు వ్యతిరేకించి,పోలీసులు వెళ్లిపోయారన్న ధీమాతో బయటకుపోతే తిరిగి అరెస్టులు జరిగితే నష్టపోవాలి. అతడి కొరకు మరో రెండు రోజులు ఎదురు చూశారు.

లారీలు, ఇతర వాహనాలు తిరిగి ఎస్కార్ట్‌తో తిరుగుతున్నాయి. వాటిని చెంచులు పట్టించుకోలేదు. వారు ఎదురు చూస్తున్న వ్యక్తి రావటంలేదు, రాకపోవ డానికి కారణం తెలియనూ లేదు.

పోలీసు క్యాంపు ఎత్తివేసిన నాలుగు రోజుల తర్వాత ఒక లోయలో అందరూ కూడారు.

"రెడ్డి వచ్చేవరకూ మనం బయటకు వెళ్లకుండా ఉండాలా?లేక వెళ్లిపోదామా?'' అన్నాడు నాగడు అందర్నీ పరకా యించి చూసి.

ఎవరి ముఖంలోనూ ఉత్సాహం లేదు.

"రాలేదంటే ఏదో జరిగి ఉంటుంది. పోలీసు దాడుల సమయంలో కూడా రెండు రోజులకు ఒకసారి వచ్చి కలసి పోతున్న వ్యక్తి. ఇంతవరకూ వారం రోజులుగా రాలేదంటే,ఆయన్ను మూసేసి ఉంటారనే అనుకోవాలి. ఆయన్నే మూసేస్తే రేపు బయటకు వెళ్తే మనల్ని మాత్రం మూసివేయరనే నమ్మక మేమిటి?" అన్నాడు హనుమంతు.

"పోలీస్ లాకప్ పగులగొట్టి పదిహేను మందిమి బయటకు వచ్చాము. అందులో ఒకతె వీరమ్మ చచ్చిపోగా మిగిలిన పద్నాలుగు మందిమీ బతికి ఉన్నాము. బయటికి వెళ్లిన వెంటనే పోలీసు లాకప్ నుండే పారిపోయి వచ్చిన మా నరాలు వాళ్ళుకోసి సమాధి చేస్తారు" అన్నాడు పోలయ్య ఆవేశంగా.

"మనం ఒకడిమీద విశ్వాసం ఉం చాము. అతడితో ఏమీ సంప్రదించకుండా బయటపడ్డామనుకో! తిరిగి దెబ్బతింటే తర్వాత బాధపడటంవల్ల లాభం ఏమీ ఉండదు" అంది జలకమ్మ.

తర్జన భర్జనలు సాగించారు రాత్రంతా. చివరకు ఏ ఒకరిద్దరో తప్ప మిగిలినవారు బయటకు పోవడానికి అంగీకరించలేదు. ఇదేదో పెద్ద ఎత్తుగడగానే వాళ్లు భావిస్తు న్నారు. తమను నమ్మించి బయటకులాగి నాశనం చేయడానికి సిద్ధపడుతున్న ఎత్తు గడలా వారి దృష్టిలో ఉంది.

అక్కడి నుండి ఎవరిచోటుకు వాళ్లు వెళ్లారు.

హనుమంతు, ఎల్లయ్య, పోలయ్య, పెదవీరిగాడు, చిన్నవీరిగాడు కలిశారు తిరిగి. అప్పటికే చాలా పొద్దుపోయింది.

"ఏం చేద్దాం?" అన్నాడు నిశ్శబ్దాన్ని భంగం చేస్తూ.

"ఏం చేయాలి? రెడ్డి కొరకు ఎవరో ఒకరు నంద్యాలకు పోవాలి"

"అమ్మో ! నంద్యాలకా ? అందరం లాకప్‌నుండి వచ్చినవాళ్లమే! మనం కన్పిస్తే పీల్చిపారేస్తారు పోలీసులు" అన్నాడు గుండెలమీద చెయ్యివేసి హను మంతు.

"భయపడితే లాభంలేదు. పోలూరు మీదుగా వెళ్తే పోలీసు స్టేషనులు నంద్యా లలో మనకు తగలవు. జులేఖమ్మ ఇల్లు ఇటువైపే ఉంది. అక్కడికి వెళ్తే వివ రాలు తెలుస్తాయి. రాత్రికి వెళ్లి రాత్రే తిరిగి రావచ్చు" అన్నాడు పెద్దవీరిగాడు.

అందరూ తలలూచి ఆలోచిస్తున్నారు. వెళ్లి వస్తే వివరాలు తెలుస్తాయి. లాయరు వద్దకు వెళ్తే మరిన్ని వివరాలు తెలుస్తాయి. కానీ, లాయరు ఇల్లు టౌనుమధ్యలో ఉంది. ఏ బీటు కానిస్టేబుల్ చూసినా చెంచు వాళ్లంటే మహామంటగా ఉన్నారు. అందు వల్ల జులేఖ ఇంటివద్దకు పోలయ్యా, ఎల్లయ్యా ఇద్దరూ పోవాలని నిర్ణయించారు.

మరుసటి రోజు చీకటిపడేసరికి కొండలు దాటారు.

మూలపేటకు వెళ్లి జులేఖ ఇంటి తలుపు తట్టారు.

చాలా సేపటికిగానీ తలుపు తెరవ లేదు. వాళ్లు భయంతో ఉన్నారు. తలుపు తట్టితే ఏం వచ్చి మీదపడుతుందోనన్న ఆందోళన. చివరకు ముసలమ్మ వచ్చి తలుపుతీసింది. తైలసంస్కారం లేకుండా జుట్టు విరబోసుకున్న ఇద్దరూ చెంచులే అయి ఉంటారనుకుంది. లోపలకు రానిచ్చి తలుపు వేసింది. హాలులో కూర్చున్నారు.

"ఎవరూ? అంది జులేఖ."

"చెంచువాళ్లలా ఉన్నారు."

"లోపలకు రమ్మను"

ఇద్దరూ లోపలకు వెళ్లారు..లోపల జులేఖ మంచంమీద పడుకొని ఉంది. ఆమె ముఖం మూర్చరోగిలా పాలిపోయి ఉంది.

రెడ్డి కొరకు వచ్చామనీ, ఎక్కడున్నారో చెప్పమనీ అడిగారు.

జులేఖ ఏడుస్తూనే జవాబు చెప్పింది. ఈ వారం రోజులుగా బయట జరిగినది – కలెక్టరుతో పోట్లాట, జైలుకు వెళ్లడం చెప్పి, "మీరయినా ఇక బయటకు వచ్చి బతుకవచ్చు కదా! ఆ అవకాశం ఇచ్చారట కదా!" అంది.

"మేం నమ్మం. నమ్మించి ఏదో చేయ దానికి వాళ్లు చేస్తున్న పని ఇది."

"లోపలుండి ఏం చేస్తారు? ఎన్నాళ్లని ఆ విధంగా పడి ఉంటారు?"

"చేసేది చేస్తూనే ఉంటాం. ఈ ప్రాంతం కాకుంటే ఇంకో ప్రాంతం పోతూ ఉంటాం. కొండలున్నంతవరకూ మాకు భయం లేదు."

ఆమె మాట్లాడలేదు. అతణ్ని విడిపించేదానికి వీళ్లు చేసే ప్రయత్నం ఏమీ లేదు. ఆ శక్తి వాళ్లకు లేదు.

"ఆయన కొరకు ఏదైనా ప్రయత్నం చేస్తున్నారా అమ్మగారూ!" అన్నాడు పోలయ్య. తల ఊపింది జులేఖ.

"చేస్తున్నాం. నెరవేరడంలేదు. కనీసం బెయిల్ మీద తెచ్చుకోవాలని తిరుగుతున్నాం."

వాళ్ళుమాట్లాడలేదు. వచ్చినపని అయిపోయింది. ఏమయ్యాడో, అనుకుంటున్న మనిషి, జైలు చేరాడని తెలిసింది. అక్కడ ఎక్కువసేపు ఉండడంకూడా మంచిది కాదు. బయటపడితే తామూ లోపలకు పోకతప్పదు. లేచి వెళ్తున్నామని చెప్పారు.

"అన్నం తిని వెళ్లండి. వండింది అలాగేఉంది" అంది జులేఖ వారినిచూస్తూ. వాళ్లు వద్దని లేచి తలుపు తీసుకొని బయటకు వచ్చారు. ఇద్దరూ తిరిగి తోవన పడి తెల్లవారుఝామున కోనలో చేరారు. అందరూ చుట్టుకున్నారు వివరాలకొరకు. జరిగిన వివరాలు చెప్పారు.

"ఏం చేద్దాం ఇప్పుడు?" అన్నాడు ఆతృతగా హనుమంతు. ఎవరూ జవాబివ్వలేదు.

"కొందరిని బయటకు పంపిద్దాం. ఏం జరుగుతుందో చూద్దాం. వారి జోలికి రాకుంటే మనమూ బయటకు వెళ్దాం" అన్నాడు నాగడు. నిర్ణయించుకున్నారు కుర్రకారు.

# నాణ్యత కొండెత్తు...వెల వీసమెత్తు.

అమూల్ వారి న్యూట్రమూల్. అదే, శ్రేష్ఠతకు హామీ. పరిపుష్టమైన కోకో. హితకరమైన అమూల్ పాలు. ప్రశస్తమైన మాల్ట్. అతి ముఖ్యమైన విటమిన్లు, ఖనిజాలు. మరి సాటిలేని ఆ శక్తికారక లక్షణాలు.
ఇవన్నీ మీకు మిగత వాటికన్న ఇంచుమించు 4 రూపాయిలు తక్కువ వెలకు!
న్యూట్రమూల్ వస్తాదుగా అవండి...
ఆ తేడా ఆనందించండి.



మిగతవాటికన్న
ఇంచుమించు
4 రూ. చవక!

ఇటువంటి ఆహార పానీయాల ధరల పోలిక (రూ.)*
నాన్ ఫ్లెక్సిబుల్ ప్యాకేజింగ్

| | 500 గ్రా. | 800 గ్రా. | 1000 గ్రా. |
|---|---|---|---|
| న్యూట్రమూల్ డబ్బా | 13.83 | – | 26.67 |
| మాల్టోవా సీసా | 17.58 | – | – |
| బోర్న్‌విటా డబ్బా | 17.68 | 26.97 | – |
| బూస్ట్ సీసా | 18.87 | – | – |

*మార్చి '81లో కొనుగోలుదారుల గరిష్ఠ ధర. స్థానిక పన్నులు అదనం.











మార్కెట్ చేసేవారు:
గుజరాత్ కో-ఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్, ఆనంద్. 388 001

ఆ వెధవలకు లొంగడమేమిటి? అటో ఇటో తేల్చుకుందాం.మనం గొర్రెలం కాదు కొన్నాళ్ళు మేపడానికీ, ఆ తర్వాత నరక డానికీ! కొన్నాళ్ళు మనల మర్యాదగానే విడుస్తారు. మళ్ళీ ఎక్కడో ఏదో దొంగ తనం జరుగుతుంది. దానికి మనమే తిరిగి బాధ్యులం. ఆ రోజు గొర్రెలాగా చంపే స్తారు. వీరితో ఈ బాధలు పడటంకంటే శాశ్వతంగా తిరగబడటం మంచిది" అన్నాడు పెదవీరిగాడు.

పెద్దలు నచ్చచెప్పారు. చివరకు కొందరు మర్నాడు ఉదయమే బయటకు వెళ్లడానికి నిర్ణయించారు. రెండురోజులు చూసి, మిగిలినవారు తర్వాత వెళ్లవచ్చు.

ఉదయం తుమ్మగూడెం కొందరూ, చెంచుగూడెం కొందరూ, సుగాలిగూడెం కొందరువెళ్లారు.వారి ముఖాలు చూడడానికి ఎదురుచూస్తున్న పిల్లలు, ముదుసలులు ఆనందంతో కౌగిలించుకుని ఏడ్చారు. చెంచులు తిరిగి ఇళ్లకు వచ్చిన విషయం పోలీసుస్టేషన్‌కు తెలిసింది. యస్. పి.కి, కలెక్టరుకు ఫోన్ చేశారు. వారిమీద ఎట్టి చర్య తీసుకోవద్దని యస్. పి. తెలిపాడు.

క్రమక్రమంగా ఒక్కొక్కరే తిరిగి రావడం ఆరంభించారు. ఆదివారం పాణ్యంలో జరిగే సంతలో తిరిగి చెంచు వాళ్ళు కన్పిస్తున్నారు. నలభైరోజులు పైగా పాణ్యం విడిచి వచ్చారు. తిరిగి నలభై రోజుల తర్వాత జనసమ్మర్దంలో అడుగుపెట్టారు. లాకప్ నుండి పారి పోయి వచ్చిన వాళ్లను కూడా పోలీసులు చూశారు. కానీ, కలుగచేసుకోడానికి అది సమయం కాదు. ఈ గాయం మాని మరచిపోవాలి. అప్పుడు తిరిగి తీసుక వచ్చి బాదాలనుకున్నారు పోలీసులు. ఈ సమయంలో ఏం చేసినా తిరిగి యధాస్థితికి వస్తారు.

చెంచులు తిరిగి పొలాలకు కాపలా ఒప్పుకుంటున్నారు, పొలాల్లో కాపురాలు పెట్టారు. వారిని గురించి పట్టించుకోవడం పోలీసులు మానుకున్నారు. వారికీ తెలుసు ఈ గాయం మానితే వాళ్ల వీపులు తిరిగి చిట్లగొట్టడం జరుగుతుందని. వీరికి తెలుసు. మళ్ళీ ఈసారి పట్టుకోవడమే, చేతులూ కాళ్లు నజ్జునజ్జుగా నలగదంచు తారని. అయినా అంతకంటే గత్యం తరం లేదు. కోనల్లో పడి ఉంటే తిండి లేక చావాలి. తిండి కొరకు దోపిడీ, దానిమీద కోపంతో కాల్పులు!

వాహనాలు పునరుద్ధరించబడ్డాయి. బస్సులు, కార్లు, లారీలు, టాక్సీలు, బళ్లు, మనుషులు యధావిధిగా రోడ్డు వెంట ఒంటరిగానే తిరుగుతున్నారు. పోలీసులు కన్పిస్తే చెంచులు పక్కకు తప్పుకొని, ఓడిన వాడు తలవంచుతున్నట్లు ఫీలవుతూ తిరుగుతున్నారు.

వెంకటరెడ్డికి బెయిలివ్వలేదు. కేసు కూడా ఆలస్యం లేకుండా తేల్చాలని వాయిదాల మీద వాయిదాలు వేశారు. రెచ్చి పోయిన చెంచువాళ్ళను విడిచారు. రెచ్చ గొట్టాడన్న ఆరోపణతో అతన్ని కోర్టుకు ఈడ్చారు.

రెండునెలల విచారణ తర్వాత ఫస్టుక్లాస్‌మేజిస్ట్రేటు కోర్టులో మూడు నెలల శిక్ష విధిస్తూ తీర్పు చెప్పారు.

జులేఖ ఏడుస్తూ అప్పీలు కొరకు ప్రయత్నించమని లాయరును కోరింది. లాయరు వాదించాడు. "ఇంకా ఎందుకు అనవసరమైన రాద్ధాంతం! కలెక్టరును లెక్క చేయకుండా మాట్లాడినందుకు అతడు తన పవర్ చూపించడానికి ఈ

పని చేశాడు. అయినా ఇందులో నష్టమేం లేదు. రెడ్డి అంటూనే ఉన్నాడు జైలుకు వెళ్ళిరావాలని. ఈ అవకాశం ఎలాగూ వచ్చింది. అప్పీలు చేసినా, వాళ్లు బెయిల్ ఇవ్వరు. అప్పీలు మీద తీర్పు అయ్యే వరకూ జైలులోనే ఉండాలి. మరో నాలుగు నెలలకు కానీ అప్పీలు మీద తీర్పు పూర్తి కాదు. నాలుగు నెలలు లోపల ఉండటంకన్నా. శిక్ష అనుభవించి రెండున్నరనెలల్లో బయటకు రావచ్చు. పదిహేను రోజులుశలవులకింద పోతాయి. అందువల్ల ఇక అప్పీలు వద్దు. రాజీ చేసుకొని ఉంటే పరిస్థితి బాగుండేది. కలెక్టరు ఆ విధంగా చేయకుండా ప్రవర్తించాడు. కానీ, అతడు అనుకున్నట్లు ఇంతటితో పోరు ఆగదు. చెంచువాళ్లను వెంటాడకుండా పోలీసులు ఉండరు. పోలీసులను ఎదిరించకుండా చెంచువాళ్లు ఉండరు. భవిష్యత్తులో రాజీ కొరకు కలెక్టరు ప్రవర్తించినా రెడ్డి వినడు. ఇది ఒకందుకు మంచిదే!" అన్నాడు లాయరు.

"ఈ ప్రాంతం నుంచి నేనుకూడా వెళ్లిపోతానండీ! ఇక ఇక్కడ ఉండలేను" అంది జులేఖ.

"వెళ్లమ్మా! ఆ ఇల్లు అమ్మేసి వచ్చిన డబ్బుతో ఎక్కడయినా హాయిగా బతుకవచ్చు. ఈ విధంగా జీవించేదానికంటే కొంత పొలం సాగుచేసుకుంటే మీ జీవితాలు దొర్లిపోతాయి."

జులేఖ మాట్లాడలేదు. విషణ్ణవదనంతో ఇంటికి వచ్చింది. తల్లికి వివరాలు చెప్పింది.

రెడ్డిని జైలు మార్చడానికి ఎస్కార్ట్ వచ్చింది.

ఎస్కార్ట్‌కు లంచం పడేసి, అతడితో రెండు గంటలసేపు తీరికగా మాట్లాడింది. తాను కూడా వెళ్లిపోతున్నట్లు చెప్పింది. "ఎక్కడో చోట స్థిరపడిన తరువాత ఉత్తరం రాస్తాను. ఎలాగూ నీవు ఈ రెండునెలలూ రావుకదా" అంది.

ఆమె మాటలకు అతడు జవాబివ్వలేదు. జరిగినదాన్ని గురించి ఆలోచిస్తున్నాడు.

'ఎందుకు ఇలా జరిగింది?'

కలెక్టరు ఇందువల్ల ఏమీ సాధించలేడు. తిరిగి మరోసారి అవకాశం లేకుండా పోగొట్టుకుంటాడు. పోలీసులు ఎలాగూ ఊరుకోరు, చెంచులూ ఊరుకోరు. తిరిగి పూర్వ పద్ధతే. ఏదో ఒక తప్పు చేయడం, దొరకడం, చేయడం, దొరకడం!

'వారికి కావలసిన వసతులు ఏర్పరచడానికి బదులు అడిగిన వాళ్లను జైలుకు పంపి, వారిని బికారులుగా చేసినంత కాలం ఇది ఇంతే రగడ! ఈ కలెక్టరు ఈ రోజు ఉంటాడు, రేపు పోతాడు. ఈ చెంచులు ఈ రోజు ఉండి రేపు వెళ్ళేవాళు కాదు. వారికి శాశ్వతంగా తగిన రక్షణ ఏర్పడనంతవరకూ ఇటువంటి కలెక్టర్లను వాళ్లు లెక్కచేయరు, అనుకున్నాడు.

తాను కలెక్టరును ఎదిరించి మాట్లాడ్డంలో తప్పులేదన్న విశ్వాసం ఇప్పటికీ అతనికి ఉంది. దానికి ఫలితంమూడు నెలలు జైలుశిక్ష. 'ఇదో గొప్ప విషయం కాదు. కానీ అధికారుల దురుసుతనం, దానికి బలిఅయ్యే సామాన్య జనం కష్టాలే గొప్ప విషయాలు' అనుకున్నాడు.

ఆరాత్రే రైలు ఎక్కాడు ఎస్కార్టుతో కలిసి.



# చతుర

## పెన్సిళ్ల దొంగ

"వచ్చావా యశోదా...రా... అసలు నేనే నీకోసం వద్దామనుకుంటున్నాను."

"అంత పనేమొచ్చిందండీ నాతో.."

"వచ్చింది కాబట్టే అనుకోటం. ముక్కయి వంగందే మానై వంగుతుందా అన్నారు. ఎరుగుదువా?"

"అసలు సంగతి ఏమిటండీ?"

"ఇంకా ఏమిటని అడుగుతున్నావా? ఇప్పుడే మేలుకోకపోతే అనక తోటకూర నాడే చెప్పకపోతివి కదా అమ్మా అనే పరిస్థితి ఏర్పడుతుంది ఏమనుకున్నావో కాని"

"అసలేం జరిగింది తాయారమ్మ గారూ? మీరనేది ఎవర్ని గురించి?..."

"ఇంకా ఎవర్ని గురించి? మీ సుపుత్రుడి సంగతే"

"మావాడా? వాడేం చేశాడు"

"అదే చెప్పబోతున్నా. ఊరికే పిల్లల్ని కనగానే సరికాదు. వారిని జాగ్రత్తగా పెంచటం కూడా తెలిసుండాలి"

"అసలేం జరిగిందో చెప్పండి"

"ఇంకా యేం జరగాలి? మీవాడు స్కూల్లో ఏం చేస్తున్నాడో ఎరుగుదువా?"

"ఏం చేస్తున్నాడు?"

"ఇంకేం చేస్తున్నాడు? దర్జాగా దొంగతనాలు చేస్తున్నాడు."

"మా వాడు దొంగతనాలు చేస్తున్నాడా?"

"ఆహాఁ! దివ్యంగా దొంగతనాలు చేస్తున్నాడు. యినాళ చిన్న చిన్నవి అవుతున్నాయి. రేపు పెద్ద పెద్దవి అవుతాయి"

"మావాడేం దొంగతనం చేశాడండీ?"

"ఏమిటా? పెన్సిళ్లు. మీవాడు రోజూ మావాడి దగ్గర నుంచి పెన్సిళ్ళు దొంగిలించుకొస్తున్నాడు"

"నిజమా?"

"ఇంకా నిజమా అని అడుగుతున్నావా? మావాడు స్కూలుకు రోజుకో కొత్త పెన్సిలు పట్టుకెళ్లటం, సాయంకాలానికి వొట్టి చేతుల్తో తిరిగి రావటం..నాలుగు రోజుల నుంచి యిదే వరస"

"........."

"ఆ పెన్సిళ్లన్నీ పక్కనే కూర్చునే మీవాడు కాకపోతే మరెవరు దొంగిలిస్తాడు నువ్వే చెప్పు?"

"........."

"ఏం మాట్లాడవేం? అవున్లే యింకా



# కతలు

ఏం మాట్లాడతావ్ దొంగతనం బయటపడ్డ తర్వాత. అసలు పెన్సిళ్ళు పోతున్నాయని కాదు నా బాధ. మీ వాడు చెడిపోతున్నాడనే".

"........."

"పోతేపోయాయి వెధవ పెన్సిళ్లు. అసలవేం లెక్కకాదు మాకు''

"అదేమన్న మాటలెండి. చిన్న వస్తువులయినా, పెద్ద వస్తువులయినా ఊరికెనే రావు కదా..."

"ఎందుకురావు? అదే నే చెప్పబోయేది. అసలా పెన్సిళ్ళన్నీ మా వాడు ఆఫీసునుంచి తీసుకొచ్చినవే. మా ఆయన ఆఫీసునుంచి వచ్చేటప్పుడు రోజుకో



పెన్సిలు జేబులో వేసుకొస్తారు ఎవరూ చూడకుండా. కాబట్టి పెన్సిళ్ళకు మాకేం కరువులేదు. నా బాధంతా మీవాడు చెడిపోతున్నాడనే''

"........."

"అయ్యో అదేం అలా మాటల మధ్యలోనే లేచిపోతున్నావ్? పైగా ఆ నవ్వేమిటి?నీ మంచి కోసమే చెబుతుంటే"

—ఎస్.ఆర్. రావు

# అచ్చిరాదు

మేము అద్దెకు తీసుకున్న ఇల్లు మొదట్లో ఓ మాదిరిగా వుందనిపించినా, రాను రాను సున్నాలు, రంగులు లేని కారణాన భూత్ బంగళాలాగా కనిపించనారంభించింది. ఇంటికి ఎవరయినా వస్తే వచ్చేంత సిగ్గుగా వుండేది. అందుకే ఓరోజు పొద్దున్నే వుంటున్న ఇంటాయనను కలుసుకుని సున్నాల విషయం ప్రస్తావించాను.

అప్పుడాయన విచారంగా–

"మీరు నమ్ముతారో నమ్మరోగానీ, సున్నాలు వెయటం మాకు అచ్చిరాదండీ! వేయించిన మరుక్షణమే తప్పకుండా కీడు జరుగుతోంది. మా తాతగారి కాలంనించీ ఇలాగే గడుపుకొస్తున్నాము. ఏమీ అనుకోకండి" అన్నాడు.

ఏమనాలో తెలియక ఆశ్చర్యపోతూ ఇంటికి వచ్చేసాను. నెల తర్వాత సరిగ్గా ఒకటవ తారీఖున అద్దె కోసం తయారయ్యాడు ఇంటాయన. తలుపు తీయగానే నవ్వుతూ "కులాసానా" అంటూ లోపలికి రాబోయాడు.

"ఆ! ఆ! ఆగండాగండి!'' అన్నాను కంగారుగా.

"ఏం?" అన్నాడు తెల్లబోతూ.

''ఏం చెప్పమంటారు? మనిషికో రకం ఖర్మ. అద్దె ఇళ్ళు అచ్చిరావని నా జాతకంలో స్పష్టంగా రాసుంది. అది ఋజువయ్యింది కూడాను. ఒకవేళ అద్దె ఇంట్లో వున్నా, ఇల్లుగలవారితో దగ్గర సంబంధం... అనగా ఇంట్లోకి ఆహ్వానించటం, పక్కనకూర్చుని మాట్లాడటం, చేతికి డబ్బు అందించటం వంటివి పనికి రావన్నారు. తప్పదుకదా మరి? ఏమీ



అనుకోకండి. అలా కూచోండి. ఓ కుర్చీ తీసుకొస్తాను'' అన్నాడు.

నా మాటలునమ్మాడో లేదోగానీ, నేను గడపమీద పెట్టిన డబ్బు మొహం మాడ్చుకుంటూతీసుకునివెళ్ళిపోయాడు. కానీ రాను రాను ఆయన మాఇంటి గుమ్మం ముందు ఎండలో స్కూలు కుర్రాడిలా అద్దెకోసం [illegible] మొహం వేసుకు నుంచోవటం, నేను డబ్బు తీసుకొచ్చి గడపమీద పెట్టటం, పక్క ఇళ్ళవాళ్ళు ఇదంతా చూసి ముసిముసి నవ్వులు నవ్వుకోవటం, యీ తంతంతా ఆయనకి మహా అవమానకరంగా తోచిందనుకుంటా...

ఓ రోజు అన్నాను—

"ఏమండీ మీకు కూడా ఈ బాధ [illegible]" అని.

"ఏముందండీ! [illegible] వాళ్ళకి అందరు! మీరు [illegible] వాకిది అలాగ" అన్నాను. ఆయన నావైపు అదోలా చూసి వెళ్ళిపోయాడు. మర్నాడు పొద్దుటే ఒక తాపీమేస్త్రిని. ఇద్దరు కూలీల్ని తీసుకొచ్చి రకరకాల రంగులు, సున్నాలు వేయించటానికి ఏర్పాట్లు ప్రారంభించాడు.

"అచ్చిరాదన్నారుగా" అన్నాను సందేహంగా.

"ఆ నామొహం లెండి!" అలాంటి చాదస్తాలు ఎన్నాళ్ళని పెట్టుకుంటాం? సున్నాలు వేయించకపోతే ఇల్లు కూలిపోతుందన్నాడు ఎవరో. దీన్ని బట్టి చూస్తోంటే సున్నం వేయించక పోతేనే అచ్చొచ్చేట్టులేదు. అందుకే వేయిస్తున్నాను" అన్నాడు.

—ప్రవీణ్

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications.
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly.
Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 Regd. No. H/ HD 1402

# ప్రియ తోడుగా ఉంటే చాలు...
# మరింత సంతృప్తి!

క్ ఫాస్ట్ తీసుకొనేవేళ పక్కన 'ప్రియ' ఉంటే
ప్రతి ఉదయం రుచులమయం. అదే 'ప్రియ'
కర్షణలోని రహస్యం.నోరూరించే పలురకాల
పచ్చళ్ల లో మీకు కావలసింది ఎన్నుకోండి.

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ 300,
650 గ్రాముల సీసాల్లో దొరుకుతాయి.

* మామిడికాయ * నిమ్మకాయ * టొమాటో
* అల్లం * గోంగూర * ఉసిరికాయ * చింతకాయ
* పండు మిరపకాయ * వంకాయ
తీపిరకాలు : * మామిడికాయ * అల్లం




ప్రియ ఫుడ్స్
ప్రైవేట్ లిమిటెడ్

Marketed by:
MARGADARSI
MARKETIN